159 అల్పబుద్ధా వధికృతే, శ్రేష్ఠాన్ సర్వాన్ వ్యపోహతి ।
పాదరక్షాశన శ్శ్వా కిం, వేత్తీక్షో ర్వేమ! మాధురీమ్ ॥

160 బంధూన్ విపది వీక్షస్వ, భట స్యాపి గుణం భయే ।
సంప్రాప్తే వేమ! దారిద్ర్యే, గతిం పత్న్యా విలోకయ ॥

161 పతి ర్మన్మథతుల్యోఽపి, ససౌఖ్య మపి జీవితమ్ ।
నాస త్యుజ్ఝతి నైసర్గం, యథా శ్వా వేమ! దుగ్ధపః ॥

162 యది వేత్తి పతి ర్హంతి, విప ద్భవతి భూవరాత్ ।
సర్వనిందాస్పదం వేమ!, కౌలట్యం నిరయం ఖలు ॥

163 వశీకర్తు మశక్త స్త్రీసం, “పశ్చా„ది త్యుక్తి రజ్ఞతా ।
వృక్షఃపరివృద్ధో హి నఖై, శ్ఛేత్తుం కిం వేమ! శక్యతే? ॥

164 ప్రక్షాళితం భల్లుకస్య, చర్మ నైతి వలక్షతామ్ ।
తాడితా ప్రతిమా దారోః, కిం వేమ! గుణినీ భవేత్? ॥

---

159 అల్పబుద్ధివాని కధికార మిచ్చిన, దొడ్డవారినెల్లఁ దొలఁగఁ గొట్టు ।
చెప్పుఁ దినెడి కుక్క చెఱకు తీపెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

160 ఆపదందుఁ జూడు మారయ బంధుల, భయమువేళఁ జూడు బంటుగుణము ।
పేదపడిన వెన్క పెండ్లాము గతిఁజూడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

161 మగడుమదనుఁడైన మంచికాపురమైన, సహజ మేల మాను జారకాంత? ।
పాలుఁద్రావుకుక్క పడిపడి పోవదా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

162 పురుషుఁడెఱుఁగఁజంపు భూపతివినఁజేటు,అఖిలనిందలకును నాలయంబు,
పరపురుషగమనము ప్రత్యక్షనరకంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

163 ఆలివంచలేక యధమత్వమునముండి, వెనుక వంతు ననుట వెఱ్ఱితనము ।
చెట్టు ముదర నిచ్చి చిదిమినఁ బోవునా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

164 ఎలుగు తోలుఁ దెచ్చి యెందాక నుతికిన, నలుపె కాక యేల తెలుపుఁ గల్గు ।
కొయ్య బొమ్మఁదెచ్చి కొట్టిన గుణియౌనె?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

165 యావ చ్ఛ్వపుచ్ఛం నాళస్థం, తావ దేవ భవే దృజు।
బహూపదిష్టోఽపి ఖల, స్స్వార్థం వేమ ! న ముంచతి ॥
166 యాతిక్రమతి పత్యుక్తిం, న సా భార్యా హ్యసద్గుణా।
లలాటలిఖితం వేమ !, తాం త్యక్త్వా విపినం వ్రజేత్ ॥
167 భార్యా త్వవశ్యా పత్యు స్స్యాత్, మృతి ర్దంశోద్యతః ఫణీ।
దేహావిష్టా పిశాచీ చ, రాక్షసీ హ్యాత్మవైరిణీ ॥
168 అసతీ శుల్కనష్ట్యై స్యాత్, భటో భీ తోఽన్ననష్టయే।
భృతినష్ట్యై భవే ద్వేమ !, దాసీ కార్యేషు కృత్రిమా ॥
169 దోష స్సర్వజనానాం స్యాత్, సర్వే దోషగవేషిణః।
వేమ ! దోషాన్వేషిణ స్తు, స్వదోషం న విదంతి హి ॥
170 చోరో యాత్రాస్థలం ప్రాప్య, హర్తుం విత్త ముపక్రమేత్ ।
నేక్షే ద్వేమ ! స్వామినం శ్వా, భాండాన్వేషీ హి గేహగః ॥

---

**165** కుక్క తోఁకఁ దెచ్చి గొట్టంబుఁ జేర్చినఁ, గ్రోవి రీతి నుండుఁగొంత తడవు।
ఎంతఁ జెప్పఁ జెడుగు పంతంబు మానునా?, విశ్వదాభిరామ వినురవేమ! ॥
**166** ఆలు మగని మాట కడ్డంబు వచ్చెనా?, ఆలు కాదు వాని వ్రాలుకాని।
అట్టి యాలు విడిచి యడవి నుండుట మేలు, విశ్వదాభిరామ వినురవేమ !॥
**167** మాటవినని యాలు మగనికిమృతి యౌను, ఓర పడగ సర్ప మొంటిగ్రహము।
తనకుఁ గాని యాలు దానవు రాలయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
**168** ఓజ మాలు పొలఁతి యోలి మాడల చేటు, పోటు కెడలు బంటు కూటిచేటు।
పనికి మాలు తొత్తు బత్తెంబు చేటురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
**169** తప్పు లెన్ను వారు తండోపతండంబు, లుర్వి జనుల కెల్ల నుండుఁ దప్పు।
తప్పు లెన్ను వారు తమతప్పు లెఱుఁగరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
**170** ముచ్చు యాత్రబోయిముల్లెవిప్పునుగాని,మొక్కపొద్దులేదుమొనసియెపుడు
కుక్క యిల్లుఁ జొచ్చి కుండలు వెదుకదా?, విశ్వదాభిరామ వినురవేమ !॥

171 మిథ్యాభిభాషిణం వేత్తి, గ్రామణీ స్సత్యవాదినమ్ ।
స్వామీ వేత్తి తథా వేమ!, భార్యా వే త్త్యతిభక్షకమ్ ॥

172 శా ట్యుష్ణీషం కంచుకం చ, తాటంకే చాంగుళీయకమ్ ।
యస్య లంబోదరం తం హి, వేమ! కాంక్షంతి బాంధవాః ॥

173 తరణా న్నా స్త్యగాధత్వం, మరణా న్నాస్తి దుర్వ్యథా ।
కౌపీనా న్నాస్తి దీనత్వం, వేమ! కించి దపి ధ్రువమ్ ॥

174 ప్రౌఢానాం చంచలదృశాం, విభ్ర మాన్వీక్ష్య కిం భ్రమైః? ।
వేమ! బాహ్యాని రూపాణి, కిం నిరీక్ష్య వృథా శ్రమైః? ॥

175 బహ్వాధీతే తర్కవాదః, న తత్రజ్ఞాన మవ్యయమ్ ।
కోశకారక్రిమి రివ, వేమ! తాదృ గ్వినశ్యతి ॥

176 సంపన్నపురుషం కామం, మన్యంతే వేమ! యోషితః ।
పశ్యంతి కామసదృశం, చండాల మివ నిర్ధనమ్ ॥

---

171 కల్ల లాడు వాని గ్రామకర్త యెఱుంగు, సత్య మాడు వాని సామి యెఱుఁగు ।
పెక్కు తిండి పోతుఁ బెండ్లా మెఱుంగురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

172 పాగ పచ్చడంబు పైన కూసంబును, పోఁగు లుంగరములు బొజ్జకడుపుఁ ।
గలిగినట్టివాని గందురు చుట్టాలు,విశ్వదాభిరామ వినురవేమ!॥

173 ఈతకంటె లోతు సెంచంగఁ బనిలేదు, చావుకంటెఁ గీడు జగతిలేదు ।
గోచిపాతకంటెఁ గొంచెంబు మఱిలేదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

174 జాణలైనయట్టి చపలాయతాక్షుల, వలపు లరసి చూచి భ్రమయ నేల? ।
బయలి రూపు లెల్లఁబరికింపఁగా నేల?,విశ్వదాభిరామ వినురవేమ! ॥

175 తఱచుఁ జదువఁ జదువఁ దర్కవాదమెకాని, దివ్యజ్ఞానమచటఁ దేట పడదు,
పసిరికాయపుపుగు పగిదిని జెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

176 కలిమిఁ గలిగెనేని గాముఁగాఁ జూతురు, లేమిచేతఁ జిక్కి లేవలేని ।
మదనువంటిమగని మాలఁగాఁ జూతురు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

177 కామ స్సోమో ధనీమర్త్యః, భృశం రాజతి తేజసా ।
విత్తహీనో నరో నూనం, రిక్తో వేమ ! ప్రవర్తతే ॥

178 యోషిల్లావణ్య మసమం, భాతీతిదం విటచక్షుషామ్ ।
నేత్రే కనీనికా వేమ !, తత్ర స్యాత్ పీఠమర్దకః ॥

179 క్రిమినష్టం చాపి శాకం, గురవే న దిశం త్యహో ! ।
వేశ్యాయై దదతేఽత్యర్థం, తదూనో వేమ ! కిం గురుః ? ॥

180 మధురే ష్వీహ సర్వేషు, ప్రాణో మధుర ఏవ హి ।
ప్రాణా త్స్వర్ణం తతో వేమ !, మధురం తరుణీవచః ॥

181 శర్కరా మధు పీయూష, పన సేక్షు రసా దపి ।
ప్రేయసీవచనం నూనం, వే మాతిమధురం భువి ॥

182 జారా స్త్రీ కాంక్షతే జారాన్, సరసాన్ వేమ । నేచ్ఛతి ।
గోమయాశీ క్రిమి స్సమ్యక్, కిం వేత్తి మధురం గుడమ్ ? ॥

---

177 కలిగినమనుజుడుకాముండుసోముండు,మిగులతేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన రిత్తయై పోవును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

178 విటుల కనుల కెంతొ విభ్రమమైయుండు, సాటిలేనిపొలఁతి చక్కఁదనము ।
కంటిలోనిపాప కుంటెనగాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

179 గురువునకును పుచ్చుకూరైన నియరు, అరయ వేశ్య కిత్తు రర్థ మెల్ల ।
గురుఁడు వేశ్యకన్న గుణహీనుఁ డేమొకో !, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

180 తీపిలోన దీపి తెలియంగఁబ్రాణంబు, ప్రాణవితతికన్నఁ బసిడి తీపి ।
పసిడికన్న మిగులఁబడఁతి మాటలుతీఁపి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

181 పనస తొనలకన్నఁ బంచదారలకన్న, జుంటితేనెకన్న జున్నుకన్న ।
చెఱకు రసముకన్నఁ జెలిమాట తీపిరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

182 కొమ్మ ద్రిమ్మరైనఁ ద్రిమ్మరులనె కోరు, సరస విటులనేల నమ్మతించు ?
పేడఁదినెడిపురుగు బెల్లమే మెఱుఁగురా !, విశ్వదాభిరామ వినురవేమ! ॥

183 స్వబాంధవా దారపక్షే, మాతృపక్షే యథోచితాః।
పితృపక్షే జనా యే తు, దాయాదా వేమ! సర్వశః ॥

184 కిం వేత్తి శివభక్తం శ్వా, జంఘా మాకృష్య దంశతే।
ఆపణోర్ధ్వే స్థితా దాసీ, వేమ! కిం వేత్తి యోగినమ్? ॥

185 స్వనృపాలే నాయుధేన, వహ్నినా పరభార్యయా।
హాస్యప్రవర్తనం వేమ!, భవేత్ ప్రాణాంతకం నృణామ్ ॥

186 సుందరం సుత మీక్ష్య స్త్రీ, భవేత్ స్మరవశం వదా।
మానసం వేమ! పాపిష్ఠం, నిగ్రహీతుం న శక్యతే ॥

187 శర్కరాయా మధోర్వేమ!, రసాలస్య చ మాధురీ।
జ్ఞేయా నాభుంజతో జ్ఞేయా, పశ్యతో యోషి దోష్ఠయోః ॥

188 కథం స్యాన్నో బలీవర్దా, స్మహిషో వేమ! కేవలమ్।
నైల్య మే వాత్ర హేతు స్స్యా, దజ్ఞో యోగీ కి ముచ్యతే ?॥

---

183 అలివంకవార లాత్మబంధువులైరి, తల్లివంకవారు తగినపాటి।
తండ్రివంకవారు దాయాదు లౌదురు, విశ్వదాభిరామ వినురవేమ!॥

184 కుక్క యే మెఱుంగు గురులింగజంగంబుఁ, బిక్క యొడిసిపట్టి పీకుఁగాక।
సంతపాకతొత్తు సన్యాసి నెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

185 తనదు నృపతితోడఁ దగనాయుధముతోడ, నగ్నితోడఁ బరుని యాలితోడ।
హాస్యమాడు టెల్లఁ బ్రాణాంత మౌ సుమ్ము, విశ్వదాభిరామ వినురవేమ!॥

186 తరుణిసొగసుగాని తనయునిగన్నను, మరునికళలమించి మనముజాఱు।
పాపజాతిమనముఁ బట్టంగ రాదయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

187 తేనె పంచదార తియ్యమామిడిపండుఁ, దిన్నఁగాని తీఁపిదెలియరాదు।
కన్ను నింపువుట్టుఁ గామిని యధరంబు!, విశ్వదాభిరామ వినురవేమ!॥

188 ఎద్దుకన్నదున్న యేలాగు తక్కువ?, ఎఱుపులేకపోయి తఱిగె విలువ।
నే ర్పెఱుఁగనివాని నెరయోగి యందురా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

189 అనేకోక్తం వచో గ్రాహ్యం, ఏకోక్తం వేమ! నేష్యతే।
తూష్ణీంస్థితం నరం జేతుం, పురం సర్వం న శక్నుతే॥

190 కృతం గుణవతే శ్రేయః, లఘ్వప్యద్రిసమం భవేత్।
అగుణః కిం విజానాతి?, వేమ? శ్రేయోఽద్రిసన్నిభమ్॥

191 మాయా వేమ! సుతా జాయా, స్సుఖం దుఃఖం భవో మృతిః।
కల్పితైతావతీ మాయా, మృషాజీవితసంగతా॥

192 చండాలోఽస్థిరవాక్ మర్త్యః, ధ్వస్తాజ్ఞో భూప అంగనా।
వేమ! దైవం నిర్మహిమం, వ్యాఘ్రో మృన్నిర్మితః ఖలు॥

193 "హ్రీమంతో వయ,,మిత్యేవం, వీక్ష్య వేమ మమాయికమ్।
విస్మితాస్స్యు ర్జనా వేమ!, దైవం వేత్తి నిజత్రపామ్॥

194 దాతుం గోపయితుం వేమ!, భోక్తుం భర్తుమశక్నువాన్।
అవిద్యో నిరుపాయశ్చ, గచ్ఛ చ్ఛవ మితీర్యతే॥

---

**189** పదుగురాడు మాట పాటియై ధరఁజెల్లు,నొక్కఁడాడు మాటయెక్క దెందు,
ఊరకుండువాని కూరెల్ల నోపదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**190** గుణయుతునకు మేలు గోరంతఁ జేసినఁ, గొండయౌను వాని గుణముచేత।
కొండకొద్దిమేలు గుణహీనుఁడెఱుగునా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

**191** సుతులుసతులుమాయ సుఖదుఃఖములుమాయ, సంసృతియునుమాయచావుమాయ। మాయబ్రతుకు కింత మాయఁ గల్పించితి, విశ్వ॥ వినురవేమ!॥

**192** మాటనిలుపలేని మనుజుండు చండాలుఁ, డాజ్ఞలేని రాజునాడుముండ।
మహిమలేనివేల్పు మంటఁజేసిన పుల్లి, విశ్వదాభిరామ వినురవేమ!॥

**193** "సిగ్గువారల"మని సృష్టిలోపలివారు, వెఱ్ఱివేమనఁగని వెఱఁగుపడిరి।
తనకుఁగల్గు సిగ్గు దైవ మెఱుంగురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

**194** విడువ ముడువ లేక కుడువఁ గట్టఁగ లేక, వెరవులేక విద్య నొరయలేక।
వెడలలేనివాని నడుపీనుఁ గందురు, విశ్వదాభిరామ వినురవేమ!॥

195 దారిద్ర్యే లఘుచిత్త స్స్యాత్, సూతా వ్యాఘ్రీవ వర్తతే ।
వేమ ! కర్కశచిత్తస్య, కథం సంప ద్భవే దిహ ॥

196 శివార్పితా త్కించి దన్నాత్, పుణ్యలోకం వ్రజే న్నరః ।
అన్నదానా న్మహోత్కృష్టం, దానం వేమ ! న విద్యతే ॥

197 భోజనా దప్రియా ద్వేమ !, భక్ష్యనష్టి రభక్తితః।
పూజనాత్ పత్రనష్టి శ్చ, పాత్రదానా ద్ధనవ్యయః ॥

198 న వేత్తి స్వయ మాత్మాన, మన్యేభ్యో బోధతే కథమ్ ? ।
పశుతు ల్యోఽలసో వేమ ! బధ్నా త్యర్థాయ కర్మసు ॥

199 "లభేత్ పుణ్యసుఖం పుత్రా", దితి కర్మేహ చింతతే ।
వారణం పతితం వేమ !, మశకః కథ ముద్ధరేత్ ? ॥

200 బ హ్వాధీత్య బహు శ్రుత్వా, నైచ్యం త్యజతి నాధమః ।
క్షీరేణ ధౌత మంగారం, నైల్యం కిం వేమ ! ముంచతి ? ॥

---

195 లేనికాలమునకు లేకిమనమునొందు, నీనిన పులిరీతి నెఱుఁగకుండు ।
కఠినబుద్ధికలుగఁ గలి మెట్లు కలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

196 ఇంచుకంత కూన "మీశ్వరార్పణ" మన్న,పుణ్యలోకమునకుఁబోవు నతఁడు।
అన్నదానమునకు నధికదానము లేదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

197 ప్రియములేనివిందు పిండివంటలచేటు, భక్తిలేనిపూజ పత్రిచేటు ।
పాత్ర మెఱుఁగ నివి బంగాపు చేటురా, విశ్వదాభి రామ వినురవేమ । ॥

198 తన్నుఁ దానెఱుఁగఁడుతానెవ్వరికి నేర్పు, ప్రాలుమాలి తిరుగుపశువుకొడుకు।
కానుకొఱకె కాదె కర్మముల్ గట్టుషు?, విశ్వదాభిరామవినురవేమ ! ॥

199 సుతులవలనఁబుణ్యసుఖమునొందుదమని,మనుజుఁడుంచుగర్మమతముదవిలి
ఏనుఁగుపడియున్న నెత్తునా మశకంబు?, విశ్వదాభిరామ వినురవేమ ॥

200 ఎంతొ చదువుఁ జదివి యెన్ని విన్ననుగాని, హీనుఁ డవగుణంబుమానలేఁడు।
బొగ్గుఁ బాలఁ గడుగఁ బోవునా మలినంబు?, విశ్వదాభిరామ వినురవేమ !॥

201 నోద్వేజయేత్ ఖలూన్మత్తం, నేయా దున్మత్తజల్పితమ్ ।
అలర్కేణ సమం వేమ! న కుర్యా న్మృగయారతిమ్ ॥

202 పితృభ్యో దారపుత్రేభ్యో, ధనాయ వ్యథతే నరః ।
వేమ! బ్రహ్మణి సంసృష్టే, నాత్మన స్సంతి కేచన ॥

203 క్షౌమాంబరాణి తాటంకే, కాయపుష్టి శ్చ వీటికా ।
యస్య సంతీహ తం హీన, మపి వే మాహ్వాయంతి హి ॥

204 శిరో వస్త్రం శరీరం చ, మాలిన్య కలితం యది ।
వే మాగ్రజన్మాన మపి, వదం 'త్యపస, రే త్యత ॥

205 నాస్తి చింతా జనో గేహం, ప్రాప్నోతి పిశునే మృతే ।
వృకే మృతే ప్రరోదంతి, కిం మేషా వేమ! చేతసి ? ॥

206 వీధ్యాం నిందే ద్వేమ! రుద్ధా, క్రోశ తేఽగ్రే పతిం శపన్ ।
స్యా త్సావలుంఠా విక్రేతే, ధూర్తా కండోలగం పతిమ్ ॥

---

201 వెఱ్ఱివానిమిగుల విసిగించఁగారాదు, వెఱ్ఱివానిమాట వినఁగరాదు ।
వెఱ్ఱికుక్కఁబట్టి వేటాడవచ్చునా?,విశ్వదాభిరామ వినురవేమ !॥

202 ఆలుబిడ్డలు ధన మరయుఁ దల్లియుఁదండ్రి, కైమనుజుఁడుమిగులకష్టపడును
తనకు నెవరు లేరు తాను బ్రహ్మముఁ గన్న, విశ్వదాభిరామ వినురవేమ !॥

203 పూసపోగు లైనపుట్టంబు విడియంబుఁ, గాయపుష్టి మిగులఁ గలిగియున్న ।
హీనజాతినైన నిందు రమ్మందురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

204 మాసినతలతోడ మలినవస్త్రముతోడ, నొడల జిడ్డు తోడనుండెనేని ।
అగ్రజన్ముఁడైన నట్టె పొమ్మందురు, విశ్వదాభిరామ వినురవేమ!॥

205 కొండెగాఁడు చావఁ గొంప దనుకఁ బోవు, వంతు కింతె కాని వగపు లేదు।
కొంకనక్క చావ గొఱ్ఱె లేమిటి కేడ్చు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

206 వాడ కుఱికి తిట్టువలదన్న మొఱఁబెట్టు,ముందుమగనిదిట్టుమునుఁగుఁబెట్టు
గడుసుటాలు మగని గంపఁ బెట్టియు నమ్ము, విశ్వదాభిరామ వినురవేమ!॥

207 సర్వేభ్యః పాతకి న్యాశా, మునయో వంచితా స్త్రియా ।
వే మోద్వీక్ష్య విముంచంతి, తాం శుద్ధాత్మాన ఏవ హి ॥

208 సత్యవ్రతం జగ న్నిందేత్, సత్యం బ్రూయా న్న దుర్జనైః ।
మహాత్మ నైవ సంగత్య, వేమ! సత్యం వదే న్నరః ॥

209 గోలాంగూలాః కపిం నీత్వా, కృత్వా నూత్నాంబరాన్వితమ్।
యథార్చంతే తథా వేమ!, నిర్భాగ్యా నీతివర్జితమ్ ॥

210 స్వాంగే గంధం విలింపంతం, ఖర స్తాడయ తేఽంఘ్రిభిః ।
కృ తాఽనర్హజనాభ్యర్చా, వే మైవం స్యాద్ధి నిష్ఫలా ॥

211 సుఖాపేతం త్యజే ద్గ్రామం, త్యజేద్భార్యా మసద్గుణామ్ ।
రాజాన మ ప్యదాతారం, త్యజే ద్వే మాశు బుద్ధిమాన్ ॥

212 ఋణాదానం మూర్ఖమైత్రీ, దూష్యోక్తి ర్న్యాస ఏవ చ ।
ఏహ్యా హరిహరాదీనాం, వేమ! నై వాత్ర సంశయః ॥

---

207 ఆస పాప జాతి యన్నింటి కంటెను, ఆసచేత యతులు మోసపోరె ?।
చూచి విడుచువారు శుద్ధాత్మ లెందును, విశ్వదాభిరామ వినురవేమ!॥

208 నిజములాడువాని నిందించు జగమెల్ల, నిజములాడరాదు నీచుతోడ ।
నిజమహాత్ముఁగూడి నిజమాడవలయురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

209 కోఁతిఁబట్టితెచ్చి క్రొత్తపుట్టముఁగట్టి, కొండ్రముచ్చులెల్లఁ గొలిచినట్లు ।
నీతిహీనులొద్ద నిర్భాగ్యు లుందురు,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

210 ఖరముమేనినిండ గంధంబుఁ బూసిన, నేమి యెఱుఁగ లేక యెగసితన్ను।
ఈడుకాని వాని యిష్ట మీలాగురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

211 విడువవలయు నూరు విశ్రాంతి లేకున్న,విడువవలయునాలి విధముఁదెలిసి,
విడువవలయు రాజు వితరణి కాకున్న, విశ్వదాభిరామ వినురవేమ !॥

212 అప్పుఁ దీయ రోత హరిహరాదులకైన, మొప్పెతోడ మైత్రి మొదలరోఁత ।
తప్పుఁబలుకరోఁత తాకట్టిడుట రోఁత' విశ్వదాభిరామ వినురవేమ ! ॥

213 బోధ్యో జడో వత్సరేణ, బోధ్యో మూ న్యేకమాసతః ।
త్రింశదబ్దై రపి మనాక్, వేమ! మూర్ఖో న బోధ్యతే ॥

214 స్వభార్యా సాధుశీలాపి, రంభాతుల్యాపి స్వక్రియామ్ ।
జారో నోర్ఝతి వేమ! శ్వా, యథా చణ్డాల వాటికామ్ ॥

215 రజకో లులితం కృత్వా, వస్త్రం శుద్ధం కరోతి హి ।
హి తో ఉపదేష్టా శిక్షేత, యది స్యా త్తేన వేమ! కిమ్? ॥

216 సంప దీక్షేత్ పతిం ప్రేమ్ణా, దారిద్ర్యే నాభిమన్యతే ।
జీవంతమపి తం వేమ!, పశ్యే న్మృత మి వాంగనా ॥

217 శర్కరాక్షీరసమ్మిశ్రి, గోతుంబీ పాక ఏవ చ ।
న రోచతే హి దుర్బుద్ధేః, గుణం వేమ! కథం భవేత్? ॥

218 "మమేయం భూమి,,రిత్యుక్త్వా,వే మాపహాసతే మహీ ।
ధనం హాస త్యదాతారం, భీరుం హాసతి చాంతకః ॥

---

213 ఎద్దెఁదెలుపవచ్చు నేడాదికైనను, మౌని దెలుపవచ్చు మాసముననె ।
మొప్పెఁ దెలుపరాదు ముప్పదేండ్లకునైన, విశ్వదాభిరామ వినురవేమ! ॥

214 అలు రంభయైన నతిశీలవతియైన, జారపురుషుఁ డేల జాడమాను?।
మాలవాడఁగుక్క మరిగిన చందంబు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

215 చాఁకివాఁడు కోకఁ జీకాకుఁ బడఁ జేసి, మైలఁబుచ్చి మంచి మడువుఁజేయు,
బుద్ధిఁజెప్పువాఁడు గ్రుద్దిన నేమయా?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

216 కలిమినాఁడు మగని గామించి చూచును, లేమిఁ జిక్కునాఁడు లేవకుండు।
మనిన మగని నైన మడిసి నట్లుగఁ జూచు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

217 పాలు పంచ దార పాపర పండ్లలోఁ, జాలఁ బోసి వండఁ జవికి రావు ।
కుటిల మానవునకు గుణ మెట్లుకలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

218 "భూమి నాది"యన్న భూమిపక్కున నవ్వు, దానహీనుఁ జూచి ధనము నవ్వు।
కదనభీతుఁ జూచి కాలుండు నవ్వును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

219 దత్తే స్వభ్రాతృభి ర్వేమ !, "మమే తీదం, న చింతయేత్ ।
కృత్తే స్వపాదే కిం వేమ !, ఆత్మభ్రాతా ప్రరోదితి ? ॥

220 కాంతాం చ కనకం దృష్ట్వా, వివేకం వేమ ! నశ్యతి ।
నృణాం గతవివేకానాం, తత్త్వస్య మహిమా కుతః ?॥

221 యది యాచే దదాతారం, దాతా భవతి కిం పునః ? ।
నిమజ్జితం వేమ ! వార్ధౌ, దర్భస్స్యాత్కిం చ చీరణమ్ ? ॥

222 అదతో దారుదంతైః కిం ?, అపాణే ర్వలయై శ్చ కిమ్ ? ।
వేమ ! గార్దభతుల్యానాం, శ్మశ్రుభిః కిం జడాత్మనామ్ ?॥

223 "అధికోఽస్మ్యహ", మి త్యుక్త్వా,పథం గుల్మై ర్నిరోధయన్ ।
పాంథా న్నిహత్య తద్ద్రవ్యై, హృతే స్యా ద్వేమ! దోషభాక్ ॥

224 సాచీకరో త్యహి ర్భోగం, దిదంక్షు ర్వేమ ! నాశకః ।
మైత్రీం కరోతి రాజా చ, జిఘాంసుః కురుతే ప్రియమ్ ॥

---

219 తనదు భ్రాత లెల్ల దానంబుఁ జేయంగఁ, దనకుఁగల దటంచుమనఁగరాదు।
తనదు కాలుఁగోయఁ దనతమ్ముఁ డేడ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ !।

220 పంకజాక్షిఁగన్న బంగారుఁ బొడగన్న, దిమ్మువట్టు వేగ తెలివికెల్ల।
మనుజులకును దత్త్వ మహి మెట్లు గలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

221 దాతకానివాని దఱుచుగా వేడిన, వాఁడు దాత యౌనె వసుధలోన? ।
అవురు దర్భయౌనె యబ్ధిలో ముంచిన, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

222 మొండివాని కేల ముంజేతికడియాలు?, తొఱ్ఱివాని కేల కఱ్ఱపండ్లు? ।
గాడిదెలకునేల గడ్డముల్ మీసముల్, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

223 దొడ్డవాండ్లమనుచుఁ ద్రోవ డొంకలు కట్టి, అడ్డమైనజనుల నంటఁ గట్టి ।
దోఁచు కొన్న నట్టి దోష మెచటికిఁ బోవు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

224 పట్ట నేర్చుపాము పడగ నోరగఁజేయు, చెఱుపఁజూచువాఁడుచెలిమిఁజేయు।
జంపఁదలఁచు రాజు చనువిచ్చుచుండురా, విశ్వదాభిరామ వినురవేమ !

225 సేవాశ్రమం చ బహుధా, కృత్వైవం రాజమండలమ్ ।
న విశ్వసే ద్వేమ! సర్ప, మైత్రీ స్యాత్సా సహస్రశః ॥

226 విధినోక్తం న కృత్వాదా, వంచయిత్వోదరం భరః ।
సమాధాయ మనో వేమ!, దీనశ్వేవేహ వర్ధతే ॥

227 అహో! చిత్రం కామయంత్రం, స్త్రీబిందుతిలకం నరః ।
ధాళధళ్యం మేఖలాయాః, దృష్ట్వా వేమ! విముహ్యతి ॥

228 మహతోఽపి భవేన్మోహః, తన్మోహం యతమానసః ।
అథః కృత్య య దీక్షేత, వేమ! బ్రహ్మాత్ర దృశ్యతే ॥

229 నిరాశ్రయా సంయతంతో, అయచ్ఛంతో నిరోధకాః ।
శివస్య పూజా మారభ్య, వేమ! కాంచి న్నకుర్వతే ॥

230 శోధయిత్వాత్మని శివం, స్థిరాం భక్తిం కరోతి యః ।
స సర్వముక్త స్సర్వాత్మా, భవేద్వేమ! న సంశయః ॥

---

225 ఎంతసేవఁ జేసి యేపాటుఁ బడినను, రాచ మూఁక నమ్మరాదు రన్న !।
పాముతోటిపొందు పదివేలకైనను, విశ్వదాభిరామ వినురవేమ!॥

226 మొదలఁగ్రియనుదప్పి మోనంబుజేసియుఁ, బొట్టకొఱకెమనసుఁబొందుబఱచి।
బీదకుక్కరీతిఁ బెఱుగును మనుజుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

227 కడు విచిత్ర మరయఁ గామునియంత్రంబు, పువ్వుబోఁడిచుక్కబొట్టుఁగన్నఁ।
గాంచి బెళుకుఁ గన్నఁ గడు సొక్కువుట్టురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

228 ఎట్టివానికైనఁ బుట్టును మోహంబు, పుట్టు మోహ మెల్లఁబూడఁ ద్రొక్కి ।
గట్టిచేసిచూడఁ గనుపించు బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

229 పట్టుకొమ్మలేక బహుపాట్లుఁ బడువారు, పెట్టి పొయ్యలేక నెట్టువారు ।
ముట్టి శివుని పూజ మొదలె సేయఁగ లేరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

230 ఆత్మలోన శివుని ననువుగా శోధించి, నిశ్చలముగ భక్తి నిలిపె నేని ।
సర్వముక్తుఁడౌను సర్వంబుఁదా నౌను, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

231 శివార్చా న వినష్టస్యాత్, ప్రారభ్య న తాం త్యజేత్ ।
విహాయాదౌ నిర్మితాం తే, భిత్తిః కిం వేమ ! తిష్ఠతి ? ॥

232 కష్టే స్యా ద్దైవనిందాళుః, ఆత్మశ్లాఘాపర స్సుఖే ।
కారణం కష్టసుఖయోః, వేమ ! కర్మ పురాకృతమ్ ॥

233 కామానలాత్ క్షుధాగ్నే శ్చ, క్రోధవహ్నే రబాధితః ।
వే ప్యైకాగ్ర్యేణ మనసా, తిష్ఠేచ్చే న్ముక్తిమా న్నరః ॥

234 దధి తక్రం పాయసాన్నం, నవనీతం ఘృతం తథా ।
సర్వం క్షీరమయం వేమ !, బ్రహ్మా వీక్ష్యస్వ తత్సమమ్ ॥

235 క్షుద్రవిద్యాసు రాజ్యేషు, స్త్రీణా మోక్ష్యేషు ధేనుషు ।
ఆశాం ముంచంతి యే మర్త్యాః, ముక్తా స్తే వేమ ! సర్వశః ॥

236 కుక్ష్యర్థం భ్రమసే కిం త్వం, కుక్షేః తృప్తి ర్మనః కుతః ? ।
శిలాంతస్థస్య భేకస్య, కుక్షి ర్వేమ ! న చాస్తి కిమ్ ? ॥

---

231 ఎఱిఁగిన శివపూజ యెన్నడుఁజెడిపోదు, మొదలఁబట్టు పట్టువదలరాదు ।
మొదలవిడిచి గోడ తుదిఁబెట్ట నిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ !॥

232 చేటువచ్చెనేనిజెడనాడు దైవముఁ, మేలువచ్చెనేని మెచ్చుఁదన్ను ।
చేటు మేలుఁదలఁపఁ జేసిన కర్మమే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

233 కడుపుచిచ్చుచేతఁ గామానలముచేతఁ, గ్రోధవహ్నిచేతఁ గుటిలపడక ।
ఒక్కమనసుతోడ నుండినప్పుడె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ !॥

234 పాలు పెరుగు వెన్న పాయసాన్నము నెయ్యి, జున్ను నెన్నియైన జూడబాల
పాలవంటికులము బ్రహ్మంబుఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ!॥

235 చదువులందు రాజ్యపదవులందును బాడి, మొదవులందు స్త్రీలపెదవులందు,
నాశ లుడుగు నట్టి యయ్యలు ముక్తులు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

236 కడుపు కేల మనస! కళవళపడియెదు, కడుపు కేడఁ దృప్తి కలుగుచుండు
కడుపు రాతిలోని కప్పకుఁ గలుగదా?, విశ్వదాభిరామ వినురవేమ !॥

237 "స శూద్రతా న శూద్రోఽహం, 'ద్విజోఽహ, మితి భావనా ।
అజ్ఞాన పూరకూటం కిం?, వేమ ! హేమసమం భవేత్ ? ॥

238 ప్రశాంతే మానసే శీత!, శ్శీతాంశు రివ యో మునిః ।
వర్తతే వేమ ! సోఽత్యాశు, గృహ్ణాతి పరమం పదమ్ ॥

239 కాంతాసు కనకే చైవ, ముహ్యంతే పండితా అపి ।
యోషి ద్విమోచితాత్మానః, కేఽపి వేమ ! న సంతి హి ॥

240 ఆకాంక్ష్య మధు వేమాశు, ప్రవిశ్య మధుమక్షికాః ।
యథా నిర్గమనాశక్తాః, మగ్నా మోహాంబుధౌ తథా ॥

241 దాస్యాస్సంగో మహాన్ దోషః, వేశ్యా సంగ స్త్రపావహః।
జారా సంగస్తు వేమేహ, మృత్యోర్మూలం న సంశయః ॥

242 అజానన్ బ్రహ్మణస్థానం, వేమాన్యత్ర గవేషణాత్ ।
కిం బ్రహ్మ దృశ్యతే? విత్తం, లభ్యతే కిం వినాంజనమ్ ? ॥

---

237 "శూద్రత్వముఁబోయె శూద్రుఁడఁగా"నని, ద్విజుఁడనుకొను టెల్లఁదెలివిలేమి।
ఇత్తడెసఁగు పసిడి కీడన వచ్చునా?' విశ్వదాభిరామ వినురవేమ ! ॥

238 శాంతమానసమునఁ జల్లనై శీతాంశు, పగిదినున్నవాఁడు పరమయోగి।
అట్టివాఁడు ముక్తి నతివేగ గైకొను, విశ్వదాభిరామ వినురవేమ !॥

239 కనకమెడల మంచికాంతలయెడలను, వలచియుందు రెంతవారలైనఁ।
దోయజాక్షిఁబాయు దొర లెవ్వరునులేరు, విశ్వదాభిరామ వినురవేమ!॥

240 మధురసంబుఁగోరి మక్షికంబులుచేరి, చొచ్చివెడలలేక సొక్కినట్లు।
మునిగివెడలలేరు మోహాంబురాశిలో, విశ్వదాభిరామవినురవేమ ! ॥

241 తొత్తుతోటి పొందు దోషంబు దోషంబు, లంజెతోటిపొందు లజ్జ చేటు।
జారతోటిపొందు చావుకు మూలమౌ, విశ్వదాభి రామ వినురవేమ ! ॥

242 బ్రహ్మ మున్న చోటు పరగంగఁదెలియక, యెందొ వెదుకఁబ్రహ్మమేలకలుగు?
అంజనంబులేక యాసొమ్ము దొరకునా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

243 జడస్య శాస్త్రైః కిం వృద్ధ, భర్త్రా కిం తరుణీమణేః ? ।
యద్గేహే నాస్తి శీతాన్నం, తత్సంసారేణ వేమ ! కిమ్ ? ॥

244 సద్వృత్తంయోషిత స్సాధ్వ్యాః, కిం విజానాతి!పుంశ్చలీ? ।
సాధు ర్వేత్తి బ్రహ్మనిష్ఠాం, ప్రాకృతో వేమ ! వేత్తి కిమ్ ? ॥

245 అభ్యస్తసర్వవిద్యోఽపి, వేమ ! స్యా న్న ఘనః ఖలః ।
జడ ఏవ ఘనః కిం స్యాత్ ?, ఖరో గంధా న్వహ న్నపి ॥

246 సౌందర్యేణ చ సంపత్యా, భూవిస్తృత్యా చ విద్యయా ।
కిం ఫలం ? వేమ ! తత్సర్వం, కిం పుత్రపదవే ర్ఘనమ్ ॥

247 ఛిత్వా హృత్స్థాని సర్వాణి, మమత్వాని దృఢం మనః ।
కృత్వా శుద్ధం య స్తు దేహం, ధత్తే వేమ ! స తాపసః ॥

248 యే నేక్షు ధన్వనా సర్వే, జనా శ్చ మథితా భువి ।
కోఽత్ర భూమౌ కులీన స్స్యాత్, కులహీనో జన శ్చ కః ॥

---

243 వెఱ్ఱి మొద్దు కేల వేదశాస్త్రంబులు?, ముద్దరాలికేల ముసలిమగడు? ।
చలిదిమిగుల నింట సంసార మేలరా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

244 సాధుచరితమైన సతిసత్ప్రవర్తన, జార యే మెఱుంగు? సాధువైన ।
బ్రహ్మనిష్ఠయెఱుంగు, బ్రాకృతుఁ డెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

245 హీనుఁడెన్నివిద్య లిల నభ్యసించిన, ఘనుఁడుకాఁడు హీనజనుఁడెకాని ।
పరిమళముల గార్దభము మోయ ఘనమౌనె?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

246 చక్కదనములేల? సంపత్కరములేల?, విద్యయేల? భూమి విరివియేల? ।
పుత్రపదవికన్నఁ బుట్టునా పదవులు?,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

247 మనసులోననున్న మమతలన్నియుఁగోసి,దృఢముఁజేసిమనసుఁదేటఁబఱచి।
ఘటమునిల్పువాఁడు ఘనతరయోగిరా,విశ్వదాభిరామ వినురవేమ! ॥

248 పచ్చవిల్తుచేతఁ గ్రచ్చుఱజనులెల్లఁ, దచ్చునాడఁబడిరి ధరణిలోనఁ ।
గులజుఁ డెవ్వఁడిందుఁ గులహీనుఁడెవ్వాఁడు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

249 న భవిష్యం త్యభావాని, నాభావో భావికర్మణామ్ ।
మహిమా పృథ గస్త్యేవ, వే మాస్మాభి స్తు కిం భవేత్ ? ॥

250 కృత్వాశాకలితా నాదౌ, అంతే 'నా, స్తీతి వాదినః ।
లుబ్ధాః దుష్కృతినో వేమ !, తేషాం నాశయతి వ్యథా ॥

251 దైన్యాఽనభిజ్ఞసూత్యా కిం ?, కి మనాశ్రితబంధునా ? ।
వేమ ! వ్యాధ్యనభిజ్ఞేన, వైద్యే నాపి చ కిం ఫలమ్ ? ॥

252 వే మేక్షుధన్వనో బాణైః, పీడితో న హి శక్యతే ।
భూనభోమధ్యభాగే చ, పత్నీం త్యక్త్వా కథం వసేత్ ? ॥

253 నాహే ర్జీ వ్యస్తి పాపీయాన్, యథోక్తం శ్రుణు తే హి సః ।
మోహినం బోధితుం వేమ !, శక్నువంతే న కేఽపి చ ॥

254 ప్రాగ్వాసనాయుతస్య శ్రీ, ర్వేమ ! పుణ్యాత్మన స్సదా ।
ఝురీవ స్యందతేఽన్యేభ్యో, దత్తా ప్యా స్తే యథాతథమ్ ॥

---

249 కాఁగలపనులెల్లఁ గాకెటుఁబోవును?, కానిపనులు కానె కావు భువిని ।
మహిమ వేఱయుండె మనతోడ నున్నదా?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

250 మొదట నాసఁబెట్టి తుద "లేదు పొ,,మ్మను, పరమలోభులైన పాపులిలను ।
వారియుసురుదాకి వగఁ జెడిపోదురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

251 బడుగునెఱుఁగలేని ప్రాభవంబదియేల?, ప్రోదియిడని బంధుభూతి యేల? ।
వ్యాధిఁదెలియలేని వైద్యుఁడు మఱియేల?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

252 తుంటవింటివాని తూఁపులఘాతకు, మింట మంట నడుమమిడుకఁదరమె? ।
ఇంటి యాలి విడిచి యెట్లుండవచ్చురా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

253 పాముకన్నలేదు పాపిష్ఠ మగుజీవి, అట్టిపాము చెప్పినట్లు వినును ।
ఇలను మోహిఁదెల్ప నెవ్వరివశమయా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

254 పూర్వవాసనకల పుణ్యాత్ముని కలిమి, యూటచెలమరీతి నూరు నెపుడు ।
ఎందఱికొసఁగినను నెప్పటియట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

255 పరిత్రిశంతం త్యజంతే యే, వేమ! తే మానవస్త్రితాః ।
పరదుఃఖానభిజ్ఞోఽల్పకః, మిత్రద్రోహీ ఖలః ఖలు ॥

256 వేమ! వర్షాగమం చైవ, ప్రాణనిర్గమ మేవ చ ।
మనీష్యపి న జానాతి, జ్ఞాతే వర్తేత్కలిః కథమ్ ?॥

257 కులీనం ధనినం చాపి, భాగ్యవంతం చ పూరుషమ్ ।
సాధ్వీ చ పరమా వేమ!, గృహీతుం కథ మిచ్ఛతి ?॥

258 స్వస్య దానం సుతాతుల్యం, పితు శ్చ భగినీసమమ్ ।
అన్యేషాం తు భవే ద్వేమ! మాతృతుల్యం భవే చ్ఛృణు ॥

259 కర్మబంధాని పూర్వాణి, ఛిద్యంతే గురుణా సతా ।
వే మైకాబ్దం కులాలస్య, దండ స్యైకం క్షణం ఘటాః ॥

260 కులే ష్వగ్ర్యం కులం వేమ!, న జానన్ కిం ఫలం భ్రమైః ? ।
యః స్యాన్తి నిర్మలం జ్ఞానం, స ఏ వాగ్రికులోద్భవః ॥

---

255 అడి తప్పువార లభిమానహీనులు, గొ డెఱుఁగనివాఁడు కొద్దికాఁడు ।
కూడి కీడుసేయ క్రూరుండు తలపోయు, విశ్వదాభిరామ వినురవేమ !॥

256 వానరాకడ మఱి ప్రాణంబుపోకడ, కానఁబడదు ఘనున కైనఁగాని ।
కానఁబడినమీఁదఁ గలియెట్లు నడుచురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

257 తగినకులజుఁడైనఁ దలయెత్తుధనమైన, భాగ్యపురుషునేల పట్టనెంచు? ।
పరమసాధ్విచూడఁ బరుల నంటదుసుమీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

258 తనదు దాస మపని దనకూతురు సమంబు, తండ్రిదానమెల్లఁ దనకుఁదోఁడు ।
అన్యులిచ్చుదాన మది తల్లివంటిది, విశ్వదాభిరామ వినురవేమ !॥

259 గతముచేసినట్టి కర్మబంధము లన్ని, పరిసిపోవు సత్యగురునివలన ।
కుమ్మరికొకయేఁడు గుదియకు నొకనాఁడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

260 జాతులందు మిగుల జాతియే దెక్కువో, యెఱుకలేక తిరుగ నేమిఫలము? ।
ఎఱుకగలుగువాఁడె హెచ్చైన కులజుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

261 అన్నాభావా న్నిషణ్ణస్య, కథం వాంఛా భవేత్ స్త్రియామ్।
సర్వే మదా శ్చాన్నమదా, దేవ వేమ! భవంతి హి॥

262 సుఖాకాంక్షీ పద్ధతీ స్సర్వాః, త్యక్త్వా త్వాం విశ్వసే న్నరః।
భవ ద్విస్రంభణా న్ముక్తి, ర్భవే ద్వేమ! న సంశయః॥

263 దైర్ఘ్యస్థౌల్యయుతాంగోఽపి, వే మోచ్చై శ్శ్మశ్రువా నపి।
న దాతా దాతృతాహీనః, నేభో హి ఘనకాసరః॥

264 వాంఛ తీక్ష్య సతీసౌఖ్యం, గతీ ర్నేక్షతి కర్మసు।
సతీభ్యో న గతీ ర్మర్త్యో, వేమ! నూనం న పశ్యతి॥

265 విభక్తో దారవచసా, వేమ! యో భ్రాతృ వంచకః।
స ఉన్మత్త శ్శ్వపుచ్ఛేన, కిం వా తరతి గౌతమీమ్?॥

266 యత్ర స్త్రియ స్తత్ర కేళ్యః, రిక్తం స్త్రీరహితం స్థలమ్।
వశాభవంతి వేమ! స్త్రీ, మాయాకృష్టధియో నరాః॥

---

261 కూటికి గతిలేక కూర్చున్నవారికి, నాడుదానిమీఁద నాస యున్నె?।
అన్నమదముచేత నన్నిమదంబులౌ, విశ్వదాభిరామ వినురవేమ!॥

262 అన్నిజాడ లుడిగి యానందకాముఁడై, నిన్నునమ్మఁజాలు నిష్ఠతోడ।
నిన్నునమ్మముక్తి నిక్కంబు నీయాన, విశ్వదాభిరామ వినురవేమ!॥

263 ఒడ్డు పొడుగు గల్గిగడ్డంబుఁ బొడుగైన, దానగుణములేక దాతయగునె?।
ఎనుము గొప్పదైన నేనుఁగుఁ బోలునా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

264 సతులఁజూచి నరుఁడు సౌఖ్యంబుఁ గోరును, గతులఁ గానలేడుకర్మమందు।
గతులు సతులవలనఁ గానంగ లేరయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

365 అలిమాటలువిని యన్నదమ్ములరోసి, వేఱుఁబడెడు వాఁడు వెఱ్ఱివాఁడు।
కుక్కతోఁకఁబట్టి గోదావరీదునా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

266 స్త్రీలుఁగల్గుచోటఁ జెల్లాటములుఁగల్గు, స్త్రీలులేనిచోటు చిన్నబోవు।
స్త్రీలచేత నరులు చిక్కుచున్నారయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

267 చండాలో న హి చండాలః, చండాలో వేమ ! నష్టవాక్ ।
తం 'చండాల, ఇతి బ్రూతే, య శ్చండాల స్స ఏవ హి ॥

268 శుక్తికం పతిత శ్శుక్తౌ, స్యా దప్స్వబ్బిందు రమ్మయః ।
ప్రాప్తం య ద్యస్తి వే మేహ, తత్ర కిం న భవేత్ ఫలం ? ॥

269 కులవంతో గోత్రవంతో, విద్యావంత శ్చ సర్వశః ।
వే మాస్తి కాంచనం యస్య, తస్య దాసీసుతాః ఖలు ॥

270 యది వర్తే త్సమం దుష్టైః, భవే ద్ధాని స్స తోఽపి చ ।
వే మాథ స్తా త్తాళతరోః, పయఃపానసమం హి తత్ ॥

271 తప్తేతప్తే హేమ్ని వర్ణం, ముహు స్సంగే స్త్రియాంరతిః ।
జరా పరిణతౌ వేమ !, మోహో లోభ శ్చ జాయతే ॥

272 అజ్ఞాన ప్రభూన్ కియ త్కాలం, భజతోఽపి న జీవికా ।
ఆకాంక్షతోఽపి వంధ్యాగాః, దుహ్యతే వేమ ! కిం పయః ? ॥

---

267 మాల మాలకాఁడు మహిమీద నేప్రొద్దు, మాటఁదిరుగువాఁడె మాలగాక ।
వాని మాలయన్నవాఁడె పో పెనుమాల, విశ్వదాభిరామ వినురవేమ !॥

268 చిప్పలోనఁబడ్డ చినుకు ముత్యంబాయె, నీళ్లఁ బడ్డ చినుకు నీళ్లఁ గలిసె ।
ప్రాప్తముండుచోట ఫలమేల తప్పురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

269 కులముఁ గలుగువారు గోత్రంబుఁ గలవారు, విద్యచేత విఱ్ఱవీఁగువారు ।
పసిడిగల్గువాని బానిసకొడుకులు, విశ్వదాభిరామ వినురవేమ !॥

270 కానివానితోడఁగలిసివర్తించెనా, హానివచ్చు నెంతవానికైన ।
తాటిక్రిందఁబాలు త్రాగినచందమౌ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

271 కరుగగరుగఁబుట్టుఁ గనకంబునకు వన్నె, పెనఁగపెనఁగఁబుట్టుఁ బ్రేమసతికి
ముదియముదియఁ బుట్టుమోహంబులోభంబు, విశ్వదాభిరామవినురవేమ!॥

272 ఎఱుకలేనిదొరల నెన్నాళ్లు గొలిచిన, బ్రతుకులేదు వట్టిభ్రాంతికాని ।
గొడ్డుటావుపాలుఁ గోరినఁ జేపునా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

273 వంధ్యాం ధేనుం వేమ! దోగ్ధుం, ఘటేనీతేం౽క్షిభి ర్గతః।
పాతయే న్నపయో దత్తే,న లాభో లుబ్ధయాచ్ఞయా॥

374 ధనేన నిష్కులో భాతి, నిస్స్వస్య క్షీయతే కులమ్।
వే మాత్యంతం కులా న్మాఖ్యా, సంప దేవ సహస్రశః॥

275 తృణం స్యాత్ ఘృతహీనాన్నం, శాకహీనం శ్వభోజనమ్।
ప్రీత్యా విరహితం చాన్నం, పిండాన్నం వేమ! కథ్యతే॥

276 వక్త్రదుర్గంధనాశాయ, నాగవల్లీ దళం సుధా౽।
క్రముకంచౌషధం దేయాత్, నోచే ద్వేమ! జుగుప్స్యతే॥

277 స్త్రియః పుమాంసో౽న్నమదా, దుద్రిక్తభ్రష్టబుద్ధయః।
"వవృధే స్మర" ఇ త్యాహుః, గతే౽న్నే వేమ! కుత్ర సః॥

278 నరో య దీక్షేత్ స్వర్ణాంగీం, జ్వరోన్మాదయుతో భవేత్।
భూతావిష్టో భవే ద్వేమ!, వివృతే దంతకుట్మలే॥

---

273 గొడ్డుటావుఁ బిదుకఁగుండఁ గొంపోయినఁ, బండ్లనూడఁదన్నుఁ బాలులేవు।
లోభివానినడుగ లాభంబు లేదయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

274 కులములేనివాఁడు కలిమిచే వెలయును, కలిమిలేనివాని కులము దిగును।
కులముకన్న మిగులఁ గలిమి ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

275 నెయ్యిలేనికూడు నీయాన కసవది, కూరలేనితిండి కుక్కతిండి।
ప్రియములేనికూడు పిండంపు కూడురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

276 నోటిపుప్పికెల్ల నొప్పిలేకుండగా, ఆకుపోకసున్న మౌషధంబు।
పెట్టకుండెనేని బెనురోత వేయురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

277 అన్నమదమువలన నతివలుఁ బురుషులు, నేఁపుఁరేఁగిమదనుఁ డేఁచెనండ్రు
అన్న ముడుగువెనుక నతఁడెందుఁబోవురా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

278 ఎఱ్ఱదానిఁ బురుషుఁడేపారఁ జూచిన, వేఁకిపుట్టి చాల వెఱ్ఱిపట్టు।
వల్లుఁ దెఱచి నగినఁ బట్టుఁబెన్భూతంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

279 యది గేహే విశేన్నీచో, హాని స్స్యా న్మహతోఽపి చ।
ప్రవిశ్య మక్షికః కుక్షౌ, క్షోభం వేమ! కరోతి హి॥

280 స్యాచ్చే దల్ప స్యాధికారః, సాధ్వసాధ్వపి నిందతి।
కి మిక్షో ర్మాధురీం వేత్తి?, వేమ! శ్వా చర్మభక్షకః॥

281 స్త్రీ సాన్నిధ్యాద్ద్రవే చ్చిత్తం, యథా లాక్షాగ్నిసంగతేః।
వే మైతాదృ గ్గాఢమోహాః, కుర్యా త్కియ దపి ధ్రువమ్॥

282 నీచాం చ నిష్కులాం వా స్త్రీం, విట స్త్యక్తు మశక్నువా॥
భ్రాంత స్తిష్ఠతి వే మాంధ, శ్శ్వేవ దుర్మాంసభక్షకః॥

283 అసహ్యం సూపహీనాన్నం, అనృణీ స్యా న్మహాబలమ్।
భవబంధవిముక్త స్తు, సుజ్ఞానీ వేమ! కథ్యతే॥

284 వేదోక్త ధర్మో ధార్మికేన, న కదా కష్టజీవినా।
అప్రవిశ్య జలే వేమ!, జ్ఞాయతే న హ్యగాధతా॥

---

279 హీనగుణమువాని నిలుసేర నిచ్చెనా, హానివచ్చు నెంతవానికైన।
ఈఁగ కడుపుఁజొచ్చి యిట్టట్టుఁజేయదా, విశ్వదాభిరామ వినురవేమ!॥

280 అల్పుఁడైనవాని కధికార మబ్బెనా, దొడ్డ కొంచెమనక తూలఁ బల్కు।
చెప్పుఁ గొఱుకుకుక్క చెఱుకుతీఁపెఱుగునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

281 ఎట్టిస్త్రీలఁ గనిన నింతింత యనరాదు, కాలవహ్ని లక్క కరగినట్లు।
ఇట్టిగాఢమోహ మెంతైనఁజేయురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

282 కాంత కుంకయైనఁ గానికులంబైనఁ, బాయలేక విటుఁడు భ్రమసియుండు
మరగి గ్రుడ్డికుక్క మాంసంబుఁ దిన్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ!॥

283 పప్పులేనికూడు పరుల కసహ్యమౌ, అప్పులేనివాఁడె యధికబలుఁడు।
ముప్పులేనివాఁడు మొదల సుజ్ఞానుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

284 ధార్మికునకుఁగాని ధర్మంబుఁగనరాదు, కష్టజీవికెట్లు కానఁబడును?।
నీరుఁజొరకలోతు నిజముగాఁ దెలియదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

285 ముఖే దృష్టే భవే న్మోహః, ధనే దృష్టే మనోహృతమ్ ।
పతితే వేమ ! సర్వాంగ,గ్రంథయ స్స్యు ర్విభంజితాః ॥

286 మంత్రాధిక్యే మతాధిక్యే, వేమ ! సత్యపి భూరిశః ।
ఋతాదృతే న సిద్ధి స్స్యాత్,సత్యవాగ్వర్తతే ద్విజః ॥

287 వంచయిత్వాపరా న్విత్తం, మార్జయి త్వోదరంభరిః ।
న ప్రతిష్ఠాం లభే ద్వేమ !, ఋణీ ప్రాప్నోతి కిం ప్రథామ్ ? ॥

288 విశ్వస్య మర్త్యా స్స్వైశ్వర్యం, ధర్మే కుర్వం త్యనాదృతిమ్ ।
వేమై త్యయమభృత్యేషు, తాడయ త్స్విహ కా గతిః ? ॥

289 యాచమానోఽధమో భూపకా, ద్దైవతుల్యో హ్యయాచకః ।
యో న దత్తే యాచితోఽపి, వే మాఽధస్య స్స ఏవ హి ॥

290 ప్రాప్తిం వినైవ దాతారో, న దాస్యం తీతి గర్హణమ్ ।
స్వనాసావక్రతాం వీక్ష్య, వేమ ! దర్పణదూషణమ్ ॥

---

**285** మొగముజూచినపుడె మోహంబుఘనమౌను,ధనముజూచినపుడెతగులుమనసు
కూలినప్పుడరయఁ గుసులెల్ల విఱుగును, విశ్వదాభిరామ వినురవేమ !॥

**286** ఎన్నిమతములైన నేమంత్రమైనను, సత్య మింతలేక జాడ విడఁడు ।
సత్యము౯ గలిగిన జగతిలో ద్విజుఁడగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**287** పసులమోసపుచ్చి ధరధన మార్జించి, కడుపునింపుకొనుట కానిపద్దు ।
ఋణముఁజేయుమనుజుఁ డెక్కుపకెక్కునా?, విశ్వదాభి రామ వినురవేమ!॥

**288** ధర్మమన్న వినపుతమునమ్మి భూనరుల్,యమునిభటులువచ్చియడలునించి
చొచ్చికొట్ట తమకుఁ జొఱఁబాఱఁ గలరొకో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**289** దానమడుగువాఁడు ధరలోన నధముండు, దాన మడుగఁడేని దైవసముఁడు ।
దానమీనివాఁడు ధన్యుండు కాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**290** తనకుఁ బ్రాప్తిలేక ‘‘దాత లీయరటంచు, దోషబుద్ధిచేత దూఱుటెల్ల ।
ముక్కువంకఁజూచి ముకురంబు దూఱుటే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

291 హత్వా బహూన్ జనాన్ దీనాన్, చోరయిత్వా పురాణ్యపి ।
యత్ర కుత్ర గతం జ్ఞాత్వా, వేమ! హంత్యంతకో ధ్రువమ్ ॥

292 గుణీ పితు స్సుత శ్లాఘ్యః, న గణ్యా బాలవృద్ధతా ।
వేమ! త్యక్త్వా వాసుదేవం, వసుదేవం స్మరంతి కిమ్ ? ॥

293 శౌండికస్య గృహే పీతం, క్షీరం "మద్య" మితీర్యతే ।
అస్థాతవ్యస్థలే వేమ!, స్థితి ర్నిందాస్పదా ఖలు ॥

294 ఔరసే తనయే హేమ్ని, స్త్రీ ష్వాశావిహ్వలాశయః ।
న ముంచే చ్చేద్భ్రమం వేమ!, నరో బ్రహ్మ న పశ్యతి ॥

295 ఛిత్వా తరులతాః భిత్తీః, కృత్వా బధ్వా గృహోత్తమమ్ ।
వే మాహం కురుతే మర్త్యః, న వేత్త్యాగామిదుస్థితిమ్ ॥

296 చర్మపాంచాలికాం కృత్వా, నరో భ్రామయతే భృశమ్ ।
వే మాత్మానం భ్రామయంతం, న జానాతి కథం శివమ్? ॥

---

291 పెక్కుజనులఁజంపి పేదలవధియించి, డొక్కకొఱకు సొమ్ము దొంగిలించి ।
ఎక్కడికరిగినను నెఱిఁగి యముఁడుఁజంపు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

292 తండ్రికన్నసుగుణి తనయుఁడుఁ గల్గినా?, పిన్న పెద్ద తనము లెన్నఁదగదు ।
వాసుదేవువిడిచి వసుదేవునెంతురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

293 పాలనిడిగింటఁ గ్రోలుచు నుండెనా, మనుజులెల్లఁగూడి మద్యమంద్రు ।
నిలువఁదగనిచోట నిలువ నిందలు వచ్చు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

294 కన్నపుత్రునాస కనకంబుమీఁదాస, స్త్రీలమీదయాస చిత్త మెడలి ।
భ్రమలువిడువకున్న బ్రహ్మముఁ గానడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

295 చెట్టుచేమఁగొట్టి చుట్టుగోడలఁబెట్టి, యిట్టునట్టుపెద్ద యిల్లుఁ గట్టి ।
మిట్టిపడును నరుఁడు మీఁది చేటెఱుఁగక, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

296 ఒక్కతోలుఁదెచ్చి యొఱపుబొమ్మనుజేసి, ఆడునట్లుఁజేసి యట్టివేయు ।
తన్నుద్రిప్పువానిఁ దానేల కానఁడో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

297 భీరుః పరబలం వీక్ష్య, ప్రాణగుప్త్యై పలాయతే ।
కృతాంతే కుపితే వేమ !, నిరోద్ధుం కేన శక్యతే ? ॥

298 వే మేహ మృతయోః పిత్రోః, పుత్రో రోదితి దుఃఖితః ।
మృతే భర్తరి భార్యా చ, కార్యార్థం న హృది వ్యథా ॥

299 స్వచేతసి స్థితాం ముక్తిం, యోఽన్యత్రాన్వేష్టు మిచ్ఛతి ।
ఉన్మత్తస్సహి కక్షస్థ, మే షాన్వేషీవ గోపకః ॥

300 నాత్యంతం దుఃఖ మాశాతః,న సుఖం చాస్థిరే దృశి ।
చేతస్య నాస్థితే వేమ !, ముక్తి ర్నాస్తి కదాచన ॥

301 వేమ ! ప్రాయ స్తత్త్వహీనాః, వసంతి జగతౌ తథా ।
న తత్త్వజ్ఞాః న దృశ్యంతే,యది సంత్యపి తత్త్వతః ॥

302 య ఇంద్రియాణి జయతే, తత్త్వ మాత్మైవ వేమ ! సః ।
ఏవం నిత్యం రాజయోగీ, రాజతే భూరి తేజసా ॥

---

297 పరబలంబుఁజూచి ప్రాణరక్షణమున, కుఱికి పాఱిపోవుఁ బిఱికి నరుఁడు ।
యముఁడు కుపితుడైన నడ్డమెవ్వండయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

298 తల్లి తండ్రి చావఁ దనయుఁడుతానేడ్చు,మగఁడుచావ నాలు వగచుచుండు ।
కార్యవశమెకాని కలుగదు మోహంబు,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

299 మనసులోనిముక్తి మఱియుక్కచోటను, వెదుకఁబోవువాఁడు వెఱ్ఱివాఁడు ।
గొఱ్ఱెఁజంకఁబెట్టి గొల్లవెదకురీతి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

300 ఆశకన్నదుఃఖ మతిశయంబుగ లేదు, చూపునిలుపకున్న సుఖములేదు ।
మనసునిలుపకున్న మఱిముక్తి లేదయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

301 తత్త్వహీనులుండ్రు తఱచుగా భువిలోనఁ,దత్త్వమెఱుఁగువారుతఱచులేరు ।
కలిగిరేనివారు కన్పింపరారయ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

302 తాను నింద్రియములఁ దనరజయించినఁ, దత్త్వమరసి చూడఁదానయగును
రాజయోగి యిట్లుఁ దేజరిల్లుచు నుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

303 ఉపానహి శిలా వేమ !, శ్రోత్రే చ పశుమక్షికా ।
కంటకం పద్యక్ష్ణి రేణుః, దుర్భరం కలహం గృహే ॥

304 మోహాంగతా వేమ ! వేశ్యా, ఆగచ్ఛంతి కి మంతికమ్? ।
ధనం సంగేన కర్షంతి, వృథా మారీ న గేహగా ॥

305 గేహం చ మల్లకం కృత్వా, దశాం కృత్వా గుణా నపి ।
స్నేహం కృత్వా కర్మచయం, జ్యోతి ర్వేమ ! ప్రదీపయ ॥

306 గణయిత్వా ఘనాః పూజాః, కృత్వా ప్రాప్నోతి కిం ఫలమ్?॥
భక్తిం వినా పూజయా కిం?, భక్తి ర్వే మేహ కారణమ్॥

307 కాంతారేషు స్రవంతీషు, శైలేషు కిము గాధయా ? ।
చేత స్యేవ స్థితం వేమ !, న విదంతి సదాశివమ్ ॥

308 శ్వా కిం వే త్త్యుచ్ఛనీచత్వం ?, ఖర శ్చందనసౌరభమ్।
త థాల్పో వేత్తి కిం ? వేమ !, వైరాగ్యా ద్ధరపూజనమ్ ॥

---

303 చెప్పులోని రాయి చెవిలోని జోరీఁగ, కంటిలోని నలుసు కాలి ముల్లు ।
ఇంటిలోని పోరు నింతంత కాదయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

304 వారకాంతలెల్ల వలచి యేతెంతురా?, పొందుఁజేసి ధనము పుచ్చుకొఱకె ,
మారిసొచ్చి యిల్లు మఱి యూర కేగునా?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

305 గురముగూఁడుఁజేసి గుణము వత్తిగఁజేసి, నరవిఁగర్మసమితిఁజమురుఁజేసి,
మూలనొక్కజ్యోతి ముట్టించి చూడరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

306 ఎన్నియెన్నిపూజ లెన్నిచేసిననేమి?, భక్తిలేనిపూజ ఫలములేదు ।
భక్తికలుగుపూజ బహుళకారణమురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

307 అపగాలివెంట నడవుల వెంటను, కొండరాళ్లవెంట గొడవదేల? ।
ఉల్లమందునె శివుఁ డుండుటఁ దెలియరు, విశ్వదాభిరామ వినురవేమ!॥

308 గాడి దే మెఱుంగు గంధంబు వాసన?, కుక్క యేమెఱుంగు గొప్ప కొద్ది ।
అల్పుఁ డేమెఱుంగు హరుని గొల్చు విరక్తి?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

309 కాలత్రయే శివం తుష్ట్యా, యోఽర్చయేత్ పుణ్య ఏవ సః ।
పూజాం వినా జాతు కథం, మోక్షభోగ మవాప్నుతే? ॥

310 శాంతాంగా యోగినమన్యాః, న వ్యదస్యంతి హృన్మలమ్ ।
వల్మీకాగ్రే హతే వేమ !, మ్రియతే కిం ఫణాధరః? ॥

311 శ్వైకాంతత్వం బకధ్యానం, రాగం వేమ ! ఖరస్య చ ।
మండూకమజ్జనం చైవ, న కుర్వం త్యాత్మభావనామ్ ॥

312 అధీత్య సర్వశాస్త్రాణి, లిఖిత్వాపి విదంతి హి ।
న విదంతి మృతిం వేమ!, కిం శాస్త్రై ర్మృత్యువేదిభిః ? ॥

313 శైలాశ్మభి రుపానీతై, ర్నిర్మితే హ్యాలయే ష్విహ ।
భ్రమతో యాంతి వే మూర్తిం, శివే ప్రాణి న్యుపస్థితే ॥

314 కులాఢ్యత్వాత్ బలాఢ్యత్వాత్, ధనాఢ్యత్వా చ్చ గర్వతః ।
వ్యభిచారపరాం విద్యాం, వే మాధీత్య వినశ్యతి ॥

---

309 మూఁడువేళలందు ముదముతో శివునాత్మఁ, బూజసేయువాఁడుపుణ్యమూర్తి ।
పూజలేక మోక్షభోగంబు పొసఁగునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

310 ఒడలుబడలఁజేసి యోగులమనువారు, మనసుకల్మషంబు మాన్పలేరు ।
పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

311 కుక్కయేకతంబుఁ గొక్కెరధ్యానంబు, ఖరమురాగ మెన్నఁ గప్పమునుఁగు ।
ఆత్మనెఱుఁగుభావ మదియేలఁ గానరో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

312 సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ, దెలియఁగలరు చావుఁదెలియలేరు ।
చావుఁదెలియలేని చదువు లవేలరా, విశ్వదాభిరామ వినురవేమ !॥

313 కొండరాళ్లఁదెచ్చి కోరికఁగట్టిన, గుళ్లలోనఁదిరిగి కుళ్లనేల? ।
పాయరాని శివుఁడు ప్రాణియై యుండంగ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

314 కులమువలనఁగొంత, బలమువలనఁగొంత, కలిమివలనఁగొంతగర్వమునను
ఱంకుచదువు చదివి ఱంకునఁ బడుదురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

315 జగన్నియామకే దేవే, స్థితేఽహం ప్రభు రిత్యహో!।
వక్తి కిం? వేమ! నా వన్యః, కపిః కిం పాలతే మహీమ్?॥

316 చక్రాంకితా భస్మలేపాః, లంబలింగాని సర్వశః।
అత్రైవ మతచిహ్నాని, వేమ! తత్ర న తత్ప్రభా॥

317 నష్టాచారః క్షుధా వేమ!, తమసా చిత్తశుద్ధతా।
గర్భోత్పత్త్యాచ పూర్వస్థం, దార్ఢ్యం దేహస్య నశ్యతి॥

318. యది నాస్తి ధనం వేమ!, ధైర్యం కిం చ న్న తిష్ఠతి।
యద్యస్తి ధైర్యం న ధనం, ధనధైర్యే నృపోచితే॥

319 దానప్రతిగ్రహాభ్యస్థ, సంబంధాః పద్మినీసమాః।
అనల్పత్వేన శోభంతే, వేమ! రమ్యం హి తత్ఫలమ్॥

320 ఇంద్రియాణి స్వయం రోద్ధు, మశక్తో మరణోన్ముఖః।
సన్న్యస్యతే వేమ! ముక్తిః, వినేంద్రియజయం కథమ్?॥

---

**315** విశ్వమునునడిపెడువిశ్వేశ్వరుండుండ, ప్రభువు నేనటంచుఁ బలుకనేల?।
వనములోని కోఁతి వసుమతి నడుపునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

**316** బూదిపూఁత లెన్న భుజములపాంకాలు, వ్రాలులింగములునువరుసమతము।
లిక్కడఁ దగుఁగాక యక్కడఁ దగ వెప్డు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**317** ఆఁకటికిఁదొలంగు నాచారవిధులెల్ల, చీఁకటికిఁదొలంగుఁ జిత్తశుద్ధి।
వేఁకటికిఁదొలంగు వెనుకటి బిగువెల్ల, విశ్వదాభిరామ వినురవేమ!॥

**318** ధనములేకయున్న ధైర్యంబు నిలువదు, ధైర్య మొదవదేని ధనములేదు।
ధనము ధైర్య మరయఁ దగు భూమిపతులకు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**319** ఇచ్చిపుచ్చుకొన్న హితమైన మనువులు, తగ్గులేక యుల్లుఁ దామరవలె।
కాచి పూచి పండి కడురమ్యమై యుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**320** కడఁక నింద్రియములఁ గట్టివేయఁగలేక, చావువచ్చునపుడు సన్న్యసించు।
ఆత్మజితములేక యందునా మోక్షంబు?, విశ్వదాభిరామ వినురవేమ!॥

321 సూక్ష్మాతిసూక్ష్మ మానంద, మజ్ఞాన స్మృతివర్జితః ।
అధీత్య వేమ! మగ్న స్స్యాత్, వే త్త్యల్పః కింమహాద్రహః?॥

322 రామనామజపే నైవ, కిరాతోఽపి ద్విజోఽభవత్ ।
వాల్మీకి ర్వేమ! న కులం, ఘనం కిం తు గుణం ఘనమ్ ॥

323 సంపదా కిం నిష్కృపస్య, కథం శ్రీ ర్భాతి కర్మిణామ్ ? ।
మధు సంచిత్య సరఘా, వేమ! యాతి స్వవర్త్మనా॥

324 బీజాదే వోద్భవం త్వాశు, కంటకాః కంటకద్రుమే ।
మూర్ఖస్య ఖలబుద్ధి శ్చ, వేమ! సంజాయతే తథా ॥

325 మహానపి న గా శ్శ్వా స్యాత్, న వ్యాఘ్రో శశక స్తథా ।
న గజో మశకో వేమ!, న దాతా లుబ్ధ ఏవ చ ॥

326 భుక్త్వాన్నం సమ్య గాసీనః, స్త్రియం దృష్ట్వా విముహ్యాతి ।
వేమాన్నరస మే వాశు, తనో ర్ధత్తే ఘనం మదమ్ ॥

---

321 అధికసూక్ష్మమైనయానంద మెఱుఁగక, మతియులేక చదివి మగ్నుఁడగును ।
అతిరహస్య మద్దియల్పు డెఱుంగునా?, విశ్వదాభిరామ వినురవేమ !॥

322 రామనామ పఠనచే మహి వాల్మీకి, పరఁగ బోయఁడయ్యు బాపఁ డయ్యె ।
కులము ఘనముకాదు గుణమె ఘనంబురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

323 కలిమికల్గనేమి? కరుణ లేకుండెనా, కలిమి యేలనిల్చు? కర్ములకును ।
తేనెఁగూర్చి యీఁగ తెరువునఁ బోవదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

324 తుమ్మచెట్లముండ్లు తోడనె పుట్టును, విత్తులోననుండి వెడలినట్లు ।
మూర్ఖునకుఁ గుబుద్ధి ముందుగఁబుట్టును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

325 కుక్క గోవుకాదు కుందేలు పులికాదు, దోమ గజముకాదు దొడ్డదైన ।
లోభి దాతకాఁడు లోకంబు లోపల, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

326 కూడుఁగుడిచి లెస్స కూర్చున్నవాఁడైన, నాడుదానిగన్న నట్టెతగులు।
అన్నరసమ యొడలి కతిమదంబగుఁజుమీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

327 దేవపూజాకృతో వేమ !, దివ్యభోగం భవే త్ఫలు ।
తత్త్వజ్ఞో దైవ సదృశః, తద్ధీనస్య న కా గతిః?॥

328 కాపువంశే కలౌ వేమ !, యశ స్స్వీయం ప్రపూరయన్ ।
చిక్షేప సకలాన్ ధర్మాన్, లోకేఽస్మిన్ వేమధీమణిః ॥

329 నిర్మాయ సదనం కర్ణే, వేమ ! వేమో మహాధియః!।
"చిదాకాశం ముక్తిధా"మే, త్యాహ తత్ప్రాప్య మోదత ॥

330 నిరుద్ధోత్పథగం చిత్తం, య శ్శివే కురుతే సదా ।
స వంశకృ ద్భవే ద్వేమ !, నో చేత్ బ్రహ్మపదం కుతః ॥?

331 జ్ఞానీ యుగేషు యాతేషు, తిష్ఠే న్న ప్రాణవిప్లవః ।
ప్రాణహానౌ చ వే మాసౌ, లీయతే పరమాత్మని ॥

332 యది స్వయం సద్గురు స్స్యాత్, హరం బహ్మ జగ త్తథా ।
దర్శయే ద్వేమ! శిష్యం స్వం, స్వీకృత్య హరతే తమః ॥

---

327 దేవపూజఁజేయ దివ్యభోగముఁగల్గు, తత్త్వమెఱిఁగెనేని దైవసముఁడె ।
ఏమిలేనినరున కేగతి లేదురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

328 కలియుగమునమున్న కాపుకులమునకు, వేమన తనకీర్తి విక్రయించె ।
ఉన్నధర్మమెల్ల నుర్విపై వెదజల్లె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

329 చెవిని నిల్లుఁగట్టి చెప్పెను వేమన, "బట్టబయలనుండు బ్రహ్మ"మనుచు ।
బుద్ధిగలిగిదానిఁ బొంది సుఖింపుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

330 పాంకముగను మనసు పోనీక సర్వేశు, వంక నిల్పువాఁడు వంశకరుఁడు ।
వంకనిల్పకున్న వచ్చునా పదవులు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

331 ఉండియుండి జ్ఞాని యుగములుచనిపోవఁ, బ్రాణహానిలేదుప్రళయమునను ।
ప్రాణహానిమైనఁ బరమాత్మఁ గలియును, విశ్వదాభిరామ వినురవేమ !॥

332 గురువు తా నయినను హరునిఁడాఁ జూపును, బ్రహ్మలోకముఁదగబాఱజూపు ।
శిష్యు నరసి పట్టి చీఁకటిఁ బాపురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

333 దృష్ట్వాత్మానం పరే వేమ!, శ్లాఘేయు రితి చింతయన్ ।
భూషణాని స్వయం ధత్తే, పరేభ్యో హి విజృంభతే ॥

334 స్నాపయిత్వా చ సంశోధ్య,భిస్సాం దత్వాంబరాన్వితమ్ ।
కృత్వా చాస్మై శరీరాయ, వేమ! యాంతి కియ చ్ఛ్రమమ్ ॥

335 "నాస్తి నా"స్తీతి యో బ్రూతే, తస్య నా స్త్యేవ వేమ! సః ।
'అస్త్య' స్తీతి సవిస్రంభం, వదతోఽస్తి సహాయవాన్ ॥

336 వే మేహ మాతృధిక్కారః, పితృధిక్కార ఏవ చ ।
భ్రాతృధిక్కార ఇత్యేతాన్, జ్ఞాత్వాఘాన్త్రీన్నచరేన్నరః ॥

337 ప్రాభవం లోభమోహాభ్యాం, నష్టి కర్మఫలం తథా ।
వేమాత్మచింతితం కార్యం, దైవ మన్యత్ర చింతయేత్ ॥

338 ఏకయా గుణితా వేమ!, ఏకసంఖ్యా హ్యథస్థయా ।
వర్ధతే ఖలు తద్రూపా, హ్యౌదార్యస్య ఫలాన్యపి ॥

---

333 తన్నుఁజూచి యొరులు తగమెచ్చవలె నని, సొమ్ములెలమిఁ బెట్టునెమ్మెమిఱ ।
ఒరులకొఱకె తాను నుబ్బుచు నుండును, విశ్వదాభిరామ వినురవేమ !॥

334 నీళ్లుపోసి కడిగి నిత్యంబు శోధించి, కూడుఁబెట్టి మీఁద కోకఁగట్టి ।
ఏమిపాట్లుఁబడుదు రీదేహమున కిల, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

335 లేఁడులేఁడనినను లేఁడు లేనే లేఁడు, కాఁడుకాఁడటన్నఁ గానె కాఁడు ।
తోఁడుతోఁడనినను తోడనే తోఁడౌను, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

336 తల్లి కెదురుకొనుట తండ్రికెదురుకొంట, అన్న కెదురుకొనుట లరయమూఁడు ।
పాతకముల నెఱిఁగి వర్తింపఁ గావలె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

337 లోభమోహములను బ్రాభవంబులుతప్పుఁ, దలఁచినపనులెల్లఁదప్పి చనును
తానొకటి తలఁచినదైవ మొండుఁ దలంచు, విశ్వదాభిరామ వినురవేమ !॥

338 ఒకటిక్రింద నొక్క టొనర లబ్ధముఁబెట్టి, వలనుగగుణియింపవరుసపెఱుగు ।
అట్టిరీతినుండు నౌదార్యఫలములు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

339 పూర్ణకుక్షే రన్నదానాత్, త్యజతే వేమ! కిం ఫలమ్?।
ధనికాయ ప్రదత్తాని, దానా న్యేతాదృశాని హి॥

340 క్షుధార్త స్యాన్నదానేన, భుక్తేః హార్యర్పితం యథా।
విత్తహీనాయ దత్తాని, వేమ! దానా న్యహో తథా॥

341 వేమ! స్వాయ మదాత్యాగాం, ధనినాం కర్మజీవినామ్।
భిక్షాపి న లభే ద్దీనాః!, దృష్టాంత మిద మీక్షత॥

342 భిక్షు ర్భిక్షాం సమాహృత్య, తస్యాం భిక్షాం దదాతి చేత్।
భిక్షాదోషం హరే ద్వేమ!, భిక్షాదానం సమంతతః॥

343 వేమ! విత్తే బలా ద్దత్తే, స్వాయ నేతి తథార్థినే।
దత్తేఽర్థినే భవే త్స్వస్మై, ఇహాదాతు ర్న కుత్ర చ॥

344 వే నేహ స్వార్జితం విత్తం, "ఆత్మీయ" మితి బాలిశాః।
మన్యంతే నూన మన్యేభ్యో, దత్తంవిత్తం స్వకం భవేత్॥

---

339 అన్న మడుగనతని కన్నంబుఁ బెట్టినఁ, బాఱవేయు దాన ఫలిత మేమి?।
ధనికునకు నొసంగు దానము లట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

340 ఆఁకలన్నవాని కన్నంబుఁ బెట్టిన, హరున కర్పితముగ నారగించు।
ధనవిహీనున కిడు దానము లిట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

341 కలిగిపెట్టలేని కర్మజీవుల కెల్ల, తిరిపెమును దొరుకదు దీనులార!।
తెలియఁ జూచుకొనుఁడు దృష్టాంత మిది మీకు, విశ్వదాభిరామ వినురవేమ!॥

342 తిరిపెగాఁడయినను తిరిపె మెత్తినయట్టి, తిరిపెమందుఁదాను దిరిపెమిడినఁ
దిరిపెము తిరిపెమున దిగబడి పోవురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

343 తాము బలిమిఁబెట్టఁ దమకుఁ దామేకల్గు, నడుగనిడినఁదామునడుగఁగల్గు।
ఇందు నినివాని కెందును గల్గదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

344 తాముగడనఁజేయుధనముతమదియంచు, నమ్మియుంద్రుడువెఱ్ఱినరులుభువిని
తా మొకరికి నిచ్చు దానంబె తమది యౌ, విశ్వదాభిరామ వినురవేమ!॥

345 స్వయం న భుఙ్క్తే ఽన్యేభ్య శ్చ, న దత్తే స్వార్జితం ధనమ్ ।
"పుత్రార్థ" మితి సంచిత్య, మ్రియతే వేమ! న బ్రువన్ ॥

346 గుప్తార్థస్య సతీపుత్రాః, వాఞ్ఛన్తే భ్రమ ఏవ సః ।
వేమ! భాగ్యవిహీనానాం, లభతే కింఫలం మనాక్ ?॥

347 స్పర్శవేధీ త్వభాగ్యస్య, లభేచ్చే న్న స్థిరం భవేత్ ।
సమం వృష్ట్యాగతా వేమ !, తిష్ఠన్తే కరకా శ్చ కిమ్ ? ॥

348 వేమ! గర్భే నిర్ధనస్య, సంజాతో భాగ్యవా న్పుమాన్ ।
బహువిత్తయుతో ఽన్యేభ్యో, కరో త్యుపకృతిం సదా ॥

349 వే మేహ బాధాః వివిధా,స్సోఢుం శక్యాః కథంచన ।
యమబాధా తు న తథా, జీవధ్వం తాం వినా పరే ॥

350 అర్థాఢ్యస్య ధనం వేమ !, కాంక్షన్తే భృశ మర్థినః ।
న దత్త మర్థినే వ్యర్థం, వ్యర్థా నేతి వృథా ధనమ్ ॥

---

345 తాముఁదినక యటులెధర్మంబుఁ జేయక,"కొడుకుల"కనిధనముఁగూడబెట్టి
తెలియఁ జెప్ప లేక తీరిపోవును దాను, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

346 దాచినధనమునకుఁ దారయుఁ గొడుకును, వాంఛఁబడుటెకాని వట్టిభ్రమలు!
భాగ్యహీనులకును ఫలము లభించునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

347 భాగ్యహీనునకును బరుసవేది దొరక, నదియు నిల్వ దపుడె వదలుఁగాని ।
వానతోడవచ్చు వడగండ్లు నిల్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

348 ధనవిహీనుఁడైన తండ్రిగర్భంబున, భాగ్యపురుషుఁడొకఁడు పరగఁ బుట్టి ।
బహుళధనముఁ గల్గి పరుల కుపకరించు, విశ్వదాభిరామ వినురవేమ !॥

349 ఇహమునందు బాధ లెన్నైనఁ బడవచ్చు, యమునిబాధలేక యమరవలెను
పరమున వ్యథలేక బ్రతుకుఁడీ నరులార!, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

350 అర్థవంతుసొమ్ము నాసింతు రర్థుల, య్యర్థికిని సొమ్ము వ్యర్థమె సుమి।
వ్యర్థమైన సొమ్ము వ్యర్థులఁ జేరురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

351 సర్వసమ్పత్సమన్వితో, గర్వితో ధర్మకణ్టకః।
అప్రాప్యాన్తే స్వయం శ్రేయః, వేమ! ప్రాప్నోతి నాశనమ్॥

352 వేమ! స్త్రీ పతిభక్త్యైవ, ప్రతిభాం యాతి సర్వశః।
తస్యాః కీర్తి ర్లోకనుతా, పతిభక్తి స్త్రియో ధనమ్॥

353 మమతా మద మాత్సర్య, రూపవ్యసనవర్జితః।
యోగీ పరం విశ్వసితి, వేమేహాన్యహితే రతః॥

354 దానం ధర్మో దయా సత్యం, నీతి ర్ధైర్యం వితీర్ణిమా।
రాజయోగా ఇమే వేమ!, భవేయు ర్మేదినీపతేః॥

355 ఆరభ్య జన్మనో వేమ!, పాపం జ్ఞాత్వా సదా పుమాన్।
అపశు ర్జరయా గ్రస్తో, వేమ! యోగీవ సంచరేత్॥

356 జ్ఞానే ప్రాప్తే స్థిరం చిత్తం, జ్ఞాతే దైవే వశామతిః।
ఉదితం భాస్కరం వీక్ష్య, వేమ! తిష్ఠతి కిం తమః?॥

---

351 ధర్మకంటకుండు ధనముచే గర్వించి, సకలసంపదలను చాలఁ బొరలి।
కడకుఁదాను మేలుఁ గానక చెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ!॥

352 ఇంతి తనదుపేరు నెల్లకాలంబును, ప్రజలుతలఁచునట్లు ప్రతిభఁగాంచు।
ఇంతికి పతిభక్తి యెంతనవచ్చును, విశ్వదాభిరామ వినురవేమ!॥

353 మత్సరంబు మదము మమకార మనియెడువ్యసనములను దవిలినుసలబోక
పరుల కుపకరించి పరమె నమ్మును యోగి, విశ్వదాభిరామ వినురవేమ!॥

354 దానధర్మములనుదయయుసత్యమునీతి, వినయ ధైర్యధుర్యవితరణములు,
రాజుపాలిటి కవి రాజయోగంబులు, విశ్వదాభిరామ వినురవేమ!॥

355 పుట్టినదియు మొదలు పురుషుఁ డేకాలంబు, పాపమెఱిఁగి శుద్ధపశువుఁగాక।
ముదిసియోగికరణి ముదమొప్పఁ గావలె, విశ్వదాభిరామ వినురవేమ!॥

356 జనుఁడు తెలివినొందఁజంచలింపదు మది, దైవమును దెలిసినఁదగులుబుద్ధి।
తివురు భానుఁజూచి తిమిరంబు నిల్చునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

357 వేమ! రాత్రిందివం భావ, “మాత్మాహ” మితి సంస్మృతిమ్।
విస్మృత్య తిష్ఠతే య స్త్వం, త్వంవిద్ధ్యుత్తమయోగినమ్ ॥
358 మృది దారుషు లోహేషు, శిలాకుడ్యపటేషు చ।
ప్రతిమాసు తథాత్మానం, బోధితుం వేమ! న ప్రభుః ॥
359 యది విద్యాచ్చేతసి స్థం, ఆహు స్త్వం యోగినం బుధాః।
త్వయి జ్ఞాతే త్వయా వేమ!, త్వమేవ శివ ఉచ్యసే ॥
360 దుష్పాకేన విషం భక్ష్యం,లోచనగ్లానిదం భృశమ్।
తాదృగ్భక్ష్యే వేమ! భుక్తే,కబళం మృత్యుదాయకమ్ ॥
361 సుపక్వం భక్ష్య మమృతం, లోచనప్రీతిదాయకమ్।
భోజనే నామితే నాశు, వేమ! సంప్రాప్నుతే·మృతిమ్ ॥
362 నయచ్ఛన్తి నభుంజన్తి, పైశున్యాద్ధనినో యది।
అపశ్యన్త శ్శ్రియం వేమ!, నశ్య న్త్యుత్తరజన్మసు ॥

---

357 పగలు రేయు మఱచిభావంబునుమఱచి, ‘‘తాను నే’’ననియెడితలపుమఱచి।
ఉండువానినెంచు ముత్తమయోగిఁగా, విశ్వదాభిరామ వినురవేమ! ॥
358 మంటలోహమందు మ్రాఁకులశిలలందుఁ,బటముగోడలందుఁబ్రతిమలందు।
దన్నుఁ దెలుపుకొఱకుఁదగులదా పరమాత్మ, విశ్వదాభిరామ వినురవేమ! ॥
359 మనసులోనివాని మానుగాఁ దెలిసిన, నుర్విజనులు వాని యోగి యండ్రు।
నీవునిన్నెఱుంగ నీవెపో శివుఁడవు, విశ్వదాభిరామ వినురవేమ! ॥
360 వంటతప్పునపుడు వంటకము విషంబు, కంటఁజూడఁగానె కంటగించు।
కంటకమునఁదిన్న గడి గండమై వచ్చు, విశ్వదాభిరామ వినురవేమ! ॥
361 వంటకుదురునపుడు వంటక మమృతంబు, కంటి కింపుగానుకానుపించు।
ఒడలఁదినిన తిండి వడిమించఁగను దోరు, విశ్వదాభిరామ వినురవేమ! ॥
362 కలిగి ధర్మమీయఁ గాననివారును, కలిగి తినక చాలఁ గ్రాగువారు।
కలిమి నెచటఁజూడఁ గానక చెడుదురు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

363 ముష్టినిమ్బాదితరవో, మూలికాకార్యకారిణః ।
ప్రజానాం వేమ! కిం నీచః?, నిర్దయా త్మోపయుజ్యతే ॥

364 ప్రభుః కపి శ్చే త్సచివాః, క్రోడా వేమ! భటాః ఖగాః ।
సేనా చ పశవ శ్చాశ్వాః, గజా శ్చాఖు బిడాలకాః ॥

365 కోపేన ఘనతా నశ్యేత్, కోపే నైతి వ్యథా భృశమ్ ।
యది సంహరతే కోపం, వేమ! సిద్ధ్యతి వాంఛితమ్ ॥

366 క్రుధైతి నారకం కూపం, క్రుధా విభ్రంశతే గుణః ।
క్రుధైవ వేమ! సర్వేషాం, జీవనం లాఘవం వ్రజేత్ ॥

367 దారిద్ర్యే బాంధవో వైరీ, దారిద్ర్యే నశ్యతే పరమ్ ।
దారిద్ర్యే వేమ! మర్త్యానాం, వినశ్యే దాత్మగౌరవమ్ ॥

368 వేమ! దారిద్ర్యదావాగ్ని, రాత్మప్రాంతీయనాశకః ।
నిర్ధనత్వే సకృ ద్దృష్టే, స్మృతేచా ప్యఘకారణమ్ ॥

---

363 ముష్టి వేఁపచెట్టు మొదలుగాఁ బ్రజలకుఁ, బరఁగ మూలికలకుఁ బనికివచ్చు ।
నిర్దయాత్మకుండు నీచుఁ డెందున కగు?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

364 ప్రభువు కోఁతియైనఁ బ్రగడలు పందులు, సైనికుండు పక్కి సేనపసులు ।
ఏన్గు లశ్వచయము లెలుకలుఁ బిల్లులు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

365 కోపమునను ఘనత కొంచెమై పోవును, కోపమునను మిగుల గోడుఁజెందు
కోప మడఁచెనేని గోరిక లీడేరు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

366 కోపమునను నరకకూపంబుఁ జెందును, కోపమునను గుణముఁ గొంచెమగును
కోపమునను బ్రతుకు కొలఁదియై పోవును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

367 పరఁగ లేమిచేత బంధువుల్ పగవారు, పరఁగ లేమిచేతఁ బరముఁ దప్పు ।
పరఁగ లేమిచేతఁ బరపతి తప్పురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

368 "ధనములేమి" యనెడు దావానలంబిలఁ, దన్ను జెఱుచు నుదరి దాపు జెఱుచు ।
ధనములేమిఁ జూడఁ దలచనే పాపంబు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

369 యావద్ధ స్తః ప్రసరతి, తావ ద్గృహ్ణాతి హతప్రజాః ।
రక్షాం యది న కుర్వీత, వేమ ! తస్య జని ర్వృథా ॥

370 అంగారేణ తథాల్పేన, పతితే నాన్యజాయయా ।
పరిహాసకథా వేమ !, మృత్యో ర్మూలం న సంశయః ॥

371 యే మనోనిగ్రహచణా, స్తేహి ముక్తిపథం గతాః ।
న్యుప్తవన్త స్తరుం వేమ !, న కిం గృహ్ణన్తి తత్ఫలమ్ ?॥

372 న సంతి సాధవో భూపృష్ఠే, బహవ స్సంతి దుర్జనాః ।
కాంచనం నాస్తి వే మాత్రి, లోపః కిం భస్మనో భవేత్ ? ॥

373 ఆలాపచతురో వేమ !, ద్రవీకృత్య భృశం మనః ।
యది ప్రీతిం న జనయేత్, పరద్రవ్యం కథం లభేత్ ॥

374 అధికం యది హం త్యన్నం, నోచేద్గ్లాని రిహాత్మనః ।
హన్తుం గ్లాపయితుం వేమ !, శక్త మన్నం సహస్రశః॥

---

**369** చేకొనుచును దనకుఁ జెయిసాగినంతలోఁ, జెడినప్రజల రక్షసేయలేని ।
తనదు సాగుటేమి? తన తనువది యేమి?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**370** ఇంగలంబుతోడ నిల నల్పుతోడను, పరునియాలితోడ (బతితుతోడ ।
సరస మాడు టెల్లఁజావుకు మూలంబు· విశ్వదాభిరామ వినురవేమ !

**371** మనసు నిల్పినట్టి మర్మజ్ఞులగువారు, గరిమ మోక్షపదముఁ గన్నవారు ।
చెట్టుఁబెట్ట ఫలముఁ జేకొనఁ డా తాను?, విశ్వదాభిరామ వినురవేమ !॥

**372** మంచివారులేరు మహిమీఁద వెదకిన, కష్టు లెంచవెస్రఁ గలరు భువిని ।
పసిడిలేదు కాని పద డెంత లేదయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**373** మాటలాడనేర్చి మనసుఁగరుగజేసి, పరఁగఁ బ్రియముఁ బుట్టఁబలుకకున్న,
నొకరిచేతిసొమ్ము లూరకవచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**374** అన్న మధికమైన నదియుఁ దాఁ జంపును, అన్న మంటకున్న నాత్మనొచ్చు ।
చంప నొంప బువ్వ చాలదా వెయ్యేల?, విశ్వదాభిరామ వినురవేమ !॥

375 న పాశముక్తో హ్యాశావా, నముక్తో న ముని ర్భవేత్ ।
అమునే ర్వేమ! మోహాని, నోజ్ఝంతి ఖలు సర్వదా ।

376 వధోద్యుక్తో నృపో వేమ!, దత్తేపి ప్రీతిం వినాశయన్ ।
మైత్రీం కుర్యా ద్రిపు ర్భోగీ, దంశోద్యుక్తో నిరీక్షతే ॥

377 నరాద్దైవపరా న్వేమ!, చింతంతే స్వసమా ఇతి ।
గూఢం తత్త్వం న జానంతి, మర్మజ్ఞాః కథ మీదృశాః ॥

378 వేమ! త్వత్ స్థానవిన్మర్త్యో, మార్గం నోజ్ఝతి సర్వశః ।
అచంచలపదో నూనం, స్థానం తవ విశే న్నరః ॥

379 త్వయి స్థితేఽఖిలం నాస్తి, మృగతృష్ణోపమం స్థితౌ ।
త్వ మేవ నిశ్చయం వేమ!, నిఖిలం మాయయావృతమ్ ॥

380 పరపుష్టో వనే సమ్యక్, యథా సంకూజతే తథా ।
వక్త్యార్యో వేమ! ధూర్తస్య, వాక్యం కాకరుతోపమమ్ ॥

---

375 ఆశలుడుగఁగాని పాశముక్తుఁడుఁగాఁడు,ముక్తుఁడైనఁగానిమునియుఁగాఁడు।
మునియునైనఁ గాని మోహంబు లుడుగవు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

376 చంపఁదలఁచురాజు చనువగ్గలంబిచ్చు, చెఱుపనున్నపగఱచెలిమిఁజేయు ।
కఱువనున్నపాము నెఱిగాచుకొనియుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

377 దైవమతులనరులు తమవంటివారని, యరసి గూఢతత్త్వ మరయులేరు ।
ఇట్లుమాయఁబడిన నెట్లు మర్మమెఱుంగు?, విశ్వదాభిరామ వినురవేమ !॥

378 నీవుగలిగియుండు నెలవుఁదెలియువాఁడు,వసుధయందుఁద్రోవవదలఁడెందు
కాలు కదలనీక గ్రక్కున నినుజేరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

379 నీవు నిల్చియుండ నిఖిలంబు నిలువదు, నిల్చియుండు నెండనీరువలెను।
నీవు నిశ్చయంబు నిఖిలంబు మాయయే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

380 పికమువనములోన విలసిల్లఁ బలికిన, భంగి ప్రాజ్ఞజనుల బలుకుగులుకు ।
కాకికూఁతఁబోలు కలుషాత్మువచనంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

381 కృశీభూతం మృగేంద్రం చ, కృశశ్వా వేమ! బాధతే।
యదా బలం విలుప్తం స్యాత్, తదా ప్రజ్ఞా న శోభతే॥

382 "జ్ఞానినో వయ"మి త్యేవ,మత్వా వేమ! కుబుద్ధయః।
అనాత్మజ్ఞా భవం త్యజ్ఞాః, కష్టే తిష్ఠంతి కాననే॥

383 వేత్తి యోగీ పాపపుణ్యం,కిం వేత్తి పశుపాలకః?।
అంత ర్యోగం ప్రాప్య వేమ!, లోహసంగ్రథనం కురు॥

384 వేమ! శ్రుత్వా మహద్వాక్యం, తథా కర్తుం న శక్యతే।
కరోతిచే ద్వ్యాఘ్ర మీక్ష్య, లిప్తజంబుకవ ద్భవేత్॥

385 కి మసమ్బద్ధసఖ్యేన, పుంసో వే మేహ ధీమతః।
కార్యార్థినః కిం హఠేన?, దైవభక్త్యా ఖలస్య కిమ్?॥

386 కథం వాద్య శ్వః పరశ్వః, శివార్పితమనా స్సుధీః।
శివో భర్తా భవే ద్వేమ!, స్వయం కర్తా హి మానవః॥

---

**381** చిక్కియున్నవేళ సింహంబునైనను, బక్కకుక్కసేరి బాధఁజేయు।
బలిమిలేనివేళ పంతంబు సెల్లదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**382** జ్ఞానులమనియెంచి చపలాత్ములగువారు, తెలివిలేక తమ్ముఁ దెలియలేరు।
కష్టగహనమందు భ్రష్టులై యుందురు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**383** పాపపుణ్యములనుపసులకాపెఱుఁగునా, ధరనుపరమయోగియెఱుఁగుగాని।
లోనిపొందికఁగని లోహముల్ గూర్పుము, విశ్వదాభిరామ వినురవేమ!॥

**384** పెద్దలవచనములు ప్రేమతోఁడా విని, అటులనడువఁబోవ ననువు పడదు।
పులినిజూచి నక్క పూతపూసిన యట్లు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**385** బుద్ధియుతునకేల పొసఁగని నఖ్యంబు?, కార్యవాదికేల కడు చలంబు?।
కుత్సితునకునేల గురుదేవతాభక్తి?, విశ్వదాభిరామ వినురవేమ!॥

**386** ఎల్లి నేఁడు, మఱియు నెల్లుండియైనను, మనసునిలుపువాఁడు మంచివాఁడు।
శివుఁడు భర్త కర్త, చింతింప నేలరా, విశ్వదాభిరామ వినురవేమ!॥

337 ఆగచ్ఛతి కి మానీయ, కిం గృహ్ణా వేమ! గచ్ఛతి ? ।
జననే మరణే చాపి, కుతో విత్తం? కుత స్స్వయమ్ ?॥

388 వక్త్రోచ్ఛిష్టం కుక్షిమలం, నశుద్ధ్యేద్బ్రహ్మజేనవా ।
య ద్యస్తి సూనృతం కించి,త్సిద్ధ్యతే వేమ! త ద్భువి ॥

389 ఛిన్నాశో వేమ! శాంతాగ్ని,ర్బద్ధకౌపీన ఏవ చ ।
నిరాశీ ముజ్ఝితక్రోధః, పుమాన్ "యో"గీతి కథ్యతే ॥

390 జనస్య గుణహీనస్య, గుణానాం గణనేన కిమ్ ? ।
నిర్బుద్ధేః పూజయా కిం వా, మంత్రైః కిం వేమ! దుర్మతేః?॥

391 సకృ దర్థీ భవే న్నార్థీ,న దాతా స్యా దపూరితః ।
వే మార్థిన శ్చ దాతు శ్చ, తారతమ్య మ పీదృశమ్ ॥

392 వేమ! మూఢ స్తుషాభోజీ, లుబ్ధ స్త్వన్నం దదాతి కిమ్ ? ।
న దదాతి స్వయం చాన్యై, రుక్తం చాపి న యచ్ఛతి ॥

---

387 ఏమిగొంచువచ్చె నేమి దాఁ గొనిపోవు, పుట్టువేళ నరుఁడు గిట్టువేళ? ।
ధనము లెచటి కేగుఁ? దా నేగు నెచటికి?,విశ్వదాభిరామ వినురవేమ !॥

388 కడుపులోనిరోఁత కడునోటియెంగిలిఁ, గడుగవశమె బ్రహ్మకొడుకుకైన ।
సత్యమున్నఁగొంత జగతిపై సిద్ధించు, విశ్వదాభిరామ వినురవేమ !॥

389 ఆశఁగోసివేసి యనలంబుఁ జల్లార్చి, గోచి బిగియఁగట్టి కోప మణఁచి ।
ఆశ విడిచెనేని నతఁడు దా యోగిరా,విశ్వదాభిరామ వినురవేమ !॥

390 గుణవిహీనజనుని గుణమెంచఁగానేల?, బుద్ధిలేనివాని పూజ యేమి? ।
మనసులేనివాని మంత్రంబు లేమయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

391 అరుదుగా నడిగిన నతఁడర్థి కాఁబోఁడు, తఱుచుగా నొసఁగక దాతకాఁడు ।
దాత కర్థి కింత తారతమ్యముఁ గల్గు, విశ్వదాభిరామ వినురవేమ !॥

392 పరఁగఁ దా నొసఁగక పరులుచెప్పినదైన, నియఁజాలకభ్రమియించునెపుడు ।
పొట్టుఁడినెడిలోభి బువ్వలుఁ బెట్టునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

393 ధర్మసత్యపథాలంబీ, యో నరో న ప్రవర్తతే ।
నాప్నోతి స శుభం వేమ!, సాధుచిత్తో భవత్సమః ॥
394 నిందంతే నిర్ధనం పుత్రాః, న స్పర్శం సహ తేఽంగనా ।
వే మాహో! ధనరాహిత్యం, సర్వస్యాపి చ దుస్సహమ్ ॥
395 గతాసవో వేమ యే స్యుః, యే స్యు ర్గతామృతాజనాః ।
మృతజీవాజనా యే స్యు,ర్విమర్శయ యథాతథమ్ ॥
396 శివోపమ స్సాధుచిత్తః, కపట శ్శలభోపమః ।
నిశ్చయాత్మా మహాయోగీ, వేమ! నూనం భవత్సమః ॥
397 బలః పర స్యాత్మన శ్చ, న జానన్ యోఽభివర్తతే ।
స వేమ! దీపికాసేవీ, భల్లాకసదృశో భవేత్ ॥
398 యుక్తాయుక్తానభిజ్ఞో హి, వేమ! మూఢజన స్తథా ।
సాధునిందాం కరోతి శ్వా, మృగేంద్రం భషతే యథా ॥

---

393 ధర్మ సత్యములను దప్పక చేయుని, కర్మ జీవి మేలుఁ గాన లేఁడు ।
నిర్మలహృదయుండు నీరూపమున నుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥
394 ధనములేమి సుతులుఁ దప్పుల నిడుదురు, ధనములేమి పత్ని తాక నీదు ।
ధనములే మెవరికిఁ దాళికై యుండదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
395 చచ్చువార లెవరొ చావనివా రెరొ, చచ్చిబ్రతికియుండు జనములెవరొ ।
విచ్చలవిడిగాను వివరించి చూడరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
396 చిత్తముగలయోగి శివునివలెనె యుండు,మిథ్యయోగియుండుమిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలె నుండురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
397 ఎదుటితనబలంబు నెంచుకో నేరక, దీకొని చలమున నెదిర్చెనేని ।
ఎలుగుదివ్వెసేవ కేగిన చందమౌ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
398 ఓగు బాగెఱుఁగని యుక్త మూఢజనంబు, లల సుధీజనముల నెంచుటెల్ల
కుక్క సింగముఁగనుఁగొని మొఱంగినరీతి, విశ్వదాభిరామ వినురవేమ !॥

399 కుశలా న్కుర్వతే వేమ !, సాధవోఽకుశలాన్ జనాన్ ।
న తథా దుర్జనా దోషా, నారోపంతి గుణే ష్వపి ॥

400 యది క్షీణో ఽత్యనాథస్య, రోగిణో దీనతాం నరః ।
వే మేహ స పుమాన్పూజ్యః, పరత్రాఽపి చ భాగ్యవాన్ ॥

401 కిం ధూర్తస్య పరర్థ్యా స్యా, ద్భక్తిమార్గేణ వా పి కిమ్ ? ।
వేమ ! కిం పరమార్థస్య, తత్త్వే నేహ మనాగపి ॥

402 ఔచిత్యవాన్నరో నిత్య, ముద్యోగీ సక్త సమర్థతః ।
వేమాన్యేభ్య శ్శక్తికాలే, చోపకృత్యేహ రక్షతే ॥

403 కాంచనం వేమ ! పశ్యంతః, ప్రశంసం తశ్చసర్వదా ।
వాంఛం తశ్చేహ పశ్యంతి, ప్రభుం సంత్యక్తకాంచనమ్ ॥

404 ప్రస్తుతే సమయే వేమ !, యది పద్యం పఠే న్నరః ।
సదోష మపి నిర్దోషం, న కిం ధృష్టా రతేఽంగనా ? ॥

---

399 నేరనిజనులకును నేర్పి నేరము తెల్పిఁ, జక్కఁజేతు రరయ సాధుజనులు
ఒప్పెదుర్జనములు తప్పుగ నెంతురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

400 దిక్కులేనిరోగి దీనతఁ బాపిన, పురుషుఁ డిహమునందుఁ బూజ్యుఁడగును ।
పరమునందు వానిభాగ్య మే మనవచ్చు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

401 పలుగువానికేల పరసమృద్ధి దలంప?, పలుగువానికేల భక్తిపథము? ।
పలుగువానికేల పరమార్థతత్త్వంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

402 ఉచితవంతుఁడైన నుద్యోగపరుఁడౌచు, సాగిపాటియున్న సమయమునను ।
పరుల కుపకరించి పరఁగ రక్షించును, విశ్వదాభిరామ వినురవేమ !॥

403 పచ్చఁజూచువారుఁబచ్చమెచ్చెడువారు, పచ్చమీఁద వాంఛపడెడివారు ।
పచ్చవిడుచువాని బ్రభువుఁగాఁజూతురు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

404 ప్రస్తుతంపువేళఁ బద్యంబుఁ జదివినఁ, దప్పుఁ గలిగియున్న నొప్పెయుండు
వెలఁది సురతవేళ బిత్తరై యుండదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

405 కాంతాం చ కనకం వేమ!, సంవీక్ష్య హృది యో నరః।
మోహం నాప్నోతి లోకేఽస్మిన్, స యోగీ పరమో మతః॥

406 ఉద్ధత్యా నేక్షతే మృత్యుం, తత్త్వం తనుమదేన చ।
భోగవాంఛాసమాక్షిప్తః, పుణ్యం వేమ! న పశ్యతి॥

407 ధూర్తస్య సూచకో మిత్రం, కుమంత్రీ మూఢభూపతేః।
గోలాఙ్గూలస్య వే మైవం, వానరో ముఖ్యబాంధవః॥

408 న బాధతే యది బహూం, స్తస్య దానఫలం భవేత్।
న భవేద్యది తన్నాశీ, వే మై త్యుద్వ్యాహకృత్ఫలమ్॥

409 కక్షస్థమేష మన్యత్ర, గోపోఽన్వేష్టి యథా వ్రజే।
తథా హృత్స్థం వేమ! దైవం, త్యక్త్వాన్యత్ర భజే జ్జడః॥

410 ఉన్మత్తస్యాతివినయాః, అవలుంఠాన్వితాఽసతీ।
కౌలటేయో వేమ! సమ్య,గాచారం కురుతే సదా॥

---

405 బంగరుఁ బొడఁగన్న భామలఁ బొడఁగన్నఁ, జిత్తమునను జింతఁజేయఁడేని।
వాఁడె పరమయోగి వర్ణింప జగమందు, విశ్వదాభిరామ వినురవేమ!॥

406 కండకావరమునఁ గానరు మరణంబుఁ, దనుమదమునఁ గనఁడు తత్త్వమిట్లు।
భోగవాంఛచేతఁ బుణ్యంబుఁ గానఁడు, విశ్వదాభిరామ వినురవేమ!॥

407 దుండగీనికొకఁడు కొండీఁడు చెలికాఁడు, బండరాజునకును పాడుమంత్రి।
కొండముచ్చునకును కోఁతియువిందౌను, విశ్వదాభిరామ వినురవేమ!॥

408 పెట్టినంతఫలము పెక్కండ్ర కపకృతిఁ, జేయకున్నఁ దాను జెఱుపకున్నఁ।
బెండ్లిఁజేయునట్టి పెద్దఫలంబురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

409 మేఁకఁ జంకఁ బెట్టి మెలఁగుచు మందలోఁ, బ్రమసి వెదుకు గొల్లపగిది హృదిని।
దైవమెఱుఁగక పరదైవతములఁ దల్చు, విశ్వదాభిరామ వినురవేమ!॥

410 వెఱ్ఱిపట్టువాని వినయంబు లధికముల్, చెడ్డముండ ముసుఁగు చెలఁగి పెట్టు।
చెడిపెకొడుకు మిగులఁ జేయు నాచారంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

411 పరదారాపహారీ చ, జార శ్చానృతవా ద్యపి ।
వేమ ! నిష్ప్రభ మాత్మానం, మన్యతే ద్విజ మల్పధీః ॥

412 అనానుకూల్యే నేష్టాని,రీతిః కాలస్య నైకథా ।
వేమ ! జిష్ణు ర్నానుకూల్యే, విరటం కిం న సేవతే ? ॥

413 కాంతా మరణ్యే విన్యస్య, అనుసృత్య మృగం గతః ।
శ్రీరామః కిం నరసికః ?, నాశకాలే హ్యసన్మతిః॥

414 లంకావినాశసమయే, రాజ్యం లంకాప్రభో ర్ఘ్నమ్ ।
ప్లవంగసేనా చక్రామ, నాశా యాల్పోఽల మాపది ॥

415 జాతో రామవిభు ర్వేమ !, చక్రే రఘుకులోన్నతిమ్।
సుయోధనః కులాంతం చ, సాధ్వసాధు యథోచితమ్ ॥

416 శుద్ధదృష్టిం వినా వేమ ! మహాన్ శుక్రోఽపి ముగ్ధధీః ।
మనో విక్షిప్య చాశక్తో, కాణోఽభూ త్కాకవత్ పురా ॥

---

411 పరధనములకుఁ జెయిఁబట్టును మిక్కిలి, సత్యమింతలేక జారుఁడగును ।
ద్విజుఁడనుకొను దాను దేజ మింతయులేక, విశ్వదాభిరామ వినురవేమ! ॥

412 ఇమ్ముఁదప్పువేళ నెమ్మె లన్నియుఁ దప్పు, కాల మొక్కరీతి గడుపవలయు
విజయుఁ డనువుఁదప్పి విరటునిఁ గొలువఁడా,విశ్వదాభిరామ వినురవేమ॥!

413 మెలఁతనడవి నునిచి మృగమువెంటను బోవు,రామచంద్రుకన్నరసికుఁ డేడి?
చేటుకాలమునకుఁ జెడుబుద్ధిపుట్టును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

414 లంకపోవునాఁడు లంకాధిపతిరాజ్య, మంతకీశసేన లాక్రమించె ।
చేటుకాలమైనఁ జెఱుప నల్పుడె చాలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

415 రామవిభుఁడుపుట్టిరఘుకులంబలరించె, కురువిభుండుపుట్టికులముఁజెఱచె,
ఎవరిమంచిచెడ్డ లెంచిచూచినఁ దేలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

416 శుద్ధదృష్టిఁదెలిసి శుక్రునంతటివాఁడు, పట్టలేకమనసు పాఱవిడిచి ।
కన్నుఁబోయి తుదకుఁగాకి చందం బాయె, విశ్వదాభిరామ వినురవేమ!॥

417 భక్తైః ఫాలం వృకో వక్త్రం, యస్య భూతం మనో భవేత్ ।
దృష్టం బ్రిహ్మేతి తస్యోక్తిః, వేమ! లజ్జాకరా న కిమ్ ? ॥

418 "విప్రోత్తమావయ"మితి, వేదాధ్యయనతత్పరాః ।
హసంతే ప్రాకృతాన్వేమ!, తేభ్యో దాసమతం వరమ్ ॥

419 "యజ్వా ద్విజోఽహ" మితి యో, వేషధారీ యథేచ్ఛయా।
దగ్ధ్వా తు మాంస మశ్నాతి, కోలాభో ? వేమ! తేన సః ॥

420 భూతిలిప్తం సురాభాండం, దుర్గంధం నోజ్ఝతి క్వచిత్ ।
ధృతమాత్రే చోపవీతే, ద్విజన్మా వేమ! కిం భవేత్ ? ॥

421 బిందురక్తభవం దేహ, మజాన న్ద్విజశబ్దభాక్ ।
ప్రివర్తేత తతో వేమ!, నిరయం త్యజతే హి కిమ్ ? ॥

422 కిం దేహలిప్తయా భూత్యా, కుర్యా న్నిష్ఠాం సదాశివే ।
అనారతం ఖరో వేమ!, కిం భస్మని న లుంఠతి ? ॥

---

417 నొసలు బత్తుఁడౌచు నోరు తోడేలౌచు, మనసు భూతమువలె మలయుఁగాను।
"శివునిగంటి"నన్న సిగ్గెట్లు కాదొకో, విశ్వదాభిరామ వినురవేమ!॥

418 విప్రవరులమనుచు వేదంబుఁజదువుచుఁ, బ్రాకృతులను జూచిపరిహసించు।
ధరణిసురులకన్న దాసరిమత మెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ!॥

419 "సోమయాజి"ననుచు సొంపుతో వేషంబుఁ, గట్టిమాంసమెల్ల గాల్చితినును।
"ద్విజుఁడనే,ననఁగ నధికమేమి తనవల్ల,విశ్వదాభిరామ వినురవేమ! ॥

420 కల్లటికకుబూది గట్టిగాఁ బెట్టిన, నందులోని కంపులడఁగనట్లు ।
మెడనుద్రాడువేయ మెఱయుచు ద్విజుఁడౌనె, విశ్వదాభిరామ వినురవేమ! ॥

421 బిందురక్తములను బెరసిన దేహంబు, చంద మెఱుఁగక ద్విజశబ్ద మిడుక ।
నడచినను విడుచునొ నరకంబు మృత్యువు, విశ్వదాభిరామ వినురవేమ!॥

422 భూతి దేహమందుఁ బూసిన నాయెనా, నిష్ఠ శివునియందు నిలుపవలయుఁ।
గాక భస్మమందు గాడిద దొర్లదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

423 మేషాః పర్ణాశిన స్తేషాం, కాయసిద్ధి ర్న సిధ్యతి ।
లోకా స్సర్వే తథా వేమ !, యాం త్యున్మత్తవిచేష్టితమ్ ॥

424 జటాభి ర్వేమ ! ముండై శ్చ, భస్మలేపై శ్చ సర్వశః ।
భాషణాసనవేషై శ్చ, న యోగ్యజితమానసః ॥

425 వే మేహ ముండితం శీర్షం, వేషభాషా దథ త్యహో ! ।
యది ముండీని శీర్షాణి,సంకల్పాని చ కిం తథా ॥

426 నమయిత్వా పాణిపాదం, వాయుపూర్ణః పతక్ స్థితః ।
వేమాసనాద్యా స్స్యు ర్విద్యా, అభ్యాసేన కృతా భువి ॥

427 కాషాయధారీ యోగీవ, స్థితః కామా న్ముహుర్బహిః ।
విక్షిప్య చరతే వేమ !, య స్స మాయీ ముని ర్ధ్రువమ్॥

428 జాతాః కలా వనుత్తీర్ణా, శ్రాంతదేహాః ఘనం తపః ।
కృత్వాపి కిం ఫలం తేన,తత్త్వం వేమ ! న జానతే ॥

---

423 ఆకు లెల్లఁ దిన్న మేఁకపోతుల కెల్లఁ, గాకపోయెనయ్య కాయసిద్ధి ।
లోకులెల్ల వెఱ్ఱి పోకళ్లఁ బోదురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

424 బోడితలల జడల బూడిదపూతల, భాషణాసనముల వేషములను ।
యోగికాఁడు లోన బాగుఁగాకుండిన, విశ్వదాభిరామ వినురవేమ !॥

425 వేషభాష లెఱిఁగి కాషాయవస్త్రముల్, బోడినెత్తి కలిగి పొఱయుచుండు ।
తలలుబోడులైనఁ దలపులు బోడులా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

426 కాలుసేయివంచి గాలినిండుగఁజేర్చి, నేలఁ బ్రాలిమఱియు నిలిచిచేయు ।
నాసనముఖవిద్య లభ్యాసవిద్యలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

427 కావిపంచెఁగట్టి కడుయోగివలెనుండి, వెలికిఁగోర్కులెల్ల విడిచిపెట్టి ।
తొడరితిరుగువాఁడు దొంగసన్యాసయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

428 కలియుగమునఁబుట్టి కడతేరఁగాలేక, ఒడలుబడలఁజేసి యుగ్రతపముఁ ।
దాముఁజేసియేమి తత్త్వంబుఁ గనలేరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

429 గృహాన్ దారాన్ పరిత్యజ్య, విహాయాన్నాదికే స్పృహామ్ ।
ఏకాకీ బద్ధకౌపీనః, తత్త్వం వేమ! న వేత్తి హి ॥

430 కుర్వాణస్య ప్రాణిపూజాం, చింతా స్యాత్కిం శిలాదిషు? ।
ఆస్వాదితే మధురసే, తిక్తః కిం వేమ! రోచతే? ॥

431 శివోఽస్త్యత్రేతి వందంతి, శిలా జీవాః! కుతో భ్రమః ।
జీవే ష్వస్తి శివో వేమ!, న శిలాసు కదాచన ॥

432 బుద్ధిహీనో రజోవృత్త్యా, చానీయోపలవిగ్రహమ్ ।
స్వే భావే పూజతే వేమ!, పరం జ్ఞాతుం న శక్నుతే ॥

433 "ఏంబెర్వాఖ్యం మత"మితి, మధు పీత్వాన్యనామభిః ।
మాంసం భుక్త్వా క్రమం త్యక్త్వా, స్త్రీవశో వేమ! నశ్యతి ॥

434 త్యక్త్వా జాతిమతే గత్వా, యది యోగీ భవే చ్ఛుభమ్ ।
కిం నీత్యా జాతిబద్ధస్య, తద్బంధో వేమ! నిష్ఫలమ్ ॥

---

429 ఇల్లునాలువిడిచి యినుపకచ్చులుఁగట్టి, వంటకంబునీరు వాంఛ లుడిగి ।
ఒంటినున్నయంత నొరుగునాతత్త్వంబు?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

430 జీవలింగపూజఁ జేసిన వారికి, శిలలరూపమందుఁ జింతయున్నె? ।
చెలఁగిమధువుఁ గ్రోలఁ జేదు రుచించునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

431 శివుఁడు గలఁడటంచు శిలలకు మ్రొక్కెడు, వెఱ్ఱిజీవులార! వెతల విడుఁడి ।
జీవులందెకాక శిలల నే మున్నది?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

432 రాతిప్రతిమఁదెచ్చి రాజసంబున నుంచి, పూజఁజేయు నరుఁడు బుద్ధిహీని ।
భావమందుఁ బరము భావించ నేరఁడు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

433 "ఎంబెరుమత"మంచు నెనఁగిమాంసముఁదిని, మాఱుపేర్లఁబెట్టిమధువుఁద్రావి
వావివరుసఁదప్పి వనితపాలైచెడు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

434 జాతిమతమువిడిచి చని యోగిగామేలు, జాతితోనెయున్న నీతులేల? ।
మతముఁబట్టి జాతి మానకుంట కొఱంత, విశ్వదాభిరామ వినురవేమ! ॥

435 వేశ్యాతుల్యా వేదవిద్యాః, భ్రాంతిం కుర్వంతి సాచితీమ్ ।
ఏకైవ గుప్తవిద్యా స్యాత్, వేమ ! తుల్యా కులస్త్రియా ॥

436 వ్రతాశ్చ బహవో వేమ !, కాయక్లేశకరాః ఖలు ? ।
న దర్శయం త్యాత్మతత్త్వం, మహా న్యోగ్యాత్మతత్త్వవిత్ ॥

437 యజ్ఞోపవీతం నాస్త్యేవ, జననే మరణేఽపి చ ।
మాతు స్త న్నాస్తి సా శూద్రీ, స్వయం వేమ ! కథం ద్విజః?॥

438 "పిత్రన్న"మితి సంప్రీత్యా, కాకా నాహూయ కర్మఠాః !।
దదధ్వే తేషు కిం త్వస్తి ?, మహద్భ్యో వేమ ! దీయతామ్ ॥

439 పిండాన్ కృత్వా పితౄన్ మత్వా, కాకేభ్యో యచ్ఛ్యతే ఖరాః!
కథం పితా భవే ద్వేమ !, వాయసో మలభు గ్భువి ॥

440 నీలముండితశీర్షాణి, కంబళాని సితాని చ ।
భస్మలేపా స్తనౌ వేమ !, ఈదృగ్వేషాణి కుక్షయే ॥

---

435 వేదవిద్య లెల్ల వేశ్యలవంటివి, భ్రమలఁబెట్టి తేటపడఁగ నీవు ।
గుప్తవిద్య యొకటె కులకాంత వంటిది, విశ్వదాభిరామ వినురవేమ !॥

436 వ్రతములెన్నియైన వట్టి చిక్కులెకాని, ఆత్మచిక్కుఁగాన నలవికాదు ।
ఆత్మచిక్కుఁబాపు నతఁడె పో ఘనయోగి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

437 జననమరణములను సంధ్యత్రాడును లేదు, సంధ్యత్రాడులేదుజననికెపుడు।
తల్లి శూద్రురాలు తానెట్టుద్విజుఁడగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

438 పితరయన్న మనుచుఁ బ్రీతితోఁ బిలిపించి, కాకులకును బెట్టు కర్మలార! ।
కాకులందు నేమి? ఘనులకుఁ బెట్టుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

439 పిండములనుజేసి పితరులఁదలపోసి, కాకులకునుబెట్టు ఖరములార !।
పెంటఁదినెడి కాకి పితర యెట్లాయెరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

440 నల్లబోడితలలుఁ దెల్లని గొంగళ్లు, ఒడలబూదిపూత లొంటినున్న ।
ఇట్టివేషములిలఁబొట్టకోసమె సుమీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

441 గ్రంథా జటాః కక్షపాలాః, వేత్రం చ వ్యాఘ్రచర్మ చ ।
భారాయ కేవలం వేమ !, మోక్షో నాస్తి తతః ఖలు ॥

442 కృతాసనఃపీడితాఙ్గః, యోగాభ్యాసీ నమత్తనుః ।
కిం వ్యాయామకృతో మల్లాత్, వేమ ! న్యూనత్వ మాప్నుతే॥

443 నిమీల్యనయనే కుక్షిం, మఠరీకృత్య యో యతిః ।
రుద్ధకాయస్స కిం కుర్యాత్, వేమ ! మేషో యమాంతికే ॥

444 వేమ ! కర్కశపాషాణా, నానీ యాలయనిర్మితిమ్ ।
కృత్వా శిలా స్సమర్చంతే, కిం స్యా దుపలసేవయా ? ॥

445 ఉపవాసీ గ్రామకిటేర్జన్మాప్నోతి దరిద్రితామ్ ।
యతి ర్యాతి శిలాం వేమ! ప్రాణీ నార్హతి వందితుమ్ ॥

446 ఐహికం వేమ! సంత్యజ్య, 'ఫల మ'స్తీతి యే జనాః ।
బ్రువంతే తన్మతం మిథ్యా, పర మ స్తీహ పశ్యత ॥

---

441 పుస్తకములు జడలు బులితోలు బెత్తంబుఁ గక్షపాలలుఁ బదిలకత్తైన।
మోతచేటెకాని మోక్షంబు లేదయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

442 ఆసనములఁబన్ని యంగంబుపిగియించి,ఒడలువిఱుచుకొనెడుయోగమెల్ల।
జెట్టిసాముకన్నఁ జింతాకు తక్కువ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

443 కడుపుబోరగించి కన్నులు ముకుళించి, బిఱ్ఱబిగిసియున్న బీదయోగి ।
యమునిబారిగొఱ్ఱె యతఁడేమిచేయును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

444 పలుగురాళ్లఁదెచ్చి పరఁగ గుడులఁ గట్టి, చెలఁగి శిలలసేవఁ జేయనేల? ।
శిలలసేవఁజేయ ఫలమేమికల్గురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

445 ఉపవసములనున్న నూరపందై పుట్టుఁ, దపసిమై దరిద్రతను వహించు ।
శిలకుమ్రొక్కనగునె? జీవముగలబొమ్మ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

446 ఇహమువిడిచి ఫలము లింపుగఁ గలవని, మహినిబల్కువారి మతముకల్ల ।
ఇహములోనఁ బరము నెసఁగుటఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ !॥

447 వినైవ లిఖితం వేమ !, న దత్తే పర మీశ్వరః ।
వినా కర్మ న లేఖా స్యాత్, కర్తాత్మా లేఖకో విధిః ॥
448 "అపశ్య"మితి దుర్మేధాః, వేమ ! కర్మాధికారతః ॥
అనుసృత్య వినష్ట స్స్యాత్, చిత్తే ముక్తిం న పశ్యతి ॥
449 నిర్మలో ఽ ప్యాత్మనో వేమ !, గుణం దేవాయ యో గురుః।
న దాస్యతే స కుటిల, శ్చాంధాశ్వారూఢవ ద్భ్రమేత్॥
450 పుంశ్చలీ వేమ ! జారేతు, కుర్వన్ రక్తిం నిజేపతౌ ।
ముఖప్రీతిం యథా కుర్యాత్, ముక్త్యై దేహం తథా యతీ ॥
451 ఆత్మతత్త్వం తనా వేవ, స్థితం వే మానుచింతయన్ ।
నాన్వేష్టి "పృథగ"స్తీతి,కిం దీపేన స్థితే రవౌ ॥
452 మ్రియమాణఃపుమా న్వీక్ష్య, ధ్రువో మృత్యు రితి స్మరన్ ।
జ్ఞాత్వా వే మాత్మన స్తత్త్వం, ముక్త స్స్యా దకుతో భయః ॥

---

447 వ్రాఁతవెంటకాని వరమీఁడు దైవంబుఁ, జేఁతకొలఁదికాని వ్రాఁతకాదు ।
వ్రాఁతకజుఁడు కర్త చేఁతకుఁ దాఁ గర్త, విశ్వదాభిరామ వినురవేమ !॥
448 "కంటిఁగంటి" ననుచుఁగర్మాధికారంబు,వెంటఁబట్టిచెడును వెఱ్ఱిజనుఁడు।
బట్టబయలుముక్తిఁ బాటించి జూడఁడు, విశ్వదాభిరామ వినురవేమ! ॥
449 తాను విమలుఁడైనఁ దనగుణమంతయు, శివునికీనిగురువు చెడ్డగురువు ।
గ్రుడ్డిగుఱ్ఱమెక్కి గుడితిరిగినటులౌ, విశ్వదాభిరామ వినురవేమ!॥
450 జారపురుషుమీఁద సద్భక్తి నలుపుచుఁ, బతికి నిచ్చకంబుఁ బఱపుభంగి ।
పరముకొఱకు యోగి పాటించు దేహంబు, విశ్వదాభిరామ వినురవేమ! ॥
451 తనువులోని జీవతత్త్వ మెఱుంగక, "వేఱె కల"డటంచు వెదుకనేల? ।
భానుఁడుండ దివ్వెఁ బట్టి వెదుక నౌనె?, విశ్వదాభిరామ వినురవేమ!॥
452 చచ్చువారినిగని చావునిశ్చయమని, తత్త్వమెల్ల నాత్మఁ దలఁచి తెలివి ।
నదురుబెదురులేక యడరిన భక్తుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

453 వేమ! పాంచాలికాజీవీ, క్రీడాం పాంచాలికాగణైః ।
కారయిష్యతి దైవం చ, కుర్యాచ్ఛన్న స్తథైవ చ ॥

454 కోటిపూజా వినశ్యంతి, పరస్త్రీరతకాంక్షిణః ।
న నష్టి కిం వేమ! తాపాత్ ?, నవనీతం శిఖాంతికే ॥

455 యస్య నాస్తి వచశ్శుద్ధి, శ్చండాలః ఖలు వేమ! సః ।
దానేన కిం వినా ప్రేమ్ణా ?, ఘాలం భక్తో ముఖం వృకః ॥

456 బ్రహ్మాండే వేమ? జాతాని,సకలాని కులా న్యపి ।
సర్వేపి సోదరా ఏవ, సర్వే ప్యేకత్వ మాస్థితాః ॥

457 కిం చ క్రేఽన్నం కులం చాపి ?, తథైవ వసుధా తనోః ?।
దేహార్థం యతమానస్య, నృచేష్టా వేమ! హ్రీప్రదాః ॥

458 బుద్ధి ర్నిదానం పూజాభ్యో, వచనేభ్యో మనో దృఢమ్ ।
కులా దపి చ వే మేహ, ప్రధానం విమలం గుణమ్ ॥

---

453 బొమ్మలాటవాఁడు బొమ్మల నాడించు, భువినిజనులఁజూడఁ బొలుపుమీఱ।
తానుమఱఁగియుండి దైవ మాడించురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

454 పరయువతిరతంబుఁ బాటించి కోరినఁ, గోటిపూజలెల్లఁ గొల్లబోవు ।
సెగకుఁబొంతవెన్న చెడదె తాపముచేత, విశ్వదాభిరామ వినురవేమ !॥

455 వాక్కుశుద్ధిలేనివాఁడు చండాలుండు, ప్రేమశుద్ధిలేక పెట్టుపెట్లు? ।
నొసలుభక్తుఁడైన నోరు తోడేలయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

456 పరఁగబొమ్మగ్రుడ్డుఁ బరికించి చూచినఁ, గులములన్ని యందుఁగూడిపుట్టె।
అంతయొకటె కలియ నన్నదమ్ములె కదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

457 కూడదేమిచేసెఁ గులమేమి చేసెను, భూమియేమిచేసె? బొందె కిట్లు ।
నరుఁడుపడెడుపాట్లు నగుబాట్లుచూడఁగా, విశ్వదాభిరామ వినురవేమ !॥

458 పూజకన్న నెంచ బుద్ధి నిదానంబు, మాటకన్న నెంచ మనసు దృఢము ।
కులముకన్న మిగుల గుణముప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

459 శ్రుణు వేమ! కుల స్యాత్ర, కిం న్యూనాధిక్యగాథయా ।
సానుజాతం కులం సర్వం, అల్పాధిక్యం కథం వదేత్ ? ॥

460 చండాలనిందయా కిం వా, రక్తమాంసం సమం తనౌ ।
కులం కిం వేమ! తత్త్వేన, అంతర్దేహానువర్తినః ॥

461 చండాలం వేమ! సంస్పృశ్య,జలే మజ్జంతి పామరాః ।
స్వకర్మణైవ చండాలో, న విదంతి కథం త్విదమ్ ॥

462 గుణాఢ్యశ్చే న్న మాతంగ, ఇతి వేమ! న తం వదేత్ ।
మేనే వసిష్ఠో మాతంగీం, మాతంగోఽపి గుణీ ద్విజః ॥

463 శిలాం తు ప్రతిమాం కృత్వా, సంస్థాప్య చ తమోగృహే ।
న భజధ్వం జడోన్మత్తాః!, బ్రహ్మ జానీధ హృత్స్థితమ్ ॥

464 చండాలోఽపి న చండాలో, య ద్యాత్మని మనస్స్థితమ్ ।
య స్యాత్మసంస్థం న మనః, చండాలః ఖలు వేమ! సః ॥

---

459 కులముహెచ్చుతగ్గు గొడవలఁ బనిలేదు, సానుజాతమయ్యె సకలకులము ।
హెచ్చుతగ్గుమాట తెల్లిఉంగఁగ నగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

460 మాలవానినేల మహమీఁద నిందింపఁ, నొడలిరక్తమాంస మొకటికాదె?।
వానిలోనమెలఁగు వానికులంబేది?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

461 మాలవానినంటి మఱిమున్గుదురుసెట, మనుజకర్మచేత మాలఁడయ్యె ।
ఏలఁదెలియఁజాల రీ నరపశువులు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

462 «మాదిగ» యనవద్దు మఱి గుణమొనరిన, మాదిగనువసిష్ఠమౌనితేఁడె ? ।
మాదిగ గుణమున్న మఱి ద్విజుఁడగునయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

463 శిలను బ్రతిమఁ జేసి చీకటింటను బెట్టి, మ్రొక్కవలదు వెఱ్ఱిమూఢులార! ।
ఉల్లమందు బ్రహ్మ ముండుటఁ దెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

464 మాలవాఁ డయినను మఱి యాత్మమీఁదను, మనసునిల్పెనేని మాలకాఁడు।
మనసునిల్పకున్న మహమీఁద మాలఁడు, విశ్వదాభిరామ వినురవేమ !॥

465 పితామహస్య మాతా చ, వేమ! మాతా పితు స్తథా ।
స్వమాతా మాతృమాతాస్యుః, శూద్రా విప్రః కథంస్వయమ్?॥
466 జననీ గణికా వేమ !, మాతంగీ చాత్మన స్సతీ ।
గురు ర్వసిష్ఠ శ్శీజానేః, ద్విజశ్శక్త్యా కులేన కిమ్ ? ॥
467 జన్మక్రమేణ హ్యాసయే, వినా జాతివ్యవస్థయా ।
యది స్థాపయతే దేవం, వేమ ! సర్వేషు సోధికః ॥
468 కులభేద మథఃకృత్యా, ఏకపాత్రాన్న భోజినః ।
కృత్వా న్యస్య కరం శీర్షే, వేమ ! విస్రంభయ ప్రజాః ॥
469 ఆనీయ పర్వతశిలాః, పాదై రాక్రమ్య సర్వశః ।
టంకైస్సంతక్ష్య యే వేమ !, భజంతే తే జడాః ఖలు ॥
470 కుక్షిస్థే పరమే రాశిం,కుర్వంతి హి శిలాలయే ।
యది దేవశ్శిలైవ స్యాత్, రాశిం నాశ్నాతి వేమ ! కిమ్ ? ॥

465 తాతఁగన్నతల్లి తనతండ్రిఁ గనుతల్లి, తన్నుఁగన్నతల్లి తల్లితల్లి ।
తల్లిశూద్రురాలు తా నెట్లు బాపఁడు?, విశ్వదాభిరామ వినురవేమ !॥
466 తనదుతల్లివేశ్య తనయాలు మాదిగ, శ్రీపతికి గురువు వసిష్ఠుఁడరయఁ ।
పనముచేత ద్విజుఁడు, తర్కింపఁ గులమెట్లు?, విశ్వదాభిరామవినురవేమ !॥
467 జాతివేఱులేక జన్మక్రమంబున, నెమ్మదిని నభవుని నిల్పెనేని ।
నఖిలజనుల కెల్ల నాతండె ఘనుఁడయా, విశ్వదాభిరామ వినురవేమ !॥
468 ఉర్వివారి కెల్ల నొక్క కంచముబెట్టి, పొత్తుఁగుడిపి కులముఁ బొలియఁజేసి ।
తలను జేయిఁబెట్టి తగనమ్మఁ జెప్పరా, విశ్వదాభిరామ వినురవేమ !॥
469 గట్టురాళ్లఁదెచ్చి కాళ్లవేళ్లను ద్రొక్కి, కాసెయులులచేత గాసిఁజేసి ।
మొఱపరాళ్లకెఱఁగు మొప్పెల నేమందు?, విశ్వదాభిరామ వినురవేమ !॥
470 తోలుకడుపులోన దొడ్డవాఁడుండంగ, రాతిగుళ్లలోన రాశిఁ బోయ ।
రాయిదేవుఁడైన రాసులు మ్రింగఁడా, విశ్వదాభిరామ వినురవేమ !॥

471 శిలోత్కృష్టం వేమ! సంప్రేక్ష్య, నమస్కుర్వంతి సర్వశః।
సతోత్కృష్టం ఘ్నంతి దండాద్యైః, తద్భక్తాః ఖలు పాపినః ॥

472 మృదా లోహాదినా వేమ! కృత్వా చ ప్రతిమాం నరైః।
గర్తే గృహే చ సంస్థాప్య, "దేవోఽయ"మితి కథ్యతే ॥

473 సమ్యంచి శకునా నీక్ష్య, వూఢా వపి చ దంపతీ।
మ్రియేతే నాసతే వేమ!, శకునైః కర్మ కిం హృతమ్? ॥

474 ఘూకే నాధిష్ఠితం గేహం, త్యక్త్వాన్యత్ర వ్రజం త్యహో!।
పశ్యోన్మాదం మనుష్యాణాం, తాభ్యాం వే నేహ కిం కృతమ్?॥

475 క్షీరేణ వర్ధితం నింబం, వేమ! వర్ష సహస్రకమ్।
తిక్తం త్యక్త్వా న మధురం, తథా దుష్టస్య నౌచితీ ॥

476 వాటీవధూనికాయాస్తు, కిం వేమ! క్రమవర్తనైః?।
కిం సూచకస్య సద్బుద్ధ్యా?, కిం జ్ఞానేన జడాత్మనామ్? ॥

---

471 రాతిబసవనిగనిరంగుగా మ్రొక్కుచు, రూఢిబసవనిగ నిక్రుమ్ముచుంద్రు।
బసవుభక్తులెట్టి పాపులో తలపోయు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

472 మన్నుమెత్తి కరిగి మఱిరూపుఁగావించి, గుంటనింటఁబూడ్చిగుఱుతునిలిపి।
మనుజులెల్లఁ గూడి మఱి దేవుఁడందురు, విశ్వదాభిరామ వినురవేమ!॥

473 మంచి శకునములని యెంచిపెండిలి యాడు, వారలొకరులేరు వసుధలోన।
జనులకర్మములను శకునముల్ నిల్పునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

474 గూబయెక్కినట్టి గురముఁబాడుగఁ బెట్టి, వెళ్లిపోదురెంత వెఱ్ఱివారొ।
గూబ యేమి చేసె? గురమేమి చేయును?, విశ్వదాభిరామ వినురవేమ!॥

475 వేముఁబాలుఁబోసి వేయేండ్లు పెంచినఁ, జేదు విడిచి తీఁపిఁజెంద నట్లు।
ఓగు గుణము విడిచియుచితజ్ఞుఁడునుకాఁడు, విశ్వదాభిరామ వినురవేమ!॥

476 వాడవదినకేల వావిపద్ధతులు, చాడిగానికేల జాడ బుద్ధి।
మూఢమతులకేల ముదముతో జ్ఞానంబు?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

477 యో వే మాశక్త మాత్మానం, బ్రూతే కోవిద ఏవ సః ।
న త థాన్య ఉదాసీనో, భవే త్సర్వోత్తమోత్తమః ॥

478 నేచ్ఛే ద్వే మాంగనానంగ, గేహానందైకలంపటః ।
ఊర్ధ్వలోకం కథం శ్వాన్నం, వేత్తి? చండాలవాటిగః ॥

479 దాసీ దాస్యైవ వే మాహో !, న స్యా త్సా యజమానినీ ।
ఔచిత్యం తు న తస్యా స్స్యాత్, శుభార్థీ కిం ? మృతాన్నభుక్ ॥

480 శ్రేష్ఠా తు కులటా వేమ !, నయజ్ఞా సతతం విటమ్ ।
వశీకారవిధం వేత్తి, న దాసీ జారిణీ తథా ॥

481 శూరమ్మన్యో వేమ ! భీరు,ర్యది యుద్ధే నియుజ్యతే ।
పలాయతే కార్యహాని, ర్నాలం భీరు ర్భటోద్యమే ॥

482 గత స్తిరుపతిం మ్లేచ్ఛో, న దాసః కాశికాం గతః ।
కిటి ర్న దంతీ వేమ ! శ్వా, న సింహో గౌతమీం గతః ॥

---

477 ‘నేర, నన్నవాఁడు నెరజాణ మహిలోన, నేర్తునన్నవాఁడు నేరఁడెపుడు ।
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁ డెందు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

478 మానినిమనోజమందిరానందైక, లోలుఁ డెల్లఁ డూర్ధ్వలోకసుఖము ।
మాలవాడకుక్క మఱి యన్న మెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

479 తొత్తుతొత్తెకానిదొరసాని కాఁబోదు, హత్త దెవుడు దాని కైనగుణము ।
మిత్తికూళ్లఁదొంగ మేలెన్న నేర్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

480 నాడెమైనచెడిపెనయు మెఱింగి మెలంగు, విటునిగుస్తరించు వివరమెఱుఁగు।
బానిసైనతొత్తు పాటించ లేదయా!, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

481 పందనధికుఁజేసి పవరంబునకుఁ బంపఁ, బాఱిపోవుఁ గార్యభంగమగును ।
పాఱువాఁడు బంటు పనికిరాఁ డెందును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

482 తిరుమలకునుబోవఁ దురకదాసరికాఁడు, కాశికేగ లంజె గఱితకాదు ।
కుక్కసింగమౌనె? గోదావరికిఁ బోవ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

483 పీనస్తనా దర్శయిత్వా, ద్రవీకృత్య భృశం మనః ।
హరంతి విత్తం కాంతా స్తాః, వే మానంగకరాసయః ॥

484 అనుకూలసతీప్రాప్తౌ, సతీపత్యో స్సుఖం మహత్ ।
యది స్యాత్ ప్రతికూలా సా, వేమ! తద్వర్జనా త్సుఖమ్ ॥

485 నితంబ మున్నతం ప్రేక్ష్య, కుచకుంభౌ చ పీవరౌ ।
అనాచ్యస్థలగర్తం చ, వేమ! మహా న్యపి ముహ్యతి ॥

486 "కాశీ,కా" శీతి గచ్ఛంతి, మూఢా దేవ స్తు తత్రగః ।
కింనా స్త్యత్ర? హృది స్వచ్ఛే, వేమ! తత్రాత్ర వర్తతే ॥

487 ప్రేక్ష్య కాంతాధరం రమ్యం, విస్మరేత్ స్వమతం నరః ।
ముఖం వీక్ష్య మనో వేమ!, వచ శ్శ్రుత్వా తప స్తథా ॥

488 కుక్షిస్థితే పాపపంకే, గంగాస్నానైర్నిధివ్రతైః ।
దేవతావందనై శ్చైవ, కిం ఫలం వేమ! చింతయ ॥

---

483 కులుకుగుబ్బఁజూపి గొబ్బునఁ గరిగించి' చేతికాసులెల్లఁ జేర్చుకొందు।
రతనుచేతికత్తు లమరంగఁ గాంతలు, విశ్వదాభిరామ వినురవేమ !॥

484 అనుకూల్యముఁగల యంగన కలిగిన, సతికిఁబతికిఁ బరమసౌఖ్యమమరుఁ।
ప్రాతికూల్యమైనఁ బరిహరింప సుఖంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

485 గొప్పపిరుదుఁగన్నఁ గుచకుంభములఁ గన్నఁ, జెప్పరానిచోటుచెలమఁగన్న।
ముప్పిరిఁగొనునయ్య మునికైన మోహంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

486 "కాశికాశి"యనుచుఁగడుపేర్కఁబోదురు, అందుఁగలుగుదేవుఁడిందులేఁడె!
ఇందునందుఁగలఁడు హృదయంబు తెస్సైన, విశ్వదాభిరామవినురవేమ !॥

487 మతముదారిమఱచుమధురాధరముజూచి,మగువరూపుఁజూచిమనసుమఱచు।
ఊస్తులాలకించి యోగంబు మఱచురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

488 నీళ్లమునుఁగనేల? నిధులమెట్టఁగనేల?, మొనసి వేల్పులకును మ్రొక్కనేల?।
కపటకల్మషములు కడుపులో నుండఁగా, విశ్వదాభిరామ వినురవేమ !॥

489 వేమ! పంగోః కుర్కురస్య, కిం వా శశకధావనైః।
భీరోః కిం శూరబిరుదైః?, వృద్ధాయాః కిం దరస్మితైః? ॥

490 వేమాటిత్వా సర్వభూమిం, యతతోఽపి నరస్య చ।
ఫలం ప్రాప్త్యనుసారం భూః, న వా ప్యేవం న భుక్తయః॥

491 స్నాతో ర్ధ్వపుండ్రం నిక్షిప్య, ధృత్వా కాషాయ మంబరమ్।
వేశ్యాం వేమ! నరో వీక్ష్య, వ్రతం విస్మరతేఽఖిలమ్॥

492 ధృత్వా కపటవైరాగ్య,మసంయతమనా నరః।
కాంక్షతే యోషితం వేమ!, వృథైవ వృద్ధజన్మ జీవితమ్॥

493 కామ మూర్వో ర్ధాళధళ్యం, పీవరస్తనవిభ్రమమ్।
కచం చేక్ష్య స్త్రియో వేమ!, నైతి కిం విరహం విటః? ॥

494 వేమాతిక్లాంతదేహేన, ధృత్వా కాశీజలం నరః।
అసుఖ శ్శోషమాణ స్స్యాత్, మృతో ముక్తిం కథం లభేత్?॥

---

489 కుంటికుక్కకేల కుందేటిపరువులు?, పిఱికిబంటుకేల బిరుదుగొడుగు?।
మునలిముండకేల మునిమునినగవులు?, విశ్వదాభిరామ వినురవేమ!॥

490 ఎంతభూమితిరిగి యేపాటుఁబడుచున్న, నంటనీకప్రాప్తి వెంటఁదిరుగు।
భూమిక్రొత్తదైన భుక్తులు క్రొత్తలా, విశ్వదాభిరామ వినురవేమ!॥

491 వరఁగజలకమాడి పట్టెనామముఁ దీర్చి, సిరుకావిపంచె నెరయఁగట్టి।
వారకాంతఁజూచి వ్రతమెల్ల మఱచురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

492 మనసునిల్పలేని మాయవిరక్తులు, మనసుపడుదు రొక్క మగువమీఁద।
ఇట్టివ్యర్థజన్మ మీ బ్రతుకేటికి?, విశ్వదాభిరామ వినురవేమ!॥

493 తొడలమెఱుపుఁజూచి తోరంపుకుచములు, వారకొప్పుఁగలుఁగు వనితఁజూచి।
విటుఁడునిల్చునెట్లు విరహాగ్నిఁజొరకను?, విశ్వదాభిరామ వినురవేమ!॥

494 కాశినీళ్లుమోసి కాళ్లుమొగమువాచి, యెందుసుఖములేక యెండియెండి।
చచ్చివెనుకముక్తి సాధింపఁగలరొకో!, విశ్వదాభిరామ వినురవేమ!॥

495 ద్రాగ్దేశాటనమాత్రేణ, ధ్యాన మాత్మని కిం భవేత్ ? ।
యో ద్రవ్యార్థ మటే ద్వేమ !, తస్య ముక్తి ర్లభేత్కథమ్?॥
496 కాంతాయాం కనకే యస్య,న తృష్ణా భువి నాస్తి సః ।
య ద్యస్తి వేమ ! తత్త్యజ్ఞః, స కదాపి న దృశ్యతే ॥
497 అధీత్య సర్వశాస్త్రాణి, సర్వజ్ఞోఽపి ముని స్స్వయమ్ ।
యోషాం వీక్ష్యోత్సుకో వేమ !, యోగం విస్మరతేఽసకృత్॥
498 కిం వేదాధ్యయనేన స్యాత్ ?, కిం పరివ్రజనేన చ ? ।
కిం వేమ ! షన్మతగ్లాన్యా, జానీ హ్యాత్మని తం శివమ్ ॥
499 వాంఛా మనసి జాయంతే,న ముక్తి స్తాసు విద్యతే ।
"మనో బ్రహ్మే"త్యజానంతో,వేమ ! ముహ్యంతి మానవాః॥
500 అధీతాఖిలశాస్త్రోఽపి, ముక్తిం న లభతే ఖలః ।
యథా హసంత్యాం శయితః, స్మరేచ్ఛ్వా వేమ ! తత్తథా ॥

---

495 దేశదేశములను గాసిలి తిరుగంగ, నాత్మయందు ధ్యాన మంటుకొనునె? ।
కాసులనును విడుగఁ గలుగునా మోక్షంబు?, విశ్వదాభిరామ వినురవేమ !॥
496 కన్నెమీఁద నాశ కనకంబుపై నాశ, లేనివాఁడు పుడమి లేనివాఁడు ।
కలిగెనేని నతఁడు గానంగ రాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ !॥
497 చదువులెల్లఁజదివి సర్వజ్ఞుఁడై యుండి, బ్రహ్మవిద్యలెల్లఁ బదటఁ గలిపి ।
యువతిఁజూచి పొంగి యోగంబుమఱచురా, విశ్వదాభిరామ వినురవేమ !॥
498 చదువుఁజదువనేల? సన్యాసికానేల?, షణ్మతములఁ జిక్కి చావనేల? ।
హరుని భజనఁ జేసి యాత్మలోఁ దెలియుఁడీ, విశ్వదాభిరామవినురవేమ !॥
499 మనములోనఁబుట్టుమఱికోర్కులన్నియుఁ,గోర్కులందుముక్తికుదుటబడదు
మనముబ్రహ్మమనుచు మది నెఱుంగఁగలేరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
500 చదువులన్నిచదివి చాల వివేకింపఁ, గపటి కెన్న నేలకలుగు ముక్తి? ।
బాలిగుంటకుక్క తలఁచిన చందంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

ఓమ్

శ్రీ వేమనయోగీన్ద్రాయ నమః

# వేమగీతా (ప్రథమసహస్రమ్)

## సమూలమ్ (ఉత్తరార్ధమ్)

శ్రీ రా మ నృ సిం హ మూ ర్తి క వీ :—

శ్రీ వేమనయోగీన్ద్ర స్తుతిః

శ్రీ నిస్తులానందవనే చిదభ్ర
రథ్యాసు చాధ్యాత్మిక గీతి లోల ! ।
వేమాంధ్రభాషాకవికోకిలావాం
దేహ్యుత్తరార్ధ గ్రథనేఽపి శక్తిమ్॥

2. సర్వోపనిషత్సారయోగః

1 మాతృగర్భచ్యుత స్యాస్తి, నాదా వంతేఽపి చాంబరమ్ ।
మధ్యకాలే ధృతే వస్త్రే, వేమ ! హాస్యాస్పదం ఖలు ॥

2 పరతత్త్వవిదాఽనేన, ప్రోక్తం పద్యసహస్రికమ్ ।
లోకే పఠిత్వా త్యజత, వేమాంత శ్చ బహిస్తమః ॥

---

వేమన పద్యములు (ఆటవెలదులు)

1 తల్లికడుపునుండి తాఁ బుట్టినప్పుడు, మొదట బట్టలేదు తుదిని లేదు ।
నడుమబట్టఁగట్ట నగుబాటు కాదొకో!, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

2 శ్రీకరపరతత్త్వశీలుఁడౌ వేమన, పల్కినట్టి వేల పద్యములను ।
లోకమందుఁ జదివి లో వెలిఁ బాయరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

3 వేమప్రోక్తేషు పద్యేషు, సంతు దోషా స్సహస్రశః ।
తథాపి గుణ ఏ వాస్తే, వేమ! ప్రాప్నుహి ధీరతామ్ ॥

4 వేమప్రోక్తాని పద్యాని, దద త్యర్థం సహస్రధా ।
దర్శం దర్శం లభే త్త్వత్ర, వేమ! జ్ఞానం మహాద్భుతమ్ ॥

5 భక్త్యా సహస్రపద్యానాం, వివేకీ యః పఠే న్నరః ।
తస్య వేమ! న చాపైతి, ముక్తిః కరతలస్థితా ॥

6 యావ ద్ద్రవ్యం వేమ! నేష్టే, త్తావ జ్జ్యోతిఃప్రయోజనమ్ ।
దృష్టే ద్రవ్యే జ్యోతిషా కిం?, వపు షాల మధీశ్వరే ॥

7 "ఖం బ్ర"హ్మేతి వద న్త్యేకే, కథం బ్రహ్మ భవే న్నభః ? ।
నిత్యశో వేమ! భావే తు, ఖాకారే బ్రహ్మణి స్థితే ॥

8 ఆతపచ్ఛాయయో రీతిం, జ్ఞాతుం శక్నోతి యో భువి ।
తిష్ఠే దేకత్ర వే వేమ, భ్రమే త్కుక్షింభరో యతిః ॥

---

3 వేముఁ డిట్లు సెప్పు వేలపద్యంబులఁ, దప్పు లెన్నియున్న నొప్పె యుండు
తత్తరపడకందు బిత్తరివైయుండు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

4 వేయివిధము లరయ వేమనపద్యము, లర్థమిచ్చు వాని నరసి చూడ ।
చూడఁజూడగల్గుఁ జోద్యమౌ జ్ఞానంబు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

5 వేయిపద్యములు వివేకియై భక్తితోఁ, బఠనఁజేయునట్టి భక్తునకును ।
బాయకుండు మోక్షపద మఱచేతి దై, విశ్వదాభిరామ వినురవేమ! ॥

6 సొమ్ముఁగనెడిదనక జ్యోతికావలెఁగాని, సొమ్ముఁగన్నవెనక జ్యోతియేల? ।
దేవుఁడైనవెనక దేహంబు చిక్కేల?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

7 బయలు బ్రహ్మ మనుచు భాషింపు చుందురు,బయలదేలతానుబ్రహ్మమగును,
బ్రహ్మమైనబయలు భావమందుండఁగా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

8 ఎండనీడచంద మెఱుఁగ నేర్చినవాఁడు, ఉండు నెల్లకాల మొక్కచోట ।
తిండిపోతుయోగి తిరుగుచునుండురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

9 గురు ర్బృహస్పతి శ్చేందో,ర్దదౌ శాపం హి నిర్ఘృణః ।
కదాపి వేమ! స్వచిత్తే, గురుః క్రోధం న ధారయేత్ ॥

10 స్తుతిం కరో త్యనాత్మజ్ఞాం, య స్తచ్ఛ్లాఘీ జడో నరః ।
విఖ్యాం సంవీక్ష్య గాయంతీం, శ్లాఘతే వేమ! బాలిశః ॥

11 సాధు నిర్ధారితో క్తే శ్చ, నేతి గర్వా త్క్షణా ద్భవేత్ ।
త త్తు వేమ! స్థిరీకర్తు, మవతీర్యాః పితామహాః ॥

12 యది కర్మగుణాతీతో, న చరే త్తత్త్వవి త్కథమ్? ।
భవే త్తైలం వినా వేమ!, దీపో జ్వలతి కిం తిలైః? ॥

13 పచిత్వా గార్దభక్షీరం, యది శర్కరయా ప్లుతమ్ ।
భక్ష్యం భవే త్కిమ్? మూర్ఖో౽పి, వేమార్యో న త ద్ఘైకదా ॥

14 లిప్తే౽ంగే చందనేనాపి, ఖరో భస్మని లుంఠతి ।
అనాగరికమర్త్యానా, మీదృశీ వేమ! వైఖరీ ॥

---

9 గురుబృహస్పతియును గుణమించుకయులేక, చందమామకిచ్చెశాపమపుడు ।
గురుఁడు కోప మూన కూడ దెన్నటికిని, విశ్వదాభిరామ వినురవేమ !॥

10 ఆత్మ నెఱుఁగని స్తుతి నట్టిట్టుఁ జేసిన, వాని మెచ్చువాఁడు నట్టివాఁడె ।
ముక్కిడిదియుఁబాడమూర్ఖుండుమెచ్చుఁడా, విశ్వదాభిరామ వినురవేమ!॥

11 ఔనటంచు నొక్కఁడాడినమాటకుఁ, గాదటంచుఁ బలుక క్షణముపట్టు ।
దాని నిల్పఁదీయఁ దాతలు దిగవలె, విశ్వదాభిరామ వినురవేమ !॥

12 కర్మగుణములన్ని కడబెట్టి నడువమి, తత్త్వ మెట్లు తన్నుఁ దగులుకొనును ।
నూనెలేక దివ్వె నూవుల వెల్గునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

13 ఖరముపాలఁ దెచ్చి కాచి చక్కెరవేయ, భక్ష్యమగునె? యెన్న భ్రష్టుఁ డట్లె ।
ఎంతయేనిజెప్పి యొసగింప ఁబొసఁగునే, విశ్వదాభిరామ వినురవేమ !॥

14 ఖరము మేనినిండ గంధంబుఁ బూసిన, బూదిలోనఁబడుచుఁబొర్లుమఱల ।
మోటువారిసొగసు ఁబోలునియ్యది సుమీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

15 శాబాపహాసకార్యండ,మివ మూర్ఖజనా వృథా ।
అజానంతస్సతాంశక్తిం, గర్హంతే వేమ! కేవలమ్ ॥

16 య దీహ గ్రాసదైన్యేన, పీడ్యంతే వేమ! పండితాః ।
తేష్వా విద్యా కథం తిష్ఠే?, దామకుంభే జలం యథా ॥

17 విచింత్యే హాత్మన శ్రేయః, వేమ! ధర్మం బ్రువంతి యే ।
తాన్నిందంతి ఖలా ధూర్తాః, హినస్తి తృణదం వృషః ॥

18 వేమ! సంచింత్య పాత్రత్వం, దాతు స్సవిధ మాశ్రితః ।
వక్రోక్తిం కురుతే మూర్ఖః, యథాహి శ్చందనద్రుమే ॥

19 ఋజుతా మశ్నుతే రజ్జ్వా, శిలాబద్ధా పటోలికా ।
తథా బద్ధశ్శునః పుచ్ఛః, త్యజేత్కిం? వేమ! వక్రతామ్ ॥

20 అవాచ్యవాదీ నీచాత్మా, సతాం జానాతి కిం ప్రథామ్? ।
వేమ! చందనసౌరభ్యం, కిం వేత్తి గ్రామసూకరః? ॥

---

15 గ్రుడ్డువచ్చి పిల్లఁ గోరడా లాడిన, విధముఁగానెఱుఁగక వెఱ్ఱిజనులు ।
జ్ఞానులైనవారి గర్హింతు రూరక, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

16 గ్రాసమింతలేక కడుకష్టపడుచున్న, విద్య యేలనిల్చు వెడలుకాని ।
పచ్చికుండనీళ్లు పట్టననిల్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

17 తనదు బాగుఁగోరి ధర్మంబుఁ జెప్పినఁ, దిట్టుచుండ్రు మొఱకులెట్టయెదుట ।
గడ్డివేయఁ బోట్లగొడ్డు కొమ్మాడించు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

18 దాన మరసి చేయు దాత దగ్గఱఁ జేరి, వక్రభాషణములఁ బలుకు మొఱకు ।
చందనతరువందు సర్పముండిన రీతి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

19 పొట్లకాయరాయి పొదిగి త్రాటను గట్ట, లీలతోడ వంకలేక పెఱుగు ।
కుక్కతోఁకఁగట్టఁ గుదురునా చక్కఁగా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

20 బంటబూతులాడు పరమనీచుం డెన్న, దండివారిగొప్ప తా నెఱుఁగునె? ।
చందనంబు ఘనత పంది యేమెఱుఁగును?, విశ్వదాభిరామ వినురవేమ !॥

21 గ్రామకోడో న జానాతి, సుగంధద్రవ్యసౌరభమ్ ।
అమేధ్య మత్తి సాధ్వీత్వం, వేమ! కిం వేత్తి పుంశ్చలీ? ॥

22 భూతిం లిప్త్వా జటా ధృత్వా, వేమ! వేషధరో భవేత్ ।
నాప్నోతి ముక్తిం సన్నద్ధః, కటో నైతి కవాటతామ్ ॥

23 నిగృహీతం మనో వేమ!, ప్రధానమితి భావయన్ ।
తన్నిగ్రహవిధిజ్ఞస్త్వం, పూర్ణంపదమవాప్నుహి ॥

24 సర్వతీర్థేషు యజ్ఞేషు, శిరో సంవపనాదృతే ।
న ఫలం తన్మంత్రజలాత్, వే మాంబష్ఠజలం ఘనమ్ ॥

25 అంజనే నాత్మని ద్రవ్యం, దృష్ట్వా యో వేమ! వర్తతే ।
న యోగీ కాలవి న్నీడే, కూజతే ఖలు కుక్కుటః ॥

26 ఋషిభి ర్జ్ఞానభిజ్ఞాతో, విశేషో నాస్తి భూతలే ।
తదుక్తిమర్థోఽనువర్తేత్, వేమాతత్ జ్ఞాః జడాః ధ్రువమ్ ॥

---

21 ఊరపం దెఱుంగ దుత్తమగంధంబు, చెడ్డసరక మెల్లఁ జెందుఁగాని ।
సాధ్విమహిమ మెట్లు స్వైరిణి యెఱుఁగురా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

22 ఒడల బూదిఁబూసిజడలుధరించిన, నొడయుఁడగునుముక్తిఁ బడయులేఁడు।
తడక బిఱ్ఱువెట్టఁ దలుపుతో సరియౌనె?, విశ్వదాభిరామ వినురవేమ!॥

23 రమ్యమైన మనసు రాజనియెంచుచు, గమ్యముగను దాని గట్టు బిగిఁగి ।
మఱిగి పూర్ణపదవి మహిలోనఁ గానరా, విశ్వదాభిరామ వినురవేమ!॥

24 సకలతీర్థములను సకలయజ్ఞంబులఁ, దలలు గొఱుగకున్న ఫలముకలదె? ।
మంత్రజలముకంటె మంగలిజల మెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ!॥

25 ఆత్మలోనిసొమ్ము నంజనమునఁ జూచి, యంటితిరుఁగునట్టియతఁడు యోగి।
పుంజు గూటనుండి ప్రొద్దెఱింగియు గూయు, విశ్వదాభిరామ వినురవేమ!॥

26 ఋషు లెఱుంగనట్టి విషయంబుభువిలేదు, వారుచెప్పినంత వరుననగును।
తెలియ కనెడువారు వెఱిలు నిజమయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

27 "గజ" ఇత్యనృతంప్రాహ, గురుం హంతుం కులం దహన్ ।
వేమ! నామ్నా ధర్మరాజో, నింబబీజోపమః ఖలు ॥
28 శ్రుతిస్మృతీతిహాసాదీన్, వ్యాఖ్యాకుర్వం త్యనేకశః ।
విపులీకృత్య వేదాంతే, సారం వేమ!న వక్తి కిమ్? ॥
29 వేమ! క్షౌమాంబరం ధృత్వా, చోర్ధ్వపుండ్రం నిధాయ చ ।
"వైష్ణ వోహ" మితి భ్రాంతః, జనా న్వంచతి మద్యపః ॥
30 కించి చ్ఛ్రుతం దాంభిక స్తు, కించి దే వాశ్రుతం వచః ।
చిత్రం చిత్రం వదే ద్వేమ!, సాక్షా ద్దృష్ట మి వాధికమ్ ॥
31 కుంభః" కుం, డేతి వే మాద్రిః, " కొం, డేతి లవణం తథా।
'ఉ' ప్పి త్యుక్తి స్సమా తత్త్వ, మేకం భాషా స్తు భిన్నధా ॥
32 య ద్య స్త్వవకరం చేక్షు, వనే వే మాపి తద్రసః ।
న న ష్ట్వజ్ఞే స్థితే ప్రాంతే, యథా జ్ఞానం వివేకినః ॥

---

27 కులమునిఱుఁజేసిగురువునువధియింపఁ,బొసఁగనేనుగనుచుబొంకుబొంకె ।
పేరుధర్మరాజు వెనుపేఁపవిత్తయా॰ విశ్వదాభిరామ వినురవేమ ! ॥
28 టిప్పణములఁజేసి చప్పనిమాటలఁ॰ జెప్పుచుందురన్ని స్మృతులశ్రుతుల।
విప్పిచెప్పరేల వేదాంతసారంబు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
29 పట్టుబట్టఁగట్టి పట్టనామముఁబెట్టి, వట్టిభ్రాంతిఁజెంది వైష్ణవుఁడయి ।
లొట్టెత్రాగియతఁడు లోకులఁ జెఱచురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
30 విన్నసుద్దికొంత విననిసుద్దులుకొన్ని, వింతసుద్దులెన్నొ వినఁగఁ జెప్పు ।
తానుగన్నయట్టె దాంబికుం డెప్పుడు, విశ్వదాభిరామ వినురవేమ !॥
31 కుండ॰కుంభ,మన్నఁ గొండఁ॰బర్వత, మన్న,ఉప్పు ॰లవణ,మన్ననొకటికాదె?
భాష లిట్లె వేఱు పరతత్త్వ మొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
32 చెఱుకుతోటలోనఁ జెత్తకుప్పుండినఁ, గొంచెమైనదాని గుణము చెడదు ।
ఎఱుకకలుగుచోట నెట్టివాఁ డున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

33 పాఠకస్య మతే ర్వేమ !, సాధకస్య మతి ర్వరమ్ ।
వేదై ర్వాదై శ్చ కిం దేహ, శుద్ధ్యా పశ్యే త్పరం ప్రభుమ్ ॥

34 వేమ ! జ్ఞాత్వా జీవభేద, మనస్టా బ్రహ్మతాం గతాః ॥
రాజంతే స్వాత్మి మంబ్వధా, పూరాక్తికీ భూతవాః పునః ? ॥

35 షట్స్థూణాసువృఢాధారం, స్థాప్యైక స్తంభమందిరమ్ ।
మందిరస్య స్వయంకర్తా, ఏకో వేమ ! విరాజతే ॥

36 దేశాటనేన యత్పుణ్యం, దర్శనే నైవ తత్సతామ్ ।
వర్షాంబుమలినం వేమ !. నదీసంగాద్ధి నిర్మలమ్ ॥

37 సస్యోత్పాదీ ఫలం భుంజే, త్తథా వే మేహ నేతరః ।
సస్యోత్పాదక ఏ వేహ, బహుధా సౌఖ్యవాన్ భవేత్ ॥

38 ఆర్భాటం పండితమ్మన్యః, కరోతి న బుధ స్తథా ।
శాంతో వేమ ! కి మశ్వస్య, గణనా భషతా శునా ॥

---

33 చదువరిమతికన్న సాధకు మతిమేల్మి, వేదములనులేదు వాదములను ।
ఒడలుశుద్ధిఁజేసి యొడయుని జూడ నౌ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

34 జీవభేదమెఱిఁగి చెడిపోనివారలు, బ్రహ్మభావమొంది పరఁగుచుంద్రు ।
నీరుముత్యమైన నీరుగా మాఱునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

35 అఱుదూలములకు నాధార మైనట్టి, యొంటికంబమింటినొనరనిల్పి ।
యింటికొకఁడు కర్తయేపారుచుండును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

36 పుడమిఁదిరిగి పడయు పుణ్యంబు తెల్లను, కల్గు సాధుజనులఁగన్నయపుడె ।
పడిననీరు నదిని గడుఁ దేటయై యుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

37 పైరునిడినవాని ఫల మది సఫలంబు, పైరు నిడనివాఁడు ఫలముఁగనునె? ।
పైరు నిడిన వాఁడె బహుసౌఖ్యవంతుఁ డౌ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

38 బంటువలెనులేవఁ బండితమ్మన్యుండు, సాధుపండితుండు శాంతుఁడగును ।
కుక్క మొఱుగ నేమి గుఱ్ఱమునకులెక్క?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

39 అనేకకావ్యపఠనం, బహుశబ్దాభిభాషణమ్ ।
కథం చిచ్ఛక్యతే వేమ !, దుర్లభా హి సహిష్ణుతా॥

40 న సహంతే తుచ్ఛకార్యం, నాద్రియంతే ద్విజా ఇతి ।
గణనా కా కుల స్యాహో !, వేమ ! ముఖ్యో గుణః ఖలు ॥

41 జ్ఞానం దత్త్వా యది జనాం, స్తారయిష్యంతి బాడబాః ।
తేషాం దేయం మహాద్భాగ్యం, సఖ్యం వే మాతిగౌరవమ్ ॥

42 ఆదౌదృష్టేస్స్వయంవేమ !, సర్వత్రాస్తేతదాదిచ ।
ద్రష్టుం కోఽపి నశక్నోతి, స్యాన్ముక్తిపథమాత్మవి॥

43 చండాల కన్యాసౌరూప్యం, దృష్ట్వా త్రైశంకవః పురా ।
న మేనే వేమ ! నేచ్ఛంతి, హ్యకార్య కరణే ఘనాః ।

44 విబుధా మంతికే, వేమ !, విద్యాహీనో వసే ద్యది ।
న విద్వాన్ భవితుం యోగ్యో, హంసమధ్యే బకో యథా॥

---

39 బహుళకావ్యములనుపఠియింపఁగావచ్చు, బహుళశబ్దచయముఁబలుకవచ్చు।
సహన మొక్కటబ్బ (జాల కష్టంబురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

40 బాపలన్నమాత్రఁ బరువునఁ జూడరు, కానిపనులఁజేయఁ గడలుకొనరు ।
కులములెక్క యేమి? గుణమె ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

41 బ్రాహ్మణులకు సకలభాగ్యంబు లీవచ్చు, గౌరవింపవచ్చుఁగలియువచ్చు।
జ్ఞానమొసఁగి జనులఁ గడతేర్చు నటులైన, విశ్వదాభిరామ వినురవేమ !॥

42 ఆదిఁ జూచు చుండ నన్నిటఁ దానుండు, నాదిఁ జూడనెవరి కలవికాదు ।
ఆదిముక్తి తెరువదాత్మనే యుండును, విశ్వదాభిరామవినురవేమ !॥

43 మాలకన్నియలకు మంచిరూపం బున్న, ముట్టెనే? త్రిశంకుపట్టి నాఁడు ।
కానిపనులఁజేయ ఘను లానఁ బడుదురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

44 విద్యలేనివాఁడు విబుధుల సభలోన, నుండఁగానె పండితుండుఁగాఁడు ।
కొలనిహంసలకడ కొక్కెర యున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ !॥

45 యది వ్యాధి ర్భవే ద్దేహే, నాపైతి హ్యౌషధాదృతే।
వేమ! తన్నికటే దీప, మకృత్వా పైతి కిం తమః? ॥

46 స్వర్ణవి ద్యేహ సుఖితుం, బ్రహ్మవిద్యా పరే మతా।
తదన్యవిద్యా స్సకలా, నిష్ఫలా వేమ! చింతయ ॥

47 వేమ! హేమమృగో భూమౌ, "వస్తినా" స్త్రీ త్యచింతయన్।
త్యక్త్వా పత్నీం గతో రామః, దేవోఽపి ధన మిచ్ఛతి ॥

48 వే మేహ హేమ య స్యాస్తి, స కామో భీమ ఏవ చ।
విరాజతేఽతి తేజస్వీ, సర్వభ్రిష్టో హి నిర్ధనః ॥

49 వేమాఖుగ్రహణేనైవ, మార్జాలో నహి తృప్యతే।
కుక్కుటగ్రిహణాపేక్షీ, కుతో ముక్తిస్పృహావతః ?॥

50 ఇంద్రస్య వాసో హేమాద్రౌ, తథా ప్యాశా న శామ్యతే।
కిం నార్థయామాస వేమ!, కర్ణం కనకకుండలే ॥

---

45 వ్యాధికలిగెనేని వైద్యునిచేతను, మందుఁదినకకాని మాన దెందు।
చెంతదీపమిడక చీకటి వాయునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

46 ఇహమునసుఖియింప హేమకారకవిద్య, పరమున సుఖియింప బ్రహ్మవిద్య।
కడమవిద్య లెల్లఁ గన నిష్ఫలంబులే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

47 కనకమృగము భువినిగద్దు లే, దనకను, తరుణి విడిచిపోయె దాశరథియు।
దైవమైన ధనముఁ దలఁచుచుండును కాదె, విశ్వదాభిరామవినురవేమ !॥

48 కనకమున్నవాఁడు కాముఁడు భీముఁడై, మిగులతేజమునను మెఱయుచుండు,
విత్తహీనుఁడైన వెఱ్ఱులలో నేటు, విశ్వదాభిరామ వినురవేమ !॥

49 పిల్లియెలుకఁబట్టి ప్రియమునముండక, యదియెకోడిఁ బట్టననుగమించు।
మమతవిడుపకున్న మఱి మోక్షమబ్బునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

50 కనకపర్వతమునఁ గాపురం బుండిన ననిమిషేశ్వరునకు నాస పోదు।
కనకకుండలములు కర్ణుని నడుఁగఁడే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

51 ఏక ఏవ హి కర్ణ స్స్యాత్, ఘనో నాన్యస్తుకశ్చన ।
"దానశీల" ఇతి ఖ్యాతః, దాతారం కురుతే ధనమ్ ॥

52 కులీనో ధనవా నేవ, ధనం సర్వార్థసాధనమ్ ।
యస్య నాస్తి ధనం వేమ !, కులం తస్య తు నిష్ఫలమ్ ॥

53 కృత్త్వా దేహసమా వేమ !, దత్త్వా ధనవతే సుతా ।
సమాయ సరసత్వా త్త్వా, నిర్ధనా యాతిబంధురా ॥

54 "ఆత్మబంధు"రితి స్నేహో, దానీయ ధనినం స్వయమ్ ।
సదక్షిణం దద త్యస్మై, కన్యాం వేమ ! స్వలంకృతామ్ ॥

55 సుఖాపాది ధనం న స్యాత్, మాతాపుత్రవిరోధకృత్ ।
తథా ప్యాహో ! కథం వేమ !, జీవనం చార్జనం వినా ॥

56 దారాపత్యార్థధాన్యాది, సంపద్వ్యాప్నోతి యావతీ ।
కార్పాసకీటక స్యేవ, వ్యథా వే మాస్య తావతీ ॥

---

51 కర్ణుఁడొకఁడెకాని ఘనుఁడెవ్వఁడునులేఁడు' దానశీలుఁడనుచుఁదలపఁబడగ।
దలప ధనము కర్ణు దాతఁగాఁ జేసెను, విశ్వదాభిరామ వినురవేమ !॥

52 కలిమికలుగ సకలకులముల కెక్కువ, కలిమి భోగభాగ్యములకు నెలవు ।
కలిమిలేనివాని కుల మేమి కుల మయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

53 కలిమిఁజూచియాయఁగాయమిచ్చినయట్లు, సమునకీయనదియుసరసతనము।
పేదకిచ్చుమనువు పెనవేసి నట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

54 తనకుబంధువనుచుఁదానెతోడ్కొనివచ్చి,కలిమిఁగలయఁజూచికాంక్షబడుచు
దక్షిణలనొసంగి తనయ నియ్యఁగఁ జూచు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

55 తల్లికొడుకులకునుతగువునుబుట్టించు,ధనముసుఖముఁగూర్పదనివచింత్రు।
కాని గడనలేక గడుచుట యెట్లురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

56 తరుణిసుతులుధనము ధాన్యముల్ సంపద, లెంతచుట్టుకొనిన నంతచేటు।
పసిరికాయపురుగు పద్ధతికానంగ,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

57 అసత్యభీతః ప్రాగ్వేమ!, బల్లాణ స్స్వప్రియాం నృపః ।
దదౌ పరస్మై సంగంతుం, బాలోఽభూత్ విరహీ చ సః ॥

58 రోగార్తో దేవతాభక్త, శ్శూర స్స్వచ్ఛరవర్జితః ।
బ్రహ్మచారీ భవే ద్వేమ!, విత్తహీనో జనో భువి ॥

59 య శ్శ్వేతే క్షీరపాథోధౌ,స హరి ర్వ్రజ వేశ్మసు ।
క్షీరం హి చకమే వేమ!, సర్వే పరధనార్థినః ॥

60 ధనినో వ్రణబాధాపి, బహుధా వేమ! వర్ణ్యతే ।
దరిద్రస్య గృహే వృత్తో, వివాహోఽపి న వేద్యతే ॥

61 పత్యు స్సంప ద్బలం పత్న్యాః, నిస్స్వ భర్తా నిరర్థకః ।
నిరర్థకం పతిం వేమ!, నాద్రియంతే హి యోషితః ॥

62 కథం నిదానం వే త్త్యల్పః, వక్తుం నార్హతి దోషదృక్ ।
శ్వా పాతయతి కుంభౌఘం, వేమ! నాలం తథా కృతౌ ॥

---

57 పలికిబొంకలేక బల్లాణరాజటు, పడతిఁ గూడనిచ్చెఁ బసనకపుడు ।
బాళిమీరనతఁడు బాలుఁడై పడియుండె, విశ్వదాభిరామ వినురవేమ !॥

58 తెవులుపడ్డవాఁడు దేవతాభక్తుండు, ఈటెలేనివాఁడు పోటుబంటు ।
కాసులేనివాఁడు కడు బ్రహ్మచారియౌ, విశ్వదాభిరామ వినురవేమ !॥

59 పాలసాగరమునఁ బవ్వళించిన హరి, గొల్లపల్లెఁబాలుఁ గోర నగునె? ।
ఎదుటివారిద్రవ్య మెల్లవారికిఁ దీఁపె, విశ్వదాభిరామ వినురవేమ !॥

60 పుత్తడికలవాని పుండుబాధయు కూడ, వసుధలోనఁజాల వార్త కెక్కు ।
పేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు, విశ్వదాభిరామ వినురవేమ !॥

61 మగనికలిమిబలిమి మగువకునుబలంబు, కలిమిలేనిమగఁడుకాసుఁగాఁడు।
పనికిరానిమగని బాటించి చూడరు, విశ్వదాభిరామ వినురవేమ !॥

62 ఆదికారణమును నల్పుఁ డెట్టులెఱుంగుఁ, జెప్పలేఁడుకాని, తప్పుఁబట్టు ।
త్రోయనేర్చుకుక్క దొంతులఁ బేర్చునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

63 నరోఽపరాధీ పారోక్ష్యే, ప్రత్యక్షే సాధు వచ్చరేత్ ।
యద్యన్యైత న్న జానంతి, వేమ కిం వేత్తి నేశ్వరః ?॥

64 యన్మూలం ముక్తిమార్గస్య, తద్గ్రంథే పఠితే జనైః ।
శ్రుణ్వతాం వేమ! సర్వేషాం, భవంతి విభవా శ్శుభాః ॥

65 ఇహాముత్రికసౌఖ్యానాం, ఇదం సాధన మిత్యపి ।
లిఖతాం పఠతాం, వేమ! శృణ్వతాం చ శుభం భవేత్ ॥

66 గండికోటే నరో వేమ!, ఖడ్గధారణమాత్రయా ।
న స్యాద్రాజభట శ్శత్రూన్, కిం హంత్యభిముఖాన్ యుధి॥

67 వేమ! భూమిపతే ర్వశ్యాః, అన్యేభ్యో భూమికర్షకాః ।
క్షీరోపమకులోత్పన్నా, ధన్యా భూపాలకా భువి ॥

68 క్రమం తత్త్వస్య విజ్ఞాయ, వేమ! నైర్గుణ్య మాస్థితః ।
శబ్దార్థజ్ఞోఽపి యో మౌనీ, "పరా"త్మేతి స కథ్యతే ॥

---

63 అంతరంగమందు నపరాధములఁ జేసి, మంచివానివలెనె మనుజుఁడుండు।
ఇతరు లెఱుఁగ కున్న నీశ్వరుఁ డెఱుఁగఁడా, విశ్వదాభిరామ వినురవేమ!॥

64 ముక్తిమార్గమునకు మూలమై తగునట్టి, గ్రంథమంతజనులు గడఁగిచదువ।
విన్నవారికెల్ల విభవముల్ కలుగును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

65 ఇహపరంబులకును నిదిసాధనంబని, వ్రాసి చదువ విన్న వారికెల్ల।
మంగళంబులొనరు మహిలోన నిజమిది, విశ్వదాభిరామ వినురవేమ! ॥

66 గండికోటలోనఁ గత్తిపట్టిన యంత, రాజుగారిదొడ్డ రౌతు కాఁడు।
ఎంతవారినైన నెత్తినఁగొట్టునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

67 ఒరులకొఱకుభూమి నొదిగించువారును, అవనిపతికి వశ్యులైనవారు।
పాలవంటికులము వారు కాపు లెఱుంగ, విశ్వదాభిరామ వినురవేమ!॥

68 నిజము వరుస నెఱిఁగినిర్గుణత్వం బంది, పలుకులోని యర్థములరఁ దెలిసి
పలుకకుండువాఁడె పరమాత్మ యగునురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

69 సత్యజ్ఞ స్సుజనో వేమ !, పరేభ్యస్తదృతం వదేత్ ।
న గోపయే త్కించి దపి, నాపరం చ వదే ద్వచః ॥

70 జననీ పార్వతీదేవీ, జనకః పరమేశ్వరః ।
బాంధవా స్తద్గణా వేమ !, కైలాసో జన్మభూ ర్ధ్రువమ్ ॥

71 అస్థిరం తనువిత్తాది, సర్వం చేతి స్వయం విదన్ ।
పరాన్ బోధతి యో వేమ !, పరమాత్మా స సంయమీ ॥

72 కాంతాం విరజ్య సంత్యజ్య, విటః పశ్చాత్తు తత్స్థితిమ్ ।
కిం స్మరే ద్వేమ ! నోచ్ఛిష్టపత్రం కిం భువి లుంఠతి ? ॥

73 విటోపభుక్తా త్యక్తా స్త్రీ, నిర్ధనం చాద్రియే త్పతిమ్ ।
ఉపానహం రాశిగతాం, వేమ ! శ్వా భక్షతే యథా ॥

74 మూర్ధని బ్రహ్మణ శ్ఛిత్వా, విక్షిప్తే వేమ ! దేవతాః ।
రోద్ధుం న శేకిరే నాశం, యాం తీశస్య కృపాం వినా ॥

---

69 నిజముదెలిసియున్న సుజనుఁడా నిజమునె, పలుకవలయుఁగాని పరులకొఱకు ।
దాపఁగూడ దింక నోప దన్యముఁ బల్క, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

70 తల్లిపార్వతియగు తండ్రియే శంభుండు, ప్రమథగణములఖిలబంధువితతి ।
తనకుపుట్టినిల్లు తనరఁగైలాసంబె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

71 తనువు నస్థిరమని ధనము నస్థిరమని, తెలుపనేర్చి తానుఁ దెలియనేర్చి ।
పాత్రుఁడైనయోగి పరమాత్మయేసుమీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

72 విటుఁడుస్త్రీనిరోసి విడిచిపెట్టు పిదప, నేడనున్న సిగ్గు నెంచనేల? ।
కుడిచివేయుపుల్లె గోతుల దొర్లదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

73 విటుఁడుచెఱచి పిదప విడిచిపెట్టినయది, పేదపెనిమిటిఁగని ప్రియముఁజేయు
కుప్పలోనిచెప్పు కుక్క తిన్నట్లయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

74 బ్రహ్మను తలగొట్టి పాఱవైచిన యప్పు, డడ్డుపడఁగ నోప రైరి సురలు ।
శివునికరుణలేమి చెడిపోకపోదురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

75 "ఆఢ్యోఽహ"మితి నిర్లజ్జం, దుర్వికత్థపరం నరమ్ ।
ఇహాఽపి నోన్నతి ర్యాతి, పరత్ర చ మృతిం గతమ్ ॥

76 త్వయిబ్రువతివేమేహ, మానవోనిత్యపూజితః ।
త్వయ్యబ్రువతినిద్రాళుః, త్వదుక్తింవేత్తినిర్మలః ॥

77 దాతుః పత్యు ర్వేమ! పార్శ్వే, య ద్యదాతా వసే త్ఖలః ।
నివర్తయే ద్దూషయిత్వా, ఫలద్రౌ కంటకా ఇవ ॥

78 మందం స్యా త్సైరిభహలం, న్యూనం వృషభలాంగలాత్ ।
ముగ్ధాయా వల్లభో వేమ!, శ్లాఘేత్కిం జరతాం స్త్రియమ్?॥

79 ఛత్రే స్థితే భవే చ్ఛాయా, జ్ఞానం స్యా చ్ఛాస్త్రదర్శనే ।
జనకే చ స్థితే వేమ!, స్వాశ్రయో విస్మృతే ఖలు ॥

80 గళితే వతి దూష్యేఽక్ష్ణి, క్రిమిగర్తే ఘుణాన్వితే ।
గృహే పీతస్తనే వేమ!, దార్ఢ్యం కిం సాధు తిష్ఠతి ?॥

---

75 బిడియమింతలేక పెద్దను నేనంచుఁ, బొంకములను బల్కు సంకరునకు ।
హెచ్చుకలుగ దిచట చచ్చిన రా దట, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

76 నీవుఁబలుకకున్న నిత్యపూజితుఁడౌను, నీవుఁబలుకకున్న నిద్రపోవు ।
నీవుఁ బలుకు పలుకు నిర్మలుండెఱుఁగురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

77 పెట్టెడుపతివెంట పెట్టనిలోభున్నఁ, దిట్టితిట్టి తిరుగఁ గొట్టుచుండు ।
పండ్లచెట్లక్రింద ముండ్ల కంపలు వోలె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

78 దున్నపోతుమడక పదునుగా సాగదు, ఎద్దుమడకకంటె హెచ్చుకాదు ।
ముద్దరాలిమగఁడు ముదుసలి మెచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

79 ఛత్రమున్నఁ దగినఛాయయేర్పడుచుండు, శాస్త్రమెఱుఁగఁదగినజ్ఞానమొదవు
అబ్బయున్నవాని కండ యుండును కదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

80 చీముకారుపంట ఁజెదలుపట్టినయింట, పురుగుపుట్టుగుంటఁ బుసులకంట ।
బిడ్డచీకుచంట బిగియుండ నేర్చునా? విశ్వదాభిరామ వినురవేమ !॥

81 యథా మన్నె గృహే వేమ!, వస్త్రే కుక్షౌ చ మాతరి ।
వేష్టుం శక్తః తథా మర్త్యః, సన్యా దీక్షాం మన్నవిత్ ॥
82 "రక్ష ర"క్షేతి కృపణో, యో రోదితి శిశు ర్భృశమ్ ।
తస్మై దదాతి యా స్తన్యం, వేమ! సా పుణ్యభాగినీ ॥
83 ధృత్వా కాషాయవసనం, స్థిత్వా యోగీవ యః పుమాన్ ।
రాత్రౌ త్యక్త్వా వేమ! వర్తేత్, ఛద్మయోగీ స కథ్యతే ॥
84 వనం గత్వా శ్రమాయస్తః, ప్రాప రాజ్యం తతో నలః ।
సహతే వేమ! కష్టాని, యః స సౌఖ్యాని విందతే ॥
85 తృణాశిపశుఖాదీ యః, స"చండాల"ఇతీర్యతే ।
వేమ! కుక్కుటభోక్తారో, కిం కథ్యంతే "ద్విజా" ఇతి ? ॥
86 రత్నభూషాన్వితా వేమ!, కంఠసూత్రం వినా సతీ ।
యథా న భాతి దుర్నీతో, విద్యాఢ్యో ఽపి న శోభతే ॥

---

81 కొంపలోన మఱుఁగు కోకలోన మఱుఁగు, కన్నతల్లి మఱుఁగు కడుపుమఱుఁగు ।
ఇన్ని మఱుఁగులందు నెఱుఁగు మఱుఁగయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
82 "కావు కావు"మనుచుఁ గరుణకై యేడ్చెడి, శిశువుఁ జేరఁదీసి చిత్తమలరఁ ।
బాలనిచ్చునట్టి పడఁతి పుణ్యాత్మురా, విశ్వదాభిరామ వినురవేమ !॥
83 కావిబట్టఁగట్టి మునియోగివలె నుండి, వెలఁది రాత్రిగాఁగ విడిచిపెట్టి।
తొడరి తిరుగువాఁడు దొంగసన్యాసయా, విశ్వదాభిరామ వినురవేమ !॥
84 కాననంబుఁజేరి కడు శ్రమనొందిన, యా నలుండు రాజ్యమందె మఱలఁ
గష్టములకు నోర్వఁ గల్గవా సుఖములు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
85 కసవునేరి తినెడు పసరముఁ దినువాని, మాలయండ్రు కాదె మహిని నరులు।
పట్టికోడిఁదిన్న బాపలంటందురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
86 విద్యకలిగియుండి వినయంబు లేకున్న, ఐదువులకు మేలిమైన మణులు
సొమ్ములుండి కంఠసూత్రము లేనట్లు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

87 అశుచేః కిం వైద్యకార్యైః?, కి మంధస్య ప్రసాధనైః ।
బృహద్దండయుతస్యాపి, కిం వే మాశు విలంఘనైః ? ॥

88 లంకాపురం శ్రియోధామ, విధ్వస్తం స్వల్పవానరైః ।
అనుకూలే వేమ ! కాలేఽఘనా స్స్యు రధమా అపి ॥

89 న హి బ్రూయాత్ ప్రగల్భోక్తీః, రణే చాసత్యవాదినమ్ ।
న లాలయే త్తథా వేమ !, గురుణాం చ న వాదయేత్ ॥

90 కిం వా మౌక్తికసీమంతై, ర్వీతంతోః పుణ్యయోషితః ।
సర్వవర్ణోచితా వేమ !, శునః కిం శిబికాంచితా? ॥

91 అశ్రోత్రితోక్తవచో మర్త్యో, మూర్ఖ శ్శ్రోతాతిమానితః ।
శ్రుతేఽశ్రుతేపి వేమార్యః, న త్యజే త్కథనోద్యమమ్ ॥

92 భావజ్ఞః పరవాక్యస్య, ప్రత్యుక్తిం యది భాషతే ।
తుష్యే ద్వేమ ! ప్రశంసే చ్చ, నోచే దాత్మని కుత్సతే ॥

---

87 వసుధ నెడ్డెకేల వైద్యకార్యంబులు?, గ్రుడ్డివానికేల గునుగుపరుగు? ।
బుడ్డవానికేల పోకుప్పిగంతులు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

88 లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి, పిల్లకోఁతిపాజు కొల్లఁగొట్టె ।
కలిసివచ్చువేళ ఘనులౌదు రల్పులు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

89 రజ్జులాడరాదు రణభూమిలోపల, బుజ్జగింపరాదు బొంకువాని ।
నొజ్జతోడవాదు లొనరంగ మానరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

90 ముండమోపికేల ముత్యాలపాపట, వన్నెలెల్లఁ బుణ్యవతికిఁగాక ।
కుక్కకేలఁదలఁపఁ గుచ్చులపాలకీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

91 మాటఁజెప్పవినని మనుజుఁడుమూర్ఖుఁడు,మాటవిన్ననరుడుమాన్యుడగును ।
మాటవినఁగఁజెప్ప మానుట కూడదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

92 మాటఁదెలిసియొకనిమాటకుఁ బ్రతిఁజెప్ప,సంతసించునతఁడుఁజాలమెచ్చు
మనసుఁదెలియ కనిన గునియుచు నను నేదొ,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

93 యా స్త్రీ వేమ! పతౌ భక్తిం, న త్యజేత్సా జగత్త్రయే।
ముక్తిం ప్రాప్నోతి పత్యుః, దేవతా స్సర్వయోషితామ్॥

94 భావజ్ఞా యది సేవేత, భార్యాత్మాసం ప్రభుర్భవేత్।
గృహస్యాపి వృథా వేమ!, తదభావే స్వజీవనమ్॥

95 భారతోక్తేషు సర్వేషు, ధర్మేష్వపి చ సూనృతమ్।
ఉత్తమం వేమ! తత్సత్యం, భావా శ్రేష్ఠా ప్రదా భువి॥

96 వేమ! దానేషు సర్వేషు, చాన్నదానం మహాధికమ్।
గానేషు సామగానం చ, ధ్యానేషు శివభావనా॥

97 తుషాయామస్తి వే మాన్నం, ద్రుమేచ మధురం ఫలమ్।
శోధితే మారుతే సమ్యక్, ముక్తిం త దనువిందతే॥

98 శాకునం తు ఫలం దత్తే, క్షీరప" క్షీతి కథ్యతే।
కిం పక్షీ వేత్తి వే మాహో!, ఆత్మన్యేవ శుభాఽశుభా॥

---

93 మగనిమీఁద భక్తిమానకుండినకాంత, మూఁడులోకములనుముక్తిఁ గనును।
మగువ లందఱకును మగఁటె దేవతలయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

94 భావ మరసి తన్ను భార్య సేవించిన, నింటికైననగును నీశ్వరుండు।
అదియులేక బ్రతుకు టధమంబు భువిలోన, విశ్వదాభిరామ వినురవేమ!॥

95 భారతమునఁబల్కు పలుధర్మములయందు, సత్యనిష్ఠమేటి సత్యముకద?।
వసుధదానఁగలుగు వన్నెయె మిన్నయౌ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

96 దానములను నన్నదానమే దొడ్డది, గానములను సామగాన మెచ్చు।
ధ్యానములను శివునిధ్యానమే శ్రేష్ఠంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

97 ఊకయందుబుట్టి యున్నది యన్నంబు, మ్రాఁకునందుఫలముమానితమగు
సోకుగాలిఁబట్టి శోధింప మఱిముక్తి, విశ్వదాభిరామ వినురవేమ!॥

98 పాలపక్షి శకునఫల మిచ్చునందురు, పాలపిట్టకేమి ఫలము దెలియుఁ।
దనదు మేలు కీళ్లు తనతోడ నుండంగ, విశ్వదాభిరామవినురవేమ!॥

99 వేమా జితాత్మ నాత్మజ్ఞః, వృథా పంచాఙ్గజల్పనైః ।
పౌరోహిత్యే కృతే తద్ధి, భవే దనుచితం భువి।

100 ద్వేష్యస్థలేషు బహుధా, ఉదాసీనః ప్రియం వదేత్ ।
దాహకః పావకో వేమ !, వసతే న కి మింధనే ?॥

101 పరద్రవ్యేషు య స్త్వృష్ణాం, త్యజతే స హి పుణ్యవాన్ ।
విత్తం పరేషాం వే మోర్వ్యాం, బహుధా పాపసంచితమ్ ॥

102 యది రక్షే త్పరై ర్దత్తం, స్వదత్తా ద్విగుణం భువి ।
అన్యై ర్దత్తం ధనం వేమ !, న హరే జ్జాతు మానవః ॥

103 ప్రౌఢాంగనా నాగరికాః, పల్ల్యాం శక్తా న జీవితుమ్ ।
తథా వే మాత్మమార్గే చ, న శోభంతి హి భోగినః ॥

104 పతకస్థమణిశ్రేణీ, స్థగితా హేమ్ని శోభతే ।
న త థేతరలోహేషు, వేమ ! నష్టద్యుతి ర్భవేత్ ॥

---

**99** పాడికాదు జగతి పంచాంగములుసెప్పి, కొంచెమైన బుద్ధి నొంచలేక ।
బ్రహ్మమెఱుఁగ కిట్లు పౌరోహితముఁ జేయు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**100** పలుతెఱంగులుగనుపగయుండుచోటుల,జిటుకుమనకప్రియమెచెప్పవలయు
గాల్పఁదగిన యగ్ని కట్టెలో నుండదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**101** పరులవిత్తమందు భ్రాంతిమానని యట్టి, పురుషుఁ డవనిలోనఁబుణ్యమూర్తి
పరులవిత్త మరయఁ బాపసంచిత మగు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**102** పరులదత్తమొప్పి పాలనఁజేసిన, నిల స్వదత్తమునకు నినుమడి యగు ।
నవనిపరులదత్త మపహరింపఁగ రాదు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**103** పత్తనంబులగల ప్రౌఢాంగనలు మఱి, పల్లెలందునిల్చి బ్రతుగఁ గలరె? ।
సుఖులు పరముదారి శోభింపఁ జాలరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**104** పతకమందునొప్పుబలురత్నములపెంపు,బంగరందుఁగూర్పఁబరువుగనును।
కాని యితరలోహమైన హీనమె కదా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

105 కృత్వా పరిశాంతం యః కన్యా, దాతారం భృతిదాయకమ్।
నాద్రియే ద్వేమ ! సోఽతీవ, కథ్యతే కూటమానసః ॥

106 గృహీత్వా న త్యజే ద్వేమ ! దశలక్షఫలేన వా ।
వదే ద్దత్వార్థినే నాథ్య, మపి నార్చే ద్వృథా విభుమ్॥

107 భూత్వా ద్విజకులే తీర్ణః, స్వయం నాన్యాం శ్చ తారయేత్ ।
య స్తేన వేమ ! కో లాభో, జీవితేన మృతేన వా ?॥

108 మహిషీ వాతరోగార్తా, వాతై స్స్యా ద్యదిజీవితా ।
తస్యాః క్షీరం తు కిం వేమ !, జుగుప్సిత మి తీర్యతే ॥

109 ప్రాప్తే ప్రగాఢదారిద్రే, యది కుర్యా దసత్క్రియాః ।
తతో నష్టి స్వప్రతిష్ఠా, ఫలం వేమ ! న లభ్యతే ॥

110 మాతాపిత్రోః దరిద్రేషు, విప్రష్టేషు తథా నృషు ।
వేమ ! ప్రభుషు చాత్యంతం, భయభక్తియుతో భవ ॥

---

**105** పడుచునిచ్చి నతనిబత్తెమిచ్చినవాని, కడుపు చల్లఁజేసి మనత నిడుచు ।
నడుపనేర నతఁడు నాలిముచ్చే కదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**106** పట్టివిడువరాదు పదిలక్షలకునైన, పెట్టిదెప్పరాదు పేదకైన ।
వెట్టిగొలువరాదు విభుఁ డెట్టిఘనుఁడైన, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**107** ద్విజకులంబునందు, దేజరిల్లుచుఁబుట్టి, తాఁదరించి యొరుల దాటఁజేయ।
లేని యాతఁ డున్న లేకున్న నొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**108** దొమ్మతెగులుచేతఁ దూలిన గేదెకు' వాతవేయ బ్రతికి వచ్చెనేని ।
వాతయెనుముపాలు రోతనవచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**109** దళముకొనియొకప్పు దారిద్ర్యమేర్పడ, హీనకార్యములు సహించి చేయఁ ।
బరువుమాయు నంతె ఫల మింత చిక్కదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**110** తల్లిదండ్రులందు దారిద్ర్యయుతులందు, నమ్మిననిరుపేద నరులయందుఁ ।
బ్రభులయందుఁజాల భయభక్తు లుంచుము, విశ్వదాభిరామవినురవేమ ! ॥

111 పత్యాశ్రయేణ వేమ! స్యాత్, తరుణీ పుణ్యశాలినీ ।
తత్రైవ పాపినీ భర్తృ, వర్తనం స్త్రీషు వర్తతే ॥

112 అన్యకాంతా మాతృతుల్యా, న్యాయబుద్ధ్యా యదీక్ష్యతే ।
తథా వేమ! జనా నిత్యం, న పశ్యంతి పరస్త్రియమ్ ॥

113 సుతః కశ్చిత్ పితు ర్వేమ!, ఘనో య ద్యపి వర్తతే ।
తథాపిపితరం హీనం, కర్తుం నేచ్ఛే త్తతో౽త్యయః ॥

114 శ్రుత్వా వచః పితు ర్వేమ!, హత్వా మాతర మంజసా ।
భార్గవః కిం ఫలం ప్రాప, జగా మాద్రిం నిరాశ్రయః ॥

115 వక్తుకామార్థినో భావ, మజాన న్నేవ ధిక్కృతిమ్ ।
న కుర్యా త్తేన భణితం, శ్రుత్వా వేమ! ప్రియం వదేత్ ॥

116 నిర్గత స్సలిలాన్ మత్స్యః, మ్రియతే వారిణి స్థితః ।
ప్లవతే హి తథా వేమ! ,సర్వో వర్త్యం త్యనాశ్రయాః ॥

---

111 తరుణిపుణ్యవతిగ పతునిపట్టియెయగు, పాపినియగుమగని ప్రాపుపలస ।
భర్తవర్తనంబె పడఁతుల యందుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

112 తన్నుఁగన్నయట్టి తల్లివంటిది సుమ్ము, అన్యకాంత న్యాయ మరసి చూడఁ ।
గన్నదాని జనులు కానంగ లేరయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

113 తనయుఁ డెవ్వఁడేని దనతండ్రికంటెను, పేరుఁదెచ్చునట్టి పేదయైన ।
జనకుహీనుఁజేయ సాహసించినఁ జేటు, విశ్వదాభిరామ వినురవేమ !॥

114 తండ్రిమాటలువిని తల్లిని దెగటార్చి, పరశురాముఁ డేమి బాముకొనియె ।
నిలువనీడలేక కులగిరిఁ జేరఁడా, విశ్వదాభిరామ వినురవేమ !॥

115 ఛీకొనంగతగదు డెంద మెఱుంగక, యడుగవచ్చి కొంతయనినవాని ।
జెప్పునంత వినియు మెప్పుగాఁ బలుకుమీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

116 ఝుషము నీరువెడలఁ జచ్చుటే సిద్ధంబు, నీటనుండెనేని నిగిడి పడును ।
అండతొలఁగునెడల నందఱపని యింతె, విశ్వదాభిరామ వినురవేమ !॥

117 జంత్రిమంత్రిప్రిథాం వేత్తి, వహ్ని స్తంత్ర ప్రథాం తథా।
మంత్రవాదీచ వేమైవం, భోక్తా తిం త్రిణికా ప్రథామ్॥
118 సంగో దుష్టై స్సమం వేమ!, భవే త్పాపకరో భువి।
మహార్షే శ్చాపి నాప్నైతి, తత్సంగో మాస్తు నశ్యసి॥
119 నాప్త స్సన్నిహిత శ్చేతి, బంధు ర్విస్రింభ భాజనమ్।
బంధు రాత్మాత్మన శ్చైవ, వేమాత్మ్యంతం సమాహితః॥
120 పఞ్చాఙ్గుళిబలా ద్వేమ!, కర్మాణి కురుతే కరః।
నైకోనో౽పి తథా కర్మ, వినైకం స్వం వినశ్యతి॥
121 ముఖ్యం వేమైకమత్యం స్యా, త్తద్బలేన మహత్ఫలమ్।
రజ్జుం కృత్వా శుష్కతృణైః, కిం న బధ్నంతి సామజమ్?॥
122 ఐకమత్యేన ప్రతిష్ఠా, దంపత్యో ర్వేమ! వర్తతే।
సత్యభ్యాసే న్మతిం పత్యుః, భార్యారక్షైవ తస్య చ॥

117 జంత్రమంత్రమహిమజాతవేదుఁడెఱుంగు,మంత్రవాదియెఱుగుదంత్రమహిమ
తంత్రిణీక మహిమఁ దినువాఁ డెఱుంగును, విశ్వదాభిరామ వినురవేమ!॥
118 ఖలులతోడిపొందు కలుషంబుఁ గల్గించు, మాన దెంత మేటిమౌనికైన।
వాని జేరఁడీయ వలవదు చెడుదువు, విశ్వదాభిరామ వినురవేమ!॥
119 అయినవారలంచు నాప్తు లటంచును, బందుగులను నమ్మ పాడికాదు।
తనకునైనవాఁడు తానొకఁడే యగు, విశ్వదాభిరామ వినురవేమ!॥
120 అయిదువ్రేళ్ల బలిమి హస్తంబుపనిచేయు,నం దొకటియుఁవీడఁబొందికచెడు।
స్వీయుఁ డొకఁడు విడిన జెడుఁగదా తనబల్మి, విశ్వదాభిరామ వినురవేమ!॥
121 ఐకమత్యమొక్క టావశ్యకం బెప్డు, దానిబలిమి నెంతయైనఁ గూడు।
గడ్డివెంటిఁబెట్టి కట్టరా యేనుఁగుఁ?, విశ్వదాభిరామ వినురవేమ!॥
122 ఐకమత్య మెన్న నాల్మగలకు వాసి, మగనిబుద్ధులెల్ల మగువ నేర్చు।
దానిరక్షణంబె వాని రక్షణమగు, విశ్వదాభిరామ వినురవేమ!॥

123 ఋణాధిక్యకరః పుత్రం, హీనం యః కురుతే పితా ।
స వైరీ వేమ! భార్యా చ, తథైవ హ్యావశం గతా ॥

124 మక్షికా సన్మధురుచేః, కామీ కామరుచే ర్మ్రియేత్ ।
త్యాగహీనో హతా ద్వేమ!, మ్రియే దర్థిభి రర్థితః ॥

125 అల్పేన పాలితోఽవశ్యః, ప్రతీపం గచ్ఛతే భటః ।
నివర్తతే వా వే మైతత్, స్థూణాలంబాటనోపమమ్ ॥

126 స్నానసంధ్యాజపాహార, నిష్ఠా బహ్వీ స్సమాచరన్ ।
వర్తతే వేమ! పుణ్యాఢ్యో, న దత్తే కస్యచి ద్ధనమ్ ॥

127 స్నాత్వా న దత్వా సద్ధర్మం, వృథా కిం జలమజ్జనైః ?।
స మజ్జతే కిం వే మాప్సు, తత్రత్యో జలకుక్కుటః?॥

128 వేమ! ప్రస్థమితం భూరి, పీత్వా సోమలతారసమ్।
ధన్యంమన్యా శ్చరం త్యాహో!, కంఠస్థం కిము తత్ఫలమ్ ॥

---

123 ఋణముఁబెంచిసుతునిహీనుఁగా నొనరించి,విడుచుతండ్రివైరివీరుఁడరయ।
వలవికానియట్టి యాలును నట్టులే, విశ్వదాభిరామవినురవేమ! ॥

124 ఈగ తేనెరుచికి నింపుగాఁ జచ్చును, ఓగు కామరుచికి నొదిగి చచ్చు ।
త్యాగికానివాని ధర్మమడుగఁ జచ్చు, విశ్వదాభిరామ వినురవేమ !॥

125 అనువుగానిబంటునల్పుడేలినయెడ,మాఱుమలయునొండెమగుడునొండె ।
దూల మూతకోల దొరికిన చందంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

126 స్నానసంధ్యజపముఁజరియించు భుజియించు, నిష్ఠలెన్నియైన నెరపుఁగాని।
ఒకనికీయఁ డెపుడు సుకృతంబు నెఱిఁగియు, విశ్వదాభిరామ వినురవేమ !॥

127 స్నాన మొనరఁజేసి సద్ధర్మ మీయక, నీళ్ల మునుఁగ నగునె నేర్పు లేక ।
నీరుకోడి నీళ్ల నెలవుగా మునుఁగదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

128 సోమలతలరసము సోలలకొలదిని, త్రావి మిగులఁ దామె చేవ టండ్రు ।
క్రతుఫలంబు కంఠగత మగుఁ గాబోలు, విశ్వదాభిరామ వినురవేమ !॥

129 నిర్వ్రీడో న శివానందీ, అవినీతో న నిస్త్రపః ।
యో లజ్జాం త్యజతే వేమ !, చిరకాలం స జీవతి ॥

130 లజ్జా తమశ్ఛటా ప్రచ్ఛ, గుప్తనిద్రాపి చాత్మని ।
వేమ ! కుత్ర విలీయంతే, సమ్యగ్ జ్ఞానీత తద్విహః ॥

131 ఏకత్వం ప్రాపితే సర్వే, సమూహే నాస్తి శాత్రవమ్ ।
న్యూనాధిక్యక్రమే వేమ !, వైరం హాని శ్చ జాయతే ॥

132 వేదాంతవేద్య స్స్యా ద్వేమ !, బహుధా నాశితవ్యథః ।
రతిజ్ఞో రమణః కాంతా, సక్త స్సంసార వాక్ యతిః ॥

133 నిందే త్సర్వా నపి సదా, వేమ ! వాదపరాయణా ।
దత్తే హాని మకామానాం, ధూర్తా స్త్రీ క్షేపణీ శిలా ॥

134 నావస్సత్యం వార్ధిమధ్యే, శకటస్య బహిస్థ్సలే ।
వ్యక్తం భవతి వే మాహో !, స్త్రీసత్యం నాస్తి కుత్ర చ ॥

---

129 సిగ్గువిడువకున్న శివసౌఖ్యమే లేదు, తగ్గి మొగ్గకున్న సిగ్గువిడదు ।
సిగ్గు విడుచువాఁడె చిరకాలజీవిరా, విశ్వదాభిరామ వినురవేమ !॥

130 సిగ్గు దాగునెచటఁ జీఁకటియెటవాగు, నాఁక లేశ వాగు నాత్మలోన ।
వాగియున్న నిద్ర దాగుటఁ దెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

131 సముదయంబునందు సర్వ మొక్కటియైన, వైర మొదవ దెట్టివారలైన ।
హెచ్చు తగ్గు లందు నేర్పడురా హాని, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

132 వెతలఁ దీర్చువాఁడువేదాంతవేద్యుండు, రతులనేలువాఁడురమణుఁడగును।
సతిని బెనఁగువాఁడు సంసారయోగిరా,విశ్వదాభిరామ వినురవేమ !॥

133 వాద మాడితిట్టు వదున నెవ్వరినైనఁ, జేరరా ద టన్నఁజేటుఁ దెచ్చు ।
గడుసురాలు తెలియ వడిసెల రాయిరా, విశ్వదాభిరామ వినురవేమ !॥

134 నావసత్య మెల్ల నడిసముద్రములోన, బండి సత్య మెల్ల బట్టబయల ।
నాడుదాని సత్య మేడనులేదు రా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

135 అవశ్యాయాః స్త్రియో వైరం, కిం వాచ్యం కీర్తినాశకమ్ ।
న సందేహం వేమ! తస్యా, స్సాంత్వనం కామితార్పణమ్ ॥

136 సుందరోఽపి ధవో వేమ!, వజ్రసేవధిర ప్యత ।
శీలవిభ్రాజితోఽపి స్త్రీ, పుమాంసం పర మిచ్ఛతి ॥

137 పుణ్యాస్త్రీ కురుతే పత్యుః, భక్తిం మానధనాన్వితా ।
ఆత్మని శ్లాఘతే వేమ!, విద్యా దంతర్గతం రహః ॥

138 పత్యావగణయ న్దోషం, దత్తచిత్తేఽపి జారిణీ ।
నైసర్గం న త్యజే ద్వేమ!, పిష్టభుక్ శ్వా మలం యథా ॥

139 సుదృఢా శృంఖలా భార్యా, శిశవో వేమ! గ్రంథయః ।
కారాగారం చ సంసార,మేవ మాత్మని చింతయ ॥

140 వేశ్యయానృతవాదిన్యా, సంగతం వేమ! పూరుషమ్ ।
సా నష్టసదనం కృత్వా, నిస్సారయతి మందిరాత్ ॥

---

135 పశముకానియాలివైరమేమనవచ్చు,యశముఁజెఱుచుఁగానియ పుపడదు
కొసరు లెల్ల దానికోర్కె తీర్చుటయె యౌ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

136 వరుఁడు చక్కనైన వజ్రాల గనియైనఁ దళుకుమెఱుపువంటితత్త్వమున్న।
అన్యపురుషవాంఛ యాడుదానికినుండు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

137 మానధనము విడచు మఱి పుణ్యవతియైనఁ,బూని పతికిభక్తి పొసఁగఁజేయు।
లోన మెచ్చుచుండు లోగుట్టు కనవలె,విశ్వదాభిరామ వినురవేమ!॥

138 మగఁడు తప్పుఁగనక మనసిచ్చియున్నను, సహజగుణమువిడదుజారకాంత।
పిండి తినెడి కుక్క పెంట కాసించవా, విశ్వదాభిరామ వినురవేమ!॥

139 భార్యతనదుపాలి భారపునంకెల, చిన్న చిన్న శిశువు లెన్న సీల ।
లరయఁగ చెఱసాల యగును సంసారంబు,విశ్వదాభిరామ వినురవేమ! ॥

140 బొల్లిమాటలాడు భోగముదానితో, దొల్లి దుల్ల నిల్లు గుల్లఁజేసి ।
వెళ్లిరమ్మటంచు వెడలించు నింటిని, విశ్వదాభిరామ వినురవేమ!॥

141 ఉన్మత్తస్య దరిద్రస్య, పంగో ర్వా కుష్ఠరోగిణః ।
మోహప్రదాంగనా బాధేత్, వేమ! దృష్టిపథం గతా ॥

142 జుగుప్సాకారికామిన్యాం, ప్రేమ వేమ! దినే దినే ।
మాతరి జ్యోతిషి ప్రేమ, సమం గౌరవదాయకమ్ ॥

143 యది పశ్యే ద్దేహభావం, బహుహేయాలయం ఖలు ।
పరస్త్రీసంగమో వేమ!, ప్రత్యక్షనరకం ధ్రువమ్॥

144 జ్ఞాతారం వేమ! నేతారం, మత్వా వినియతో నరః ।
నీతిం విద్యాత్ జ్ఞానిలాభే, కిం ఫలం త్వ స్త్య్వవేదినః ?॥

145 వశీకరోతి పురుషం, జారా న కలహప్రియా ।
కుర్యా దవాచ్యవాదాం శ్చ, ధూర్తా వేమ! నిరంతరమ్ ॥

146 జాలేభ్యో వీక్షితుం స్త్రీణా, మవకాశం న కల్పయేత్ ।
యది కుర్యా స్తథా వేమ!, సర్వనాశో భవే ద్ధ్రువమ్ ॥

---

**141** పిచ్చివానికైనఁ బేదవానికైనఁ, గుష్ఠురోగికైనఁ గుంటికైన ।
భామ కానుపింప బాములఁ బెట్టురా, విశ్వదాభిరామవినురవేమ ! ॥

**142** నాతిపైన ప్రేమ నానాటికిని రోత, జ్యోతిపైన ప్రేమ జూడఁగాను ।
మాతృప్రేమ యొకటె మర్యాదఁదాల్చును, విశ్వదాభిరామ వినురవేమ !॥

**143** దేహభావ మెల్లఁ దెలియంగఁ జూచిన' నఖిలహేయములకు 'నాలయంబు ।
పరసతిగమనంబు ప్రత్యక్షనరకంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**144** జ్ఞాతయైనవాని నేతగా భావించి, నీతు లెఱుఁగవలయు నియతి గలిగి ।
జ్ఞానులున్న లాభ మానునే? తెలియుమి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**145** జగడమునకుఁబోదు జారిణి యెప్పుడు, మాయఁజేసి పురుషుమమతఁబెట్టుఁ।
కాని మాటలాడు గయ్యాళి సతతంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**146** జాలలోననుండి స్త్రీల వీధులవంక, జూడనీయరాదు సుమ్ము వినక ।
చేతురేని యట్లు చేటు మూడును జుమీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

147 యది పశ్యేత్ రూపవంతం, పురుషం స్త్రీ స్వవల్లభమ్।
పశ్యే న్న్యూనం వేమ! నాస్తి, స్త్రీబుద్ధే రవరా మతిః ॥

148 అంగనాయాః తనుం వీక్ష్య, వేమ! ముహ్యంతి పూరుషాః ।
కుక్షౌ మలం న పశ్యంతి, తన్వా కిం మలయుక్తయా ?॥

149 నాగాధతా భయం వేమ!, తరణోపాయ శాలినః ।
శాఖిగ్రోషిణ స్తు కిం భీత్యా, కపి శ్చంక్రమతే న కిమ్? ॥

150 కుడ్యోపమం నార్యసత్యం, పుంస స్తు కటసమ్మితమ్ ।
స్త్రీణాం తు వేమ! చాతుర్యం, పుంసః క్షోభయతే భృశమ్॥

151 యది భార్యా గుణవతీ, పుత్రకా బుద్ధిశాలినః ।
తదా సంసారిణో వేమ!, కిం స్వర్గేణ ఫలం వద ॥

152 దేహద్యుతౌ న గణనా, సిద్ధానాం మానసం తతః ।
రజంతే వే మోపరిష్టాత్, పనస స్యాస్తి కా ప్రథా ॥

---

**147** చక్కనైనవాని మక్కువఁ గన్నంతఁ, దక్కువగనుజూచు (వనదు విభుని
ఆడుబుద్ధికంటె నవరబుద్ధియు లేదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**148** కాంతమేనుఁ జూచి కలవరపడెదరు, కడుపులోనిరోతఁ గానలేక ।
ఇంతరోతగల్గు యీదేహమేలరా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**149** ఈతవచ్చినపుడు లోతనిపించునా, పాతదోషి కరయ భయముకలదె? ।
కోఁతికొమ్మనెక్కి కుప్పించిదూకదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**150** ఆడువానిబొంకు గోడఁబెట్టినయట్టు, పురుషవరునిబొంకు పూరితడక ।
స్త్రీలనేర్పు మగలఁ జీకాకుఁ బఱచురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**151** సుగుణవంతురాలుసుదతియై యుండిన బుద్ధిమంతులగుచుఁబుత్రులొప్ప ।
స్వర్గ మేటి కయ్యె సంసారి కింకను, విశ్వదాభిరామ వినురవేమ !॥

**152** సిద్ధులైనవారి చిత్తంబు రంజిల్లు, నొడలి మెఱుఁగు లెక్క కిడరు గాన।
పనసపండుమనత పైనేమి కలదయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

153 న త్యాజ్యం సాధుసాంగత్యం, వినా ప్రకృతి వర్జనాత్ ।
న ఫలం వేమ! కిం బీజం, స్యా చ్ఛలాటు నికృంతనాత్ ॥

154 సత్యా దోషః పతిం యాతి, అర్ధః పతిగుణే సతీమ్।
దోషః పతికృతో వేమ!, న సతీం ప్రాప్నుతే ఖలు ॥

155 న హేళయే త్సత్యసంధాన్, దరిద్రై ర్నవివాదయేత్ ।
కదాచి దపి సంపన్నైః, వేమ! కుర్యా న్న సంగతిమ్ ॥

156 కిం వైద్యే నాగదజ్ఞేన, కిమలోపజ్ఞకాంక్షయా ।
చిత్తానభిజ్ఞైః కిం వేమ!, మర్మజ్ఞైః పూరుషై ర్భువి ॥

157 న విశ్వసే ద్వేషధరం, వేషదోషో మహా ఖలు ।
పురా వేషో రావణస్య, వేమ! హానిప్రదో నను ॥

158 నవనీతం కరే ధృత్వా, ఘృతకాంక్షీ పుమా నివ ।
స్మరతే దైవ మన్యత్ర, వేమ! దైవ మపి స్వయమ్ ॥

---

153 సాధుజనులచెలిమి చాలింపఁ గారాదు, ప్రకృతి విడకయున్న ఫలములేదు।
పిందెఁ గోసిచూడ బీజంబుఁగల్గునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

154 సతియొనర్చుచెడుగుపతికవశ్యమువచ్చుఁ,బతియొనర్చుమంచినతికినగము।
పతియొనర్చు చెడుగు నతికేల రాదురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

155 సత్యపరులతోడ సరసమాడఁగరాదు, పేదవారితోడఁ బెనఁగరాదు।
కలిమికలుగువారి కలియనే రాదయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

156 వ్యాధి నెఱుఁగలేని వైద్య మ దేలరా, కొదువఁదెలియలేని కోర్కెతేల? ।
మనసుఁదెలియలేని మర్మజ్ఞు లేటికి?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

157 వేషధారి నెపుడు విశ్వసింపఁగరాదు, వేషదోషము లోక విధమె యగును।
రట్టుకాదె మున్ను రావణు వేషంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

158 వెన్నఁజేతఁబట్టి వివరంబుఁ దెలియక, ఘృతముఁ గోరునట్టి యతనిభంగిఁ।
దాను దైవమయ్యు దైవముఁ దలచును, విశ్వదాభిరామ వినురవేమ!॥

159 త్యాజ్యపూరుషసంగత్యా, హాని స్స్యాత్సర్వవీథిషు ।
స ఏవ వర్తతే వేమ!, దుష్క్రియానిరతో హి సః ॥

160 న చాస్తి వేషో విస్రభ్యః, నాత్తు మన్నం న చాంబరమ్।
తథాపి కిం న వేత్త్యజ్ఞో, వేమ! విశ్వమయం విభుమ్॥

161 శ్రోతు ర్ద్రష్టాధికో వేమ!, ద్రష్టు శ్చాపి సుసంగతః ।
ఉన్నతా దున్నతో భూమా, వేవం మర్త్యాః పరివర్తతే ॥

162 యదా భవే ద్విత్తహీనః, తదా మాతా చ పుత్రకా ।
భార్యా చ సుహృద స్సర్వే, వేమ! స్యు ర్వైరిణో ధ్రువమ్॥

163 కుజనా శ్చాపతన్ వేమ!, విజయే ధృతకార్ముకే ।
భజనాభిరతో నూనం, విజయం నైతి కిం భువి ?॥

164 వృష్టిభీత్యా విశే దంతః, సహతే తీక్ష్ణ మాతపమ్ ।
కథం లోకే జనా వేమ!, న సహంతే శుభం ఫలమ్॥

---

159 వీడవలయువాని గూడిన నెగ్గగు, వీటివాటలందు వెలయువాఁడు ।
పాడుచేయుపనులు పరిపాటిగొలదిని, విశ్వదాభిరామ వినురవేమ !॥

160 విశ్వసింపఁదగిన వేషంబు మఱిలేదు, కుడువఁగూడుఁ గట్టఁ గోకలేదు ।
విశ్వమయుఁడు నైన విభునేలఁ దెలియఁడో, విశ్వదాభిరామవినురవేమ !॥

161 విన్నవానికన్న కన్నవాఁ డధికుండు, కన్నవానికన్నఁ గలియువాఁడు ।
నున్నతోన్నతుఁడయి యుర్విలోపల నుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

162 విత్తహీనమైన వేళలందును దల్లి, తనయు లాలు సుహృదు లనెడువార ।
లెల్ల శత్రు లగుదు రెందైన నిజ మిది, విశ్వదాభిరామ వినురవేమ !॥

163 విజయుఁడైనవాఁడు విల్లంది నంతనే, కుజనులైనవారు కూలిరి కద ।
భజనఁజేయు నతఁడు విజయముఁ గాంచడా, విశ్వదాభిరామ వినురవేమ !॥

164 వానభయముచేత పడిదూరెదరు లోన, నెండ కెంతయైన మొండి చఱతు ।
రేల లోకజనులు మే లోర్వ కుందురు?, విశ్వదాభిరామ వినురవేమ!॥

165 వాగ్దత్తం రభసా కృత్వా, "అద్య శ్వ" ఇతి మోహయన్ ।
శ్వోఽతీతే వేమ! "గ"చ్ఛేతి, నిష్కాసయతి నిర్ఘృణః ॥

166 లవణం స్యా త్కియ ద్వేమ !, తల్లాభ స్తు కియా నితి ।
న మంతవ్యో హి భోగైః కిం, ఫలం స్యా దుపయోగతః ॥

167 రూపపక్షే నామరూఢం, నామపక్షాశ్రితాః క్రియాః ।
నామరూపక్రియాణాం తు, నాశోఽంతే వేమ! సంభవేత్ ॥

168 రజోవృతో రాజ్యభారే, నశ్యే దుభయతోఽక్షమీ ।
జల స్యోపరితిష్ఠేత్కిం, వేమాయోగోశకో మనాక్ ॥

169 భవోఽబ్ధి ర్మకరీ భార్యా, స్యు ర్ఝలూకాదయోఽర్భకాః ।
అస్మరంతో భవహరం, వేమ! పారం న యాంతి హి ॥

170 జీవేగతే పాశబంధైః, తనుం బధ్నంతి బాంధవాః ।
దర్శయంతో వేమ! దుఃఖం, తేన నైకోపి గచ్ఛతి ॥

---

165 వల్ల వైపు లేక వాగ్దత్తములఁ జేసి, యదిగొ యిదిగొ యనుచు నాసఁ బెట్టి ।
గడువుపెట్టి రేపు గడువఁగా పొమ్మను, విశ్వదాభిరామ వినురవేమ !॥

166 లవణమెంత దానిలాభంబుఁగన నెంత, కొద్దిదనుచు నెన్నఁగూడునయ్య ।
భోగమేటికి యుపభోగంబె లెక్కగు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

167 రూపువంకపేరు రూఢిగా నిల్చును, పేరువంక క్రియలు పెనఁగు చుండు ।
నాశ మౌను తుదకు నామరూపక్రియల్, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

168 రాజసంబుఁగోరి రాజ్యభారమునందు, నోర్పులేని యాతఁ డుభయతఁజెడు ।
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక, విశ్వదాభిరామ వినురవేమ !॥

169 భవము సాగరంబు భార్యయౌ మకరంబు, చేప జలగ లగును శిశువులెల్ల ।
భవహరుం దలుపక పార మందఁగ లేఁడు,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

170 పాశబంధమునను బధువర్గం బెల్లఁ, జిక్కఁజూతు రరయ జీవము చన ।
నొక్కఁడైన నేగఁ డుసురు మాత్రమె కాని, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

171 పరదారాక్ష వాంఛ తేఽజ్ఞః, జిహ్వాబద్ధో ఝుషో యథా ।
మధురత్వే వేమ! లగ్నాః, న కిం నశ్యంతి మక్షికాః ॥

172 సతీపతీనాం నగరే, మోహాశోహాః క్రమ శోఽధికాః ।
ముక్తే ర్మార్గం వేమ! లబ్ధుం, న యుక్తిం చ విదంతి తే ॥

173 కథంచి ద్యది భాగ్యం స్యాత్, సాధూ న్నిందే న్మదాన్వితః ।
వేమాధికా నల్పజాతిః, కిం విజానాతి కుక్కురః? ॥

174 "భారతః పంచమో వేదః", ఇతి నిర్బుద్ధయో జనాః ।
స్తువంతి కిం వేమ! హింసాం, దృష్ట్వా మిష్ట మభూ త్కథమ్? ॥

175 అన్యాయాయ న్యాయశాస్త్రం, ధర్మశాస్త్రం త థైవ చ ।
దుర్మతాయ జ్యోతిషం తు, వేమ! స్యా దవినీతయే ॥

176 జలస్పృష్టాగ్ని రంగారః, ఘటస్థజల మగ్నినా ।
సంతప్యతే పశ్య వేమ!, మహచ్చిత్ర మిదం ఖలు ॥

---

**171** పాపజాతినరుఁడు పరసతిఁ గోరుట, చేప జిహ్వారుచికిఁ జిక్కు నట్లె!।
తీఁపినంటి యీగ తెగువతో సీల్గదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**172** పత్తనంబులందుఁ బతులకు సతులకు' మోహ మెచ్చు దాన నూహ లెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**173** పట్టికుంచి యధికభాగ్యంబుఁ బట్టినా, దొడ్డవారిఁ దిట్టి త్రుళ్లిపడును ।
అల్పజాతికుక్క యధికుల నెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**174** పంచమనిగమంబు భారతం బగు నని, పొగడి రేల జనులు బుద్ధిమాలి ।
హంస నెంచిచూడ నిష్ట మె ట్లయ్యెసో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**175** న్యాయశాస్త్ర మరయనన్యాయమొనరించు, ధర్మశాస్త్రమొసఁగు దుర్మతంబు'
జ్యోతిషంబు జనుల సితులఁ దప్పించు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**176** నీరుపైనఁబడిన నిప్పులు బొగ్గులౌ, నిప్పుమీఁద కుండ నీరుఁ బెట్టఁ ।
గళపెళనుచు ఁగ్రాగుఁ గదు చోద్యమిదికదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

177 సమ్మార్జయిత్వాలంకృత్య, గేహం దేహాఖ్య మన్వహమ్ ।
సిద్ధం కృత్వా విసృజ్యాంతే, వేమ! జీవో వ్రజే త్తతః ॥

178 మాతా పితా బాంధవా శ్చ, హితా స్సర్వే సమీక్షయా ।
కన్యాం దిశంతి కిం వేమ!, యచ్ఛంతే భాగ్య ముజ్జ్వలమ్॥

179 విశ్వనాథే చ విప్రేషు, వేదోక్తేషు విభావపి ।
యస్య నాస్తి ధ్రువాభక్తిః, పాపాత్మా ఖలు వేమ! సః ॥

180 మోహిన్మాయాం విదిత్త్వైవ, వేమ! లంబోదరః పురా।
అనూఢవాన్ బద్ధకచ్ఛః, జన్మనై వాంజనాసుతః ॥

181 రజకో వర మభ్యస్త, కుక్షి విద్యా త్తథైవ చ ।
గృహదేవా చ్చ మహిషీ, సురేభ్యో వేమ! జారిణీ ॥

182 రమ్యం హి ఖగసౌందర్యం, స్పష్టం దృష్టా స్తు శ్రేణిషు ।
కిం వేమ! దైవాదత్తేన, సౌందర్యేణ విమూఢ! తే ॥

---

**177** దేహ మనెడియిల్లు దినదినంబును నూడ్చి, యలికిపూసిమెత్తియనువుఁబరచి
కాపువిడిచి పోవుఁ గడపట నీ జీవి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**178** తల్లిదండ్రిహితులుఁ దగినచుట్టము లెల్ల, నేరికోరిపోరు నెగుపుఁ జూచి ।
పడుచు నిత్తు రింతె భాగ్య మీయఁగ లేరు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**179** విశ్వనాథునందు విప్రులయందును, విభునియందు వేదవిధులయందు ।
భక్తిలేనివాఁడు పాపాత్ముఁ డిలలోన, విశ్వదాభిరామ వినురవేమ !॥

**180** సతులమాయఁ దెలిసి సైరింపలేకను, పెద్దకడుపువాఁడు పెండ్లి మానె ।
పుట్టుకాసెఁ గట్టె భువి నాంజనేయుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**181** చదివినతనికన్నఁ జాకలియే మేలు, గృహమువేల్పుకన్న గేదె మేలు ।
సకలసురలకన్న జారభామిని మేలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**182** ఖగములందముఁజూడఁగాముచ్చటగనుండు,దెగలఁగాంచినంతదేటపడదె?
దేవుఁడీని సొగసు దేబె! నీ కేలరా, విశ్వదాభిరామ వినురవేమ !॥

183 ఔరసః ఖలు సత్పుత్రః, కిం వేశ్యోత్థేన సూనునా ।
వేమ! త్వయి మృతే దత్తే, కిం తిలోదక మ ప్యహో! ॥

184 ప్రాణే స్థితే సోపదేశో, భవ పాపిణః కదాచన ।
నశ్యే ద్వేమ! బ్రాహ్మణోఽపి, కిం గ్రసే త్ బడబానలమ్? ॥

185 తమోగృహం దీపికేవ, గుణినీ భావయేత్ గృహమ్ ।
దుర్గుణా కలితం దేహం, వేమాదీప మి వాపభృమ్ ॥

186 కాకనీడే పికీవేమ!, నిధా యాండాని పోషణమ్ ।
కారయేత్ మర్మ జానీత, స్త్రీమాయా జ్ఞాయతే తదా ॥

187 వేమ! శుద్ధాంతరంగ స్సన్, శూద్రా పుత్రోఽపి మర్మవిత్ ।
యది బ్రహ్మపదం వేత్తి, స బ్రాహ్మణ ఇ తీర్యతే ॥

188 త్యక్తవత్యా స్త్రియా స్సంగం, వేమ! త్యక్తు మశక్నువాన్ ।
వోఢా కటం కుటీం యావ, జ్జీవం నైతి మహద్గతిమ్ ॥

---

183 ఔరసుండె నీకు వారసుఁడగుఁ గాని, వేశ్యయందుఁ బుట్టువిధవకొడుకు ।
నీవుపోయినపుడు నీరైన వదలునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

184 ఊపి రున్నయపుడె యుపదేశమందుము, రూపుమాయు నెపుడొ రూఢిగాను ।
బాపఁడైననేమి బడబాగ్ని మ్రింగునా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

185 గుణవతిగలయిల్లు గోము నొందించును, చీకటింట దివ్వె వెలఁగునట్లు ।
దేబెయున్న యిల్లు దివ్వె మల్చిన యట్లె, విశ్వదాభిరామ వినురవేమ! ॥

186 కాకిగూట నాడుకోకిల తనగ్రుడ్లఁ, బెట్టి పెనుపఁజేయు గుట్టెఱుఁగుచు ।
నాడువారిమోన మపుడైనఁ దెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

187 శూద్రయువతికొడుకు శుద్ధాంతరంగుఁడై, వేదవేద్యమైన పాదుఁ దెలిసి ।
బ్రహ్మపదవిఁగన్న బ్రాహ్మణుఁడే కదా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

188 విడుచుదానిపొందు విడువఁజాలనివాఁడు, చచ్చుదనుక మోయుఁజాపగుడిసె ।
భాగవతులపట్టుఁ బడయంగ నోపఁడు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

189 లావణ్యం యోషితో దృష్ట్వా, న ముహ్యేద్వేమ! కారణమ్ ।
గుణ ఏవ హి భామిన్యాః, జారిణీ కిం న సుందరీ? ॥

190 వేమ! స్వదోషబాహుళ్యే, పరదోషాన్ ఖలో జనః ।
గణయేత్ శష్కులీం దృష్ట్వా, యథా హసతి యంత్రికా ॥

191 నిస్సత్త్వ శ్రాంతదేహోఽపి, దుర్విట స్పృజతేఽంగనామ్ ।
నిర్దంతః కుక్కురో వేమ!, కిం పశ్యస్థి నదంశతే ॥

192 య ద్యగ్రేఽన్యోజన స్థిత్వా, న పృచ్ఛేత్ సాధ్వసాధ్వపి ।
సాధ్విత్యేవ వదే ద్వేమ!, యది ప్రిష్టా న తిష్ఠతి ॥

193 వేమాతిథ్యాగతిం దృష్ట్వా, భర్త్సయంతః ఖలాశయాః ।
ఆత్మధర్మం న పశ్యంతి, ధర్మోఽగ్రే ఖలు కర్మణః ॥

194 రండయా వర్తతే యావ, త్తావ న్మోహే నిమజ్జతి ।
అపాస్తే వేమ! తత్సంగే, ఆశా నశ్యంతి తాస్తదా ॥

---

189 వెలఁదిసొంపుఁజూచి విఱ్ఱవీగఁగ రాదు, కలికి కెపుడు గుణమె కారణంబు।
చక్కనైనరూపు జారిణి కుండదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

190 తనకుఁగల్గు పెక్కుతప్పు లటుండఁగా, నొరుల నేరమెంచు నోగెపుడును।
చక్కిలంబుఁ జూచి జంతిక నగినట్లు, విశ్వదాభిరామవినురవేమ ! ॥

191 తనకు నొప్పిపుట్టితనువెంతబడలినఁ, గూళవిటుఁడు యువతిఁగూడఁజూచు।
పండ్లుపడిన కుక్క పసరంబుఁ గఱువదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

192 ఔ ననంగ వచ్చు నైనది కానిది, యన్యుఁ డెదుట నుండి యడుగఁడేని।
నిలిచియడుగువాఁడుఁ గలిగిన నిలువఁడు, విశ్వదాభిరామ వినురవేమ !॥

193 అతిథిరాకఁజూచి యదలించి పడవైచి, కఠినచిత్తులగుచుఁ గానలేరు।
కర్మమునకుముందు ధర్మంబుఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

194 ముండమోహితోడమునుఁగుచుఁ దేలుచు, నుండునపుడె మోహముండుగాని।
అండ బాయు వెనుక నాయాశ లే పోవు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

195 మత్తాః కుర్వంత్యకార్యాణి, మాదకద్రవ్యసేవయా ।
అకార్యకారిణో మర్త్యాః, ప్రవదంత్యధమా ఇతి ॥

196 అనాశ్రయో నరో వేమ !, వ్రజేద్ధార్మికమందిరమ్ ।
స రక్షతి పురా రామో, విభీషణమివాశ్రితమ్ ॥

197 కుక్షౌ మల మథాస్థీని, మాంసం చర్మ పరిచ్ఛదమ్ ।
మలభస్త్ర్యాం కథం వేమ !, మానసం పరిమజ్జతే ॥

198 రక్షేత్కాంతాం సదా భర్తా, మ్రియేద్భార్యావనాక్షమః ।
రక్షావిహీనా యా కాంతా, వేమ ! తత్పుంస్సతిర్వృథా ॥

199 అచ్ఛిత్త్వాశాలతా వేమ !, మగ్నా మోహార్ణవే జడాః ।
వారాణస్యాం వసంతోఽపి, తే ముక్తిం నాప్నువంతి హి ॥

200 పత్రైః పుచ్ఛైశ్చ వస్త్రైశ్చ, లోకస్యాచ్ఛాదనం విధిః ।
కృత్వా తాం వేమ ! మర్యాదాం, మానగుప్త్యై న్యవేదయత్ ॥

---

**195** కైపువస్తువులను గాంక్షించి సేవింప, కానిపనులొనర్చు మే నెఱుంగక ।
అట్టిపూనువారి నధము లటందురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**196** అండలేనిమనుజుఁడతిధార్మికునియిల్లుఁ, జేరవలయుఁ బ్రతుకఁజేయునతఁడు
ఆవిభీషణుఁ దొలి యారామవిభువోలె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**197** కడుపులోనమలము కడమవి యెముకలు, కలదు మాంసమింత కప్పు తోలు ।
మలపుఁదిత్తి మీఁద మన సెట్లు బాఱురా, విశ్వదాభిరామవినురవేమ ! ॥

**198** కాపవలయుమగఁడు కాంత నెల్లప్పుడు, కావలేనివాఁడు చావవలయు ।
కాపులేనిదాని కాపుర మడుగనా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**199** ఆస లనెడి లతలఁ గోసివేయఁగ లేక, మోహజలధిలోన మునుఁగువారు ।
కాశివాసులైన ఁగనఁబోరు మోక్షంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**200** ఈఁకె లంటఁజేసి తోఁక లంటగఁజేసి, కోక లంటఁజేసి లోకమునకు ।
మానరక్షణంబె మర్యాద యని తెల్పె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

201 హృది పశ్య శివం సమ్యక్, గుప్త్యై ఘంటాపథం హి తత్ ।
అక్షమాలా జపం వేమ !, భువి పాటచ్చరీ గతిః ॥

202 "లజ్జా ల"జ్జేతి యోషిద్భిః, నిర్లజ్జ స్సజ్జతే బలీ ।
యది లజ్జాం విజానాతి, వేమ ! స్పృశతి కిం స్త్రియమ్ ?॥

203 రాజస స్త్రీస్త్రిపరో భూత్వా, కథం విద్యా ద్గురోః పరిథామ్ ।
విటలగ్నాంగనా వేమ !, పతిభక్తిం కథం విదేత్ ?॥

204 స్వాత్వికో హార్దికాం పూజాం, యతచిత్తో మహాన్ భువి ।
మనోవిరహితా పూజా, మృత్సమా వేమ ! సంశ్రుణు ॥

205 యత్ర భక్తి శ్శివ స్తత్ర, భక్తిహీనస్థలే త్వఘమ్ ।
భక్తియుక్తో నరో వేమ !, "పరమా"త్మేతి కథ్యతే ॥

206 చిత్తజ్ఞాయా వేమ ! పత్న్యాః, ప్రాంతే పత్యు ర్భవంతి హి।
భక్తిముక్తీ చ భాగ్యం చ, అచిత్తజ్ఞాం సతీం త్యజేత్ ॥

---

**201** వక్షమందు గురుని వర్ణించి చూడరా, రక్షకత్వమునకు రాచబాట ।
అక్షమాలజపమె యవని దొంగలరీతి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**202** "లజ్జలజ్జ"యనుచు లలనల మీఁదికి, లజ్జవిడిచి తిరుగు లావరి యయి ।
లజ్జఁదెలిసెనేని లలనలఁ దాకునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**203** రాజసంబుఁజెందిరమణులపొందాస, పడెడువాఁడుగురుని ప్రాపెఱుఁగునె?।
విటులమఱుగుయువతి విభుభక్తి యెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ!

**204** మది కలిగిన పూజ మదనారి మెచ్చును, మనసు నిల్పినంత మహితుఁడగును।
మనసులేని పూజ మట్టి సమాన మౌ, విశ్వదాభిరామ వినురవేమ !॥

**205** భక్తియున్న చోటఁబరమేశ్వరుఁడు నుండు, భక్తిలేనిచోటఁ బాప ముండు।
భక్తికలుగువాఁడు పరమాత్ముఁ డగునయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**206** భక్తి ముక్తి కల్గు భాగ్యము గల్గును, చిత్త మెఱుఁగు పడఁతి చెంతఁబతికిఁ।
చిత్తమెఱుఁగని సతిఁ జేరంగ నీరాదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

207 నమస్కృతో వేమ ! విప్రః, ఆశీంషి దిశతే భృశమ్ ।
య ద్యాత్మశుద్ధస్తా స్సర్వాః, నోచేత్స్యాత్ కంఠశోషణమ్॥
208 దృష్ట్వైవాహిం క్రూరదంష్ట్రం, త్రసంతే దుష్టవైభవాత్ ।
దాష్ట్యం వేమ ! కథం తిష్ఠేత్, వీతదంష్ట్రఫణాభృతః ॥
209 భవతు బ్రాహ్మణో భక్తో, యోగీ వా చేతరోఽపి వా ।
సర్వేఽప్యేతే తతో వేమ !, హన్యంతే సమవర్తినా ॥
210 అప్రీతా కులటా భూతం, కర్మాప్రీతం శ్రమావహమ్ ।
యత్ర దాతా నాస్తి వేమ !, సా పూః పైశాచవాటికా ॥
211 ఆహూయమానా బహుశః, కులటా భక్తివర్జితా ।
మృత్యో స్స్యా త్సదనం విష్టా, వేమ ! సా గ్రసతే న కిమ్ ? ॥
212 భార్యావాహీ భవ శ్చిత్రం, యది త్వం వహనక్షమః ।
తథైవ తత్సమో వేమ !, భూతిలిప్తతను ర్భవ ॥

---

207 బ్రాహ్మణునకు మ్రొక్క బహుదీవెనలొసంగు, నాత్మశుద్ధికలుఁగు నాతఁడైన।
గలుఁగు నన్ని కామి కంఠశోషయె సుమి, విశ్వదాభిరామ వినురవేమ !॥
208 ఫణికిఁ గోరలుండ భయమొందు నట్టులే వెఱతు రయ్య దుష్టవిభవమునకు।
గోర లూడఁ ద్రాచు మీరునా దుష్టత, విశ్వదాభిరామ వినురవేమ !॥
209 బాపఁడైననేమి భక్తుఁడైనను నేమి?, యతియునైన నన్యుఁడైన నేమి? ।
ఇన్నియైన వెన్క నినజుండు పనిఁ దీర్చు, విశ్వదాభిరామ వినురవేమ !॥
210 ప్రీతిలేనిలంజ భూతంబె యౌఁ జుమీ, ప్రీతిలేని పాటు చేతచేటు ।
దాతలేనియూరు దయ్యాలపేటయా, విశ్వదాభిరామ వినురవేమ !॥
211 బత్తిలేనిలంజ పలుమారుబిలిచిన, బత్తి కాదు లయిపుమిత్తి కాని ।
మిత్తిచొరఁగనిల్లు మ్రింగకపోవునా, విశ్వదాభిరామ వినురవేమ !॥
212 భవుఁడు చిత్రముగను భార్యలమోయును, అట్టుమోయఁగలుఁగు దిట్టయైన।
నతనివలెనె బూది యలఁదిన మెఱుఁ గగు, విశ్వదాభిరామ వినురవేమ !॥

213 కిం మృత్తికోత్క్షేపణేన, ధాన్యోత్క్షేపణతః ఫలమ్ ।
సతః కిం వేమ! లోపై స్స్యాత్, పరిగ్రాహ్యా హి తద్గుణాః ॥

214 దృష్ట్వా విటాన్ వంచయిత్వా, గవాక్షస్థా నితంబినీ ।
విలాసాన్ కురుతే వేమ!,మాయాఽజ్ఞేయా హి యోషితామ్॥

215 వే మాకాం క్ష్యేంద్రపదవీం, యజ్ఞై రిష్ట్వా మహాధనైః ।
కామిన స్స్యు ర్జనా నూన, మక్షమా యోగధారణే ॥

216 కల్యం భుక్త్వా నిమీల్యాక్షీ, రుద్ధకాయోఽల్పసంయమీ ।
ఆశ్రిత్య మేషగాంభీర్యం, ప్రశంసాం వేమ! వాంఛతి ॥

217 వేమ! ప్రాప్త మివాభాతి, న లభ్యతి యథా తథమ్ ।
పున ర్లబ్ధిః పున ర్నష్టిః, యథాప్రాప్తం దిశే చ్ఛివః ॥

218 గిరయో రాశయ శ్చంద్ర, కళా శ్చందనచర్చికాః ।
దురాశా వేమ! వైశ్యస్య, ఆశాఽనంతా న తద్గతిః ॥

---

213 మన్నుపారబెట్ట మనకేమిలాభంబు, ధాన్య మట్లుఁజేయఁ దగునుకాని ।
ఘనులలోప మెన్నఁగా రాదు విడువుము, విశ్వదాభిరామ వినురవేమ !॥

214 విటులఁ జూడఁగానె మటుమాయఁ జేసియు, కిటికియందుఁజేరి కేకరించు,
పటిమమీఱ స్త్రీల పరికింప లేరయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

215 ఇంద్రపదవిఁగోరి యింపుగా యజ్ఞముల్, కలిమిచేతఁజేసి కాములైరి ।
పరమయోగమూని పట్టంగ లేమిని, విశ్వదాభిరామ వినురవేమ !॥

216 కల్య మారగించి కన్నులు ముకుళించి, బిఱ్ఱబిగిసియుండు బీదయోగి ।
మేఁకపోతువలెను మెరమెచ్చులకె యగు, విశ్వదాభిరామ వినురవేమ !॥

217 కలిగినట్టులుండుఁగలుగకయుండును, మఱియులేకయుండుమఱియుగల్గు।
నాశకాలఁదిని శివుఁ డందించుచుండును, విశ్వదాభిరామ వినురవేమ!॥

218 కోమటికి దురాశ కొండలు వాములు, చందనంపు సానలుఁ జంద్రకళలు ।
ఆశకు మితిలే దిఁ కక్కడ గతి లేదు, విశ్వదాభిరామ వినురవేమ !॥

219 స్వకర్మణా స్వయం లోకే, మాతృగర్భేది తో నరః ।
ఆత్మానం వేమ ! విస్మృత్య, దేహాత్మత్వేన నశ్యతి॥

220 త్యక్త్వా జన్మాన్యజన్మాని, దదతోః కర్మధర్మయోః ।
కిం స్యా ద్గణనయా వేమ !, తాభ్యాం ముక్తిః కథం భవేత్ ॥

221 సత్యవాదీ నిర్మల స్స్యాత్, సత్యవాదీ హి నీతిమాన్ ।
అసత్యవాదీ యో వేమ !, నీచచండాల ఏవ సః ॥

222 నాధమో మద్యపాయీ స్యాత్, అధమోఽనృతభాషకః ।
మద్యపానా న్మహాహాని, స్స్యా ద్వేమానృతభాషణాత్ ॥

223 క్షుత్తృడ్భ్యాం వ్యాకులో బాలః, స్వన్యార్థీ యది రోదితి ।
త్యక్త్వా కర్మాణి వేమాంబా, లాలయం త్యాశు చుంబతి ॥

224 సమ్మిశ్రి మంబు క్షీరేణ, క్షీరరూపేణ రాజతే ।
సద్గురో శ్చ తథా విద్వాన్, వే మైవం సాధు సంగతిః ॥

---

**219** తనదుకర్మచేతఁ దానులోకములోనఁ, దనదుతల్లి గర్భమునను బుట్టి ।
తన్ను మఱచి తాను తనువనిచెడునయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**220** జన్మవదలి వేఱు జన్మంబు లెత్తఁగఁ, గర్మధర్మములకు గణన కలదె? ।
కర్మధర్మములను గడతేరవచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**221** నిజములాడునతఁడునిర్మలుఁడైయుండు,నిజములాడునతఁడు నీతిపరుఁడు ।
నిజముఁబల్కకున్న నీచచండాలుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**222** కల్లుత్రాగువానిఁ గల్లుత్రము చ్చనరాదు, కల్లలాడువాఁడె కల్లుత్రుచ్చు ।
కల్లుత్రాగుకంటెఁ గల్లలాడుట కీడు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**223** పాలప్రియముచేతఁ బరఁగనేడ్చెడి బిడ్డ, క్షుత్తుపవ్వుల కిల శోకపడఁగఁ।
వల్లిపనులమాని తనయుని ముద్దాడు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**224** పాలఁగలియునీరు పాలెయై రాజిల్లు, గొప్పగురునివలన గోవిదుఁ డగు ।
సాధుసజ్జనముల సంగతు లిట్లుండు, విశ్వదాభిరామవినురవేమ !॥

225 పక్షిజాతిం గృహీత్వాశు, హింసయిత్వా చ నిర్దయమ్ ।
నిబధ్య పంజరే వేమ!, న్యసతాం తద్గతి ర్భవేత్ ॥

226 ఉత్కృష్టమానుషం జన్మ, ప్రాప్తాః పూర్వజను ర్వ్యథాః ।
అజానన్ వేమ! పతతే, హానిం వృద్ధిం న పశ్యతి ॥

227 మహాత్మానోఽపి విభ్రాంత్వా, హృత్ స్థకామవశంగతాః ।
కి మర్థం యువతీం వేమ!, పశ్యంతి భ్రాంతవృత్తయః ॥

228 యువోక్తిభి స్తపంతే కిం, విసృజ్య ఖలచేష్టితమ్ ।
గురుం ప్రణమ్య పదయోః, వేమాశా మాశు సంత్యజ ॥

229 వచస్సతం వేమ! వాచ్యం, నైకం లేఖ్యం మనాగపి ।
సాక్ష్యం న యుక్తం లేఖాయాః, అసల్లేఖా తు హానయే ॥

230 ఆత్మానాత్మగతిం వేమ!, బోధయిత్వా తతో గురుః ।
స్వస్వరూపం దర్శయతే, భ్రమర స్తు క్రిమే రివ ॥

---

225 పక్షిజాతిఁబట్టి పరఁగ హింసలఁ బెట్టి, గూఁడ్లకట్టియుంచు గుదురఁ బెట్టి ।
ఉంచువారి కట్టి వంచన రాదొకో, విశ్వదాభిరామ వినురవేమ !॥

226 పరఁగ నింత దనుకఁబడినపాటెఱుఁగఁడో,మనతనొప్పమనుజుఁడనఁగఁబుట్టి ।
కీడుమే లెఱుఁగక క్రిందగుఁ జిత్రంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

227 పడుచు నూర కేల పారఁజూచెద రొక్కొ!, ఎంతవారలైన భ్రాంతిఁ జెంది।
లోన మీఱు కాము లొంగఁ దీయఁగ లేరు, విశ్వదాభిరామ వినురవేమ!॥

228 పడుచుమాటలాడి పరితపింపఁగనేల?, వెడఁగు చర్య లణఁచి వేడి గురుని।
అడుగు లంటి మ్రొక్కి యాసవిడఁద్రొక్కు, విశ్వదాభిరామ వినురవేమ!॥

229 నూఱుఁ బలుకవచ్చు నొకటి వ్రాయఁగరాదు, వ్రాతకన్న సాక్షి వలవ దన్న।
పరఁగ లేనివ్రాత భంగపాటును దెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ !॥

230 దేహ మాత్మరూపుఁ దేటతెల్లముఁజేసి, అవనిజూపుఁజూపు నతఁడె గురువు ।
భ్రమరము తనరూపుఁ గ్రిముల కిచ్చెడురీతి, విశ్వదాభిరామ వినురవేమ !॥

231 బహుధా దాసతా వాచ్యాః, లింగవాన్ వేమ! జంగమః।
న వాచ్యో బ్రాహ్మణ ఇతి, తథా దశసహస్రశః ॥

232 పూర్ణాత్మహీనా పైశాచీ, వాగనీతి శ్శిలాక్షతిః ।
కులటా ప్రీతిశూన్యా చ, వేమ! స్యాత్ప్రేతవాహనమ్ ॥

233 దర్శనేషు మతే ష్వేవ, వేమ! వర్ణాశ్రమేషు చ ।
నిత్యసక్తో య శ్చరతే, స స్యా దజ్ఞానవాన్ భువి ॥

234 ప్రాహు ర్దశావతో బంధూన్, మన్యు ర్న్యూనం చ నిర్దశమ్।
దశా నామ భవే ద్వేమ!, ఏకా ధనదశా భువి ॥

235 దక్షో నూనం సమీపస్థః, ప్రోథో దూరస్థలస్థితః ।
అనుసృత్య చరంతే యే, సిద్ధ్యంతే వేమ! తత్క్రియాః ॥

236 ఆర్జయంతి ధనం వేమ!, మాతాపుత్రవిరోధకృత్ ।
మత్వా సుఖకరం కిం తు, ధనం దుఃఖకరం భృశమ్ ॥

---

231 దాస రనఁగవచ్చు వేస్తొల్లకైనను, జంగ మనఁగవచ్చు లింగ మున్న ।
బాపఁ డనఁగరాదు పదివేలకైనను, విశ్వదాభిరామ వినురవేమ !॥

232 దాతలేనియూరు దయ్యాలపెనువాడ, నీతిలేనిమాట రాతివ్రేటు ।
ప్రీతిలేనిలంజ ప్రేతవాహనముయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

233 దర్శనములయందు ధరషణ్మతములందు, వర్ణమాశ్రమములవదలకెపుడు।
తిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని, విశ్వదాభిరామవినురవేమ ! ॥

234 దశగలారినెల్ల తమబంధువు ల టండ్రు, దశయులేమి నెంత్రుతక్కువుగను।
దశయనంగనుఘనదశ యొక్కటే సుమీ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

235 దరినియున్నవాఁడు తప్పక దక్షుఁడు, ఎడమపడినవాఁడు దుడుకు గడుసు ।
అనుసరించువారి కయ్యెడుఁ గార్యముల్, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

236 తల్లి బిడ్డలకును పగవుఁబుట్టించెడి, ఘనము సుఖముఁగూర్చుననిగడింత్రు।
కాని యెల్లయెడల ఘనదుఃఖకర మది, విశ్వదాభిరామ వినురవేమ! ॥

237 ఆద్యౌ గురూ స్తః పితరౌ, శివౌ తు పరమౌ గురూ।
ద్రోహో! విత్తార్థినం వేమ!, గురు రిత్యభిభాషణమ్॥

238 దాస్యా రక్త్యాఖ్యయా బద్ధః, తతో నిష్క్రమణాక్షమః।
నరః పరివర్తతే వేమ!, తస్య ముక్తిః కుతో వద॥

239 వితర్క్య మనసా మన్యేత్, సర్వం జ్యౌతిషకల్పితమ్।
ఇతి మన్యే న్నిజాదృష్టం, కియ ద్దైవం న వేత్తి కిమ్?॥

240 లోకోఽనేకే బుధా వేమ!, టీకాఃకృత ఇ వాబ్రువన్।
ఏక మే వేతి తన్మర్మ, కాకాభా నవిదు ర్జనాః॥

241 తేజో యాతి ఘనం జ్ఞానీ, సుఖమేతి న జాయతే।
ఆత్మ్నై వాత్మా తథా ప్యాహో!, వేమాత్మని విరాజతే॥

242 జ్ఞానినం వేమ! కర్మిష్ఠాః, ప్రకృతిం త్యక్తు మక్షమాః।
ప్రాహు రున్మాదినం తేన, అదృష్టా ప్రకృతిః కుతః॥

---

**237** తల్లిదండ్రులెన్నఁదగు తొలిగురువులు, పార్వతీభవు లిలఁ బరమగురులు।
కూలివాండ్ర జగతి గురు లన ద్రోహంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**238** తనదురక్తి యనెడి దాసిచేతను జిక్కి, మిగిలి వెడలలేక మిఱుకుచున్న।
నరుని కేడ ముక్తి వరలెడుఁ జెప్పుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ!॥

**239** తనదుమనసుచేతఁ దర్కించి జ్యౌతిష, మెంతచేసె ననుచు నెంచి చూచు।
తనయదృష్ట మెంతొ దైవ మెఱుంగఁడా, విశ్వదాభిరామ వినురవేమ!॥

**240** టీకవ్రాసిన ట్లనేకులు పెద్దలు, లోకమంత చెప్పి రేకమనుచుఁ।
గాకులట్టిజనులు కానరీమర్మమ్ము, విశ్వదాభిరామ వినురవేమ!॥

**241** జ్ఞానియైనవాఁడు ఘనతేజమందును, పూని సుఖముఁ జెందుఁబుట్టఁబోఁడు।
తానె తా నటయ్యుఁ దనలోనె వెల్గును, విశ్వదాభిరామ వినురవేమ!॥

**242** జ్ఞానవంతుని కడు కర్మసంబద్ధులు, వెఱ్ఱియండ్రు ప్రకృతి విడువలేక।
వెఱ్ఱికసని ప్రకృతి వెదకినఁ గల్గునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

243 జని ర్మృతి స్స్వప్న సుప్తీ, జగంతి చ భవంతి హి ।
మృగతృష్ణేవ తత్సంగః, వేమ! హాస్యాయ న ర్భవేత్ ॥

244 ఛాయా మివ తరో ర్బోధం, సాధు ర్దత్తే తదంతికమ్ ।
గత్వా లభ్యో వేమ! నోచేత్, తద్గతం నాగతం త్విదమ్ ॥

245 జ్ఞాత్వా భక్త్యా ఛాత్రధర్మం, గురుసేవా రతో యదా ।
తదైవ సర్వమర్మాణి, జాయంతే వేమ! నిత్యశః॥

246 నియమ్య దుర్గుణాన్ సర్వాన్, యో వేమ! పరమం పదమ్ ।
సమ్య గ్దర్శయతే ప్రాస్య, తం గురుం ముక్తి మాప్నుహి ॥

247 గురుం వినా కథం మర్మ, వే త్త్యాజః తత్త్వితాపి చ ।
వినా కుంచికయా వేమ!, కవాటవివృతిః కథమ్? ॥

248 న కాగుణితబోధేన, న శాస్త్రాధ్యాపనేన చ ।
భవంతి గురవో వేమ!, ముక్తిదర్శీ గురు ర్మహాన్ ॥

---

243 జననమరణములును స్వప్నసుషుప్తులు, జగము లుండు నెండజలములవలె ।
నరుఁడు జగము నంట నగుబాటు కాదొకో, విశ్వదాభిరామ వినురవేమ !॥

244 ఛాయనొసఁగుచెట్టు సాధువుబోధట్టు లడఁగి దరినిజేరి పడయ వచ్చు ।
నట్టు నిట్టు దాట నదిపోవు నిదిరాదు, విశ్వదాభిరామ వినురవేమ !॥

245 ఛాత్రధర్మ మెఱిఁగి చక్కని భక్తితో, గురునిసేవఁజేయఁ గుదిరి నపుడె ।
సర్వమర్మములును జక్కఁగా విడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

246 చెడుగుణంబు లెల్లఁ జెపట్టి శిక్షించి, పరమపదవి సిద్ధపడఁగఁ జూపు ।
నట్టి గురుని వేడి యపరోక్ష మందుము, విశ్వదాభిరామవినురవేమ ! ॥

247 గురునిశిక్షలేక గుఱు తెట్లు కల్గునో, అజునికైన వానియబ్బ కైన ।
తాళపుచెవిలేక తలుపెట్టు లూడును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

248 కారు కారు గురులు కాగుణింతముఁ జెప్ప, శాస్త్రపాఠములను జదివి చెప్ప ।
ముక్తిదారిఁజూపు మూలమె గురుఁ డగు, విశ్వదాభిరామ వినురవేమ!॥

249 ఆర్యా వేదానధీత్యాపి, దర్పితా అధమాం గతిమ్ ।
ప్రాపు ర్వేమ! మహద్బ్రహ్మ, వేత్తు ర్జీవన ముత్తమమ్ ॥

250 విమలాం దృష్టి మాలంబ్య, యది న జ్ఞానమాప్నుతే ।
తమో నాపైతి తత్త్వజ్ఞో, వేమాపా స్తతమా భువి ॥

251 త్రిషు పూర్వోత్తరగతిం, చానభిజ్ఞా నరా స్తతః ।
నరకం యాంతి వేమైభ్యః, త్రిభ్య స్త్వేకః పరః పుమాన్ ॥

252 పత్న్యా మాశా భవే త్పత్యుః, పత్యౌ పత్న్యాశ్చ సా తథా ।
సదాశివే భవే దాశా, వేమ! సిద్ధస్య సర్వదా ॥

253 నవనీతం ఘృతం తప్త్వా, ఛాయాయా యది న్యస్యతి ।
దధీవ ఘనతా మేతి, వేమైవం స్థాపయే న్మనః ॥

254 ఏకోపాయం శివం వేత్తుం, భూజనానాం వదా మ్యహమ్ ।
అచంచలం మనః కృత్వా, మహిమ్నా వేమ! పశ్యత ॥

---

249 వేదముల్ సదివియు విఱ్ఱవీగుటె కాని, యధమగతిని బడిరి యయ్యలెల్ల ।
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రతికిన బ్రతుకయా, విశ్వదాభిరామవినురవేమ ! ॥

250 విమలదృష్టిఁబూని విజ్ఞాన మందమి, తమముఁబాయ నగునె? తథ్యముగను ।
చమము మీరి నంతఁ దత్త్వజ్ఞుఁ డగునయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

251 ముగురిలోనవెన్క ముందుఁ గానఁగలేక, నరకమునకుఁ బోవు నరులుకలరు ।
ముగుర కందనట్టి మూలమూర్తి యొకండె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

252 భార్యమీఁద నాశ పరఁగు బురుషునకు, మగనిమీఁద నాశ మగువకుండు ।
శివునిమీఁదనాశ సిద్ధున కుండురా, విశ్వదాభిరాపు వినురవేమ ! ॥

253 నేయి వెన్నఁ గాచి నీడనే యుంచిన, పేరి గట్టిపడును పెరుగు రీతి ।
పోరి పోరి మదిని బోనీక పట్టుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

254 ధాత్రిజనులకెల్లఁ దగ నెఱిఁగించెద,నొనర హరుని నెఱుఁగు నుపమయొకటి ।
మనసుఁజెదరనీక మహిమతోఁ జూచుటే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

255 రజ్జౌ సర్పమతిం కృత్వా, భయమేతి తతో నరః ।
రజ్జుం జ్ఞాత్వా త్యజే ద్భీతిం, వేమ! బ్రహ్మైతి నిర్భయః॥
256 జననే మరణే వేమ!, న స్వాతంత్ర్యం పురా నృణా ।
నానీతం న తతో నీతం, మధ్యే హాస్యాయ కర్తృతా ॥
257 వేమ! జాతిమతై ర్బద్ధా, శ్చాలసా భావసంగ్రహే ।
జాయంతే చ మ్రియంతే చ, మానవా జడబుద్ధయః ॥
258 అజానతో మహద్దూరం, మార్గం స్యాద్ధి తథాస్థలమ్ ।
న దృశ్యతే వేమ! దుర్గ, శిఖరే నిక్షిపే ద్దృశమ్ ॥
259 బాల్య ఏవ భ్రమాన్ సర్వాన్, యది వేమ! న ముంచతి ।
శుభం నాప్నోతి మర్మజ్ఞః, మావ్యధిష్ఠ భృశం హృది ॥
260 బాల్యే నాస్తి ప్రభో ర్భక్తిః, శివదృష్టి ర్న యౌవనే ।
వార్ధకేపి నరా వేమ!, కథం వర్ణయితుం క్షమాః?॥

---

255 త్రాడుఁబాముటంచుఁ దాఁజూచిభయపడుఁ,దెలిసిత్రాడటన్నఁదీరు భయము,
భయముఁదీరి నపుడె బ్రహ్మంబు తా నగు, విశ్వదాభిరామ వినురవేమ !॥
256 జననమరణవేళ స్వాతంత్ర్య మున్నదే?, తేనులేదు మున్ను పోనులేదు ।
నడుమఁగర్తననుట నగుబాటు కాదొకో, విశ్వదాభిరామ వినురవేమ !॥
257 జాతిమతము లందు జనులెల్ల బద్ధులై, భావపరమునందుఁ బ్రాలుమాలి ।
చచ్చిపుట్టుచుంద్రు జడమతులై భువి, విశ్వదాభిరామ వినురవేమ !॥
258 బాటతెలియకున్న బహుదూరమైతోఁచుఁ, జోటుతెలియకున్నఁ జూపానరదు ।
కోటకొమ్ముమీఁదఁ గుదురుగాఁ జూడుము, విశ్వదాభిరామ వినురవేమ !॥
259 బాలప్రాయమందె భ్రమల నడంపక, మేలుపొంద రెపుడు మేదినందుఁ ।
గీలుఁ దెలిసి మదిని గీడ్పడ కుండుము, విశ్వదాభిరామ వినురవేమ !॥
260 బాల్యమందు స్వామి భక్తిలే కుందురు, యౌవనమున హరుని తేవఁ గనరు ।
వార్ధకంబునందు వర్ణింపలే కుంద్రు, విశ్వదాభిరామ వినురవేమ !॥

261 "బ్రహ్మజ్ఞా వయ" మిత్యాహుః, వేమ! ప్రజ్ఞా శ్చ భూసురాః ।
కిం బ్రహ్మ? క శ్చ తద్భావః, కో వర్ణో బ్రూహి వేత్థ చేత్ ॥

262 బ్రాహ్మణా బ్రహ్మసంజాతా, ఇతి వే మాభిభాషణాత్ ।
ప్రతిష్ఠా బ్రహ్మణో నష్టః, బ్రహ్మవేత్తా హి బ్రాహ్మణః ॥

263 వ్యోమ శూన్యం వేమ! తస్మి, న్నబ్దో౽జని తదంత రే।
తద్బ్రహ్మశబ్దరహితం, రాజతే సమ్య గీక్షితే ॥

264 దారేషు పత్యౌ పుత్రేచ, సర్వే ష్వాత్మా విరాజతే ।
సమ్య గ్వేమ! ప్రవర్తేత, నానారూపైః పృథక్ పృథక్ ॥

265 అగోచరం దృశాం పాప, దూరం తం వేమ! చేతసి ।
న్యస్య యో న భజే న్ముక్తిః, చింతాళో స్తస్య నాస్తి హి ॥

266 దేహినః పాశయోగేన, హాని స్సంభవతే ఖలు ।
కళయా జ్ఞానదీపస్య, తాం జ్ఞాత్వా వేమ! వారయేత్ ॥

---

**261** బ్రహ్మవేత్తలమని పగ్గెలాడుచు సుంద్రు, బ్రహ్మమేమొ దానిభావ మేమొ ।
తెలుపా! నలుపా! యెఱుపా! తెలిసినఁబల్కుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**262** బ్రహ్మపరువుఁజెడును బ్రాహ్మణులాదొడ్డ, బ్రహ్మవలనఁబుట్టి పరఁగిరనఁగ।
బ్రహ్మవేత్తయగును బ్రాహ్మణుఁడే యైన, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**263** ఆకసంబు శూన్య మందు శబ్దము పుట్టె, శబ్దమధ్యముననె నరగఁ జూడ ।
శబ్దరహిత మగుచుఁ జెలఁగును బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**264** ఆలుమగఁడుసుతుఁడునందఱిలోనాత్మ, మేలుగానెయుండిమెఱయుచుండు।
వేఱువేఱు గాను వెలయు రూపంబులై, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**265** కనులఁజూడఁబడని కలుషవిదూరుని, మనమునందుఁజేర్చి మరులుఁ గొనక
తనకు ముక్తిలేదు తలఁపులు మెండైన, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**266** పాశములనుగూడ ఁ బరఁగ దేహమునకు, హానివచ్చుఁగాన నదియుఁ దెలిసి।
జ్ఞానదీపకళికఁ గడకొత్తవలె నవి, విశ్వదాభిరామ వినురవేమ! ॥

267 దేహీ దేవో దేహమూలే, ఇతి జానంతి యే బుధాః ।
తీర్థయాత్రాం న తే యాంతి, ఆత్మారామా హి వేమ ! తే ॥

268 దూరస్థో దూరచింతానాం, తనౌ దూరే విషజ్జతే ।
దైవం దూరస్థితే జీవే, వేమ ! దేవో విరాజతే ॥

269 జ్ఞాననిష్ఠాపరో వేమ !, యస్తు విస్మరతే తనుమ్ ।
న కామీ స తు మోక్షార్థీ, అనిష్ఠో నిర్గుణం భజ ॥

270 లోకే నాస్తి జలే నాస్తి, వేదవేద్యం నిజం పదమ్ ।
సగుణం నిర్గుణం వేమ !, సాధయిత్వా స్వయం విద ॥

271 అధీత్య సర్వవిద్యాశ్చ, స్వానభిజ్ఞో వివేక్యపి ।
మూఢో విద్యాసు నిర్విణ్ణః, వేమోన్మత్తో వినశ్యతి ॥

272 దైవతాన్యాలయానీతి, చిహ్నం కుర్వంతి వేమ ! యే ।
తద్విప్రనిందయాలం తైః, మూర్ఖాణాం దర్శితా గతిః ॥

---

267 దేహమూలమందు దేహిదేవుఁడటంచుఁ, దెలిసియున్న బుధులు తీర్థయాత్ర ।
లరయఁబోరు జగతి నాత్మ తామై యుండ్రి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

268 దూరయోచనలకు దూరమౌ దైవముఁ, దనువుదూరమైనఁ దగులు నపుడె ।
జీవిఁదవ్వఁజేయ దేవుఁడై నిలుచును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

269 జ్ఞాననిష్ఠఁబూని మేను మఱచువాఁడు, కామికాఁడు మోక్షకామికాని ।
నేమనిష్ఠ లుడిగి నిర్గుణ మందుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

270 జగమునందులేదు జలములందును లేదు, నిగమవేద్యమైన నిజపదంబు ।
సగుణనిర్గుణముల సాధించి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

271 చదువులన్నిచదివి చాల వివేకియై, మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు ।
విసుగుచదువటంచు వెఱ్ఱియై చెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

272 "గుడులు, దేవత"లని గుర్తులు గావింత్రు, ముష్టిబాప లనుచు మూర్ఖ నేల?
మెప్పులకునుదారి మురియంగఁ జూపిరి, విశ్వదాభిరామ వినురవేమ! ॥

273 మనోహ్యాప్తం గతా చింతా, ప్రాప్తాయా మేవ యోషితి ।
శివే భక్త్యా జగత్సాక్షౌ, న చింతా వేమ! జాత్వపి ॥

274 యది సార్థకతా నాస్తి, సమాభి ర్మహిమాషీరవైః ।
వాగ్భిః కిం వేమ! మన్యంతే, తా నున్మత్తాన్ జనా భువి ॥

275 కృత్వా ప్రగల్భాన్విస్మృత్య, మూలం త్ర్యక్షోఽపిసాంగనామ్
న వశీ కురుతే వేమ!, "అమా"యేతి న విశ్వసేత్ ॥

276 ఖడ్గం చ ఫలకం వేమ!, కరాభ్యాం ధారయ న్నపి ।
న శూర స్స్యా దప్రతిభో, కిం పుమాన్ వీధిగాంఽగనా ॥

277 హరిభ క్త్యాన్నదానేన, లోకేఽస్మిన్ సకలేఽపి చ ।
స్యా ద్గుంటుపల్లి ముత్తాఖ్యో, గుణవాన్ వేమ! సర్వశః ॥

278 న దరిద్రాయ దాస్యంతి, ధనం వేమ! ప్రభో రివ ।
న సత్యై గణికా యై వత్,న సుధాయై సురాసమమ్ ॥

---

273 కాంతపైనప్రేమ స్వాంతము రంజించుఁ, జింతతీరు తరుణి చిక్కి నపుడె ।
శివునియందు భక్తి, చింత యమరఁబోదు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

274 బక్షి లట్టు లరవ ఫలమేమి కలదయా, అందు సార్థకంబుఁ జెందకున్న ।
విన్నవారు వారి వెఱ్ఱులుగా నెంత్రు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

275 ఫాలనేత్రుఁడైన వంపంగ లేఁడయా, అలిమిరఁబెట్టి యాది మఱువ ।
గోలయనుచు నమ్మఁగూడదు వెఱ్ఱియై, విశ్వదాభిరామ వినురవేమ! ॥

276 ఫలక మెడమచేతఁ బట్టి ఖడ్గం బూన, బంటుతనమురాదు ప్రతిభలేమి ।
వీధిలోనఁ దిరుగ వెలఁది పురుషుఁ డౌనె, విశ్వదాభిరామ వినురవేమ! ॥

277 ప్రాకటముగ నింత లోకమందున గుంటి,పల్లెముత్తఁడెన్నఁబరమగుణుఁడు।
అన్నదానమునను హరిభక్తిచేతను, విశ్వదాభిరామ వినురవేమ! ॥

278 ప్రభులకిచ్చునట్లు రహి పేదలకునీరు, వేశ్య కిచ్చునట్లు వెలఁదికీరు, ।
సురకు నిచ్చునట్లు సుధకును నీయరు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

279 దానశీలో మహాన్ దాతా, నిందకః కీటకోపమః ।
యః స్వానర్థకరో వేమ !, స ప్రతిష్ఠాం న విందతి ॥

280 కృత్వా కృత్వా సదా పూజాం, భవే ద్వేమార్చకస్స్వయమ్ ।
పూజ్యవస్తు స్వయం సర్వం, స్వయం క్వ కురుతేఽర్చనామ్ ॥

281 పుంసో భాగ్యేన లభతే, పుణ్యాస్త్రీ యోషిత స్తథా ।
ఉభయో రపి భాగ్యేన, వేమ ! పుత్రా స్తథా హితాః ॥

282 పురారే ర్నయనాన్ముక్తి, గూర్ణనాభే ర్బభూవ హి ।
వయనేన కియ న్మాత్రం, స్వభక్తి ర్వేమ ! కారణమ్ ॥

283 పుమాన్ పుత్రవిహీన స్తు, పుణ్యాలోకం కథం భవేత్ ?।
వేమ ! పుత్రవిహీనస్య, కథం పుణ్యం ప్రవర్తతే ? ॥

284 నరః పుత్రార్థినో వేమ ! చింతంతే పరమాశయా ।
పుత్రే సంజాతమాత్రే కిం, కుల ముద్ధరతే స్వయమ్ ?॥

---

279 పెట్టిపోయువాఁడు కట్టడిగలదాత, తిట్టిపోయువాఁడు తుట్టె పురుగు ।
రట్టుసేయువాఁడు రాణింపునకు రాఁడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

280 పూజఁజేయఁజేయఁ బూజారి తా నౌను, పూజ్యవస్తు వెన్న భువిని తానె ।
ఏడఁ బూజఁ జేయు నెల్ల దిక్కులుఁ దానె, విశ్వదాభిరామ వినురవేమ !॥

281 పురుషుభాగ్యముననె పుణ్యవతి దొరకుఁ, బుణ్యవతికి నట్లె పుట్టుసుఖము।
నిరువు రనుభవింప హితులగు పుత్రులు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

282 పురహరునకు నేతఁ బురువు తా నేసిన, స్థిరము గల్గు జ్ఞానజీవ మయ్యె ।
నేతకేమివచ్చె నిజభక్తిహేతువు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

283 పుత్రసంతులేక పురుషుండు జగతిలోఁ,బుణ్యలోక మెట్లు పొందఁ గలఁడు?।
పుత్రహీనునకును పుణ్యంబు కల దెట్లు?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

284 పుడమిలోన నరులు పుత్రులఁ గనఁ గోరి, యడలుచుందు రనుపమాశచేతఁ।
గొడుకుఁగలిగి నంతఁ గుల ముద్ధరించునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

285 పూజా ముఖస్థదారస్య, నోచితోరస్థయోషితః ।
రమ్యోహో వేమ! మూర్ధస్థ,దారభక్తిః ఫలప్రదా ॥
286 నిహంతి బాలకస్వేచ్ఛా, గౌరవం వేమ! యోషితామ్ ।
స్వేచ్ఛా తు తనుతే దుఃఖం, పుంసస్స్వేచ్ఛా విభూతిదా ॥
287 యదా చరం తీంద్రియాణి, పంచభూతేషు సర్వథా ।
తదా జగ ద్భవే ద్వేమ!, నోచేద్భాతి జగ త్కథమ్ ?॥
288 అతీత్య నియమం వేమ!, ఫాలదుర్గం ప్రవిశ్య చ ।
నిర్భయో బ్రహ్మవి త్తిష్ఠేత్, జయీ ముక్తిఫలం లభేత్ ॥
289 తారయే ద్ధి కృతం దానం, విస్రబ్ధం వంచతే మనః ।
విశ్వస్త జ్ఞానకళికా, వేమ! హంతి విరోధినః ॥
290 వేమ! తథ్యం పూర్ణతత్త్వం, మిత్రం మిథ్యావిమర్శినః ।
సత్యం నిత్యం చ యత్కర్మ, తత్సాక్షీ బ్రహ్మ కేవలమ్ ॥

285 పుక్కిటిసతివాని పూజింప దోషంబు, ఉరమునువతివాని యూహ లెస్స ।
నెత్తియువిదవాని బత్తియే వర మిచ్చు, విశ్వదాభిరామ వినురవేమ !॥
286 పిన్నవాండ్రస్వేచ్ఛ మన్నన( జెఱచును, అడువారిస్వేచ్ఛ గౌ డొనప్ప ।
పురుషవరునిస్వేచ్ఛ భూతిని గూర్చును, విశ్వదాభిరామ వినురవేమ!॥
287 పంచభూతములనుబర(గనింద్రియములు,సంచరించినపుడెజగము(గలుగు
సంచరింపకున్న జగమెట్టు కలుగునురా, విశ్వదాభిరామ వినురవేమ !॥
288 నియతవృత్తిమీఱి నిటలదుర్గము(జేరి, భయముఖలేకయుండు బ్రహ్మవేత్త ।
జయము(గలుగ ముక్తి(జవి(జూచుచుండును, విశ్వదాభిరామ వినురవేమ!॥
289 దాన మమర(జేయ( దరి(జేర్చు నయ్యది, మనమునమ్మనేనిమాయముంచు।
జ్ఞానకళికనమ్మ( జంపును వైరుల, విశ్వదాభిరామ వినురవేమ !॥
290 తథ్యమైన పూర్ణతత్త్వము సిలోన, మిథ్యనరయ(గానె మిత్రమగును ।
సత్యనిత్యకర్మసాక్షి బ్రహ్మం బయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

291 ప్రతిష్ఠాప్య ధ్వజం బ్రూహి, వే మైకో దేవ ఏవ సః ।
తత్త్వతోంతర్గత స్తిష్ఠేత్, పశ్యంతం తోషయే త్సదా ॥

292 జీవఃకోవేతి కిం వేమ !, విమర్శం తే నభోఽనిలమ్ ।
వహ్నిం సంగత్య "దే"హీతి, భాషతే దేహభా గిహ ॥

293 జీవో జీవగుణోపేతో, బ్రహ్మసామ్యం కథం లభేత్ ।
గ్రామసింహ శ్చ సింహ శ్చ, కథం వేమ ! సమా భువి ॥

294 న వాంఛంతి పరం మూఢాః, యేతేషాం న స్థిరా మతిః ।
తదశక్యపరాపేక్షా, జుగుప్సా వేమ ! కేవలమ్ ॥

295 యథ ద్యార్ద్రితా వేమ ! మూలే, హరిత స్స్యా త్సదా తరుః।
దానా గ్గృహేవనే జారా, స్మృతౌ స్యా ద్ధరి రంతికే ॥

296 అగ్రే జీవాగతిం జ్ఞాత్వా, జీవాత్మపరమాత్మనోః ।
వే మాఘూర్ధ్వా న మజ్జంతి, కిం మజ్జే న్నావికోంఽబుధా॥

---

**291** టెక్కెమెత్తిచెప్పు మొక్కఁడే దేవుఁడు, నిక్కముగను లోన నిల్చియుండుఁ।
జక్కఁజూచు నతని సంతోషమున ముంచు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**292** జీవుఁడనఁగ మీరు చిక్కులు వడనేల, వాయు వాకసంబు వహ్నిఁ గూడి ।
దేహి యనఁగ నొప్పె దేహంబు లం దొప్పి, విశ్వదాభిరామ వినురవేమ !॥

**293** జీవగుణముఁగల్గు జీవంబు బ్రహ్మంబు, సాటివచ్చు టెట్లు సరవిఁ దెలియ ।
నూరికుక్క సింగ మొక్కటి యగు నొక్కొ!, విశ్వదాభిరామ వినురవేమ !॥

**294** పరముఁ గోరనట్టి పామరజనులకు, స్థిరముకాదు బుద్ధి చిక్కఁబోదు ।
తరముఁగాని పరముఁ దలపోత యగు రోత, విశ్వదాభిరామ వినురవేమ !॥

**295** పదునుగలుగ మ్రాను పచ్చనైయుండును, ఈవి కలుగలంజయింటనుండు।
తలఁపుఁగలుగ హరియుఁ దనయొద్దనేయుండు,విశ్వదాభిరామ వినురవేమ!॥

**296** జీవులెల్ల ముందు జీవాత్మ పరమాత్మ, జతనెఱుంగఁ బాపజలధిఁ బడరు ।
నావ నడుపువాఁడు నట్టేట మునుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

297 కాలధర్మ మభిజ్ఞాయ, విసృజ్య కూటచేష్టితమ్ ।
త్యక్త్వాంగనాశ స్త్వం వేమ!, పశ్య జాగృత్య తం శివమ్ ॥

298 పత్ర పూగ సుధా ద్రవ్య, త్రివ దైక్యేన రక్తిమా ।
భవే ద్వేమ! తథైవాత్మా, శోభే త్సత్త్వః త్రిభి ర్గుణైః ॥

299 బ్రహ్మాండం స్యా ద్వేమ! దేహం, ప్రాణ స్తు పవన స్తథా ।
అక్షిణ్యార్కేందుశిఖినో, బ్రహ్మైత దితరం కుతః?॥

300 పృథివ్యా నభసా వేమ!, జగద్వ్యాప్తం సమం తతః ।
అవితుం కే తు రాజానః, మహీపాఖ్యా నరస్య కా?॥

301 సంజాతా యది జీవేయు, ర్జనా భువి జగత్సు చ।
నమము ర్వేమ! కాలస్య, న్యూనా స్యా ద్గణనాధికా ॥

302 సుపక్వఫలభోక్తా య, శ్శలాటో ర్వేమ! ఖాదనే ।
వాంఛాం న కురుతే తస్మాత్, నైహికే వర్తతే యతిః ॥

---

297 కాలధర్మ మెఱిఁగి కపటవృత్తులు మాని, అలుపిల్ల లందు నాశవదలి ।
మేలుగాను శివుని మేల్కని చూడుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

298 ఆకువక్కసున్న మవి మూఁడువన్నెలు, ఏకమైనచోటఁ దాకు నెఱుపు ।
సోకి త్రిగుణ మట్లు శోభించు పరమాత్మ, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

299 బ్రహ్మమటముమేను ప్రాణంబు దగగాలి, మిత్ర చంద్రశిఖులు నేత్రచయము।
మఱియు బ్రహ్మ మనఁగ మహిమీఁదలేదయ్యా, విశ్వదాభిరామ వినురవేమ!॥

300 పుడమి యుప్పరంబు ( బురికొనె జగముల, రక్షసేయఁ గల్గు రాజు లెవరు?
మహిపతి యనుపేరు మనుజున కెట్లగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

301 పుట్టినజను లెల్ల ( బుడమిని మనియున్న, పట్టునే జగములు? బట్ట వెపుడు।
యమునిలెక్క హెచ్చు నవల తగ్గుచు నుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

302 పతన మొందు నట్టి పక్వఫలంబును, పట్టి తినఁగలాఁడు పచ్చికాయ ।
కానపడనిరీతి నైహిక ముండును, విశ్వదాభిరామ వినురవేమ !॥

303 అంతరిక్షే న గచ్ఛేత్ చేత్, ఘనతా కాస్తి పక్షిణః ।
యో వ్యర్థాడంబరో యోగీ, స వే మైతాదృశః ఖలు ॥

304 భస్మచ్ఛన్నాగ్నిసంకాశో, వేమ ! యస్థిరభక్తిమాన్ ।
తస్యాయాతి స్వయం ముక్తిః, న లోకామోదకృజ్జనః ॥

305 నరో నారాయణో వా పి, తత్త్వబద్ధోపి వా విభుః।
వే మాస్తి మరణం నూన, మితి చేతసి విశ్వసేత్ ॥

306 కవాటా శ్చార్గళా వేమ !, ద్వారబంధే యథా స్థితాః ।
తథా వక్త్రస్య నియమాః, ధన్య స్స్యా ద్ధర్మవాచకః ॥

307 అజాజీవ స్తు మర్మజ్ఞో, జాన న్వృకగతిం సదా ।
వంధ్యాం మేషీం చ వే మాశు, నీత్వా గంతుం చ నేచ్ఛతి॥

308 ప్రా గ్దదాతి స్వయం దాతా, న దాతా కాకణీ మపి ।
తృష్ణా హారం జలం వేమ !, న తథా కుత్రచి త్స్థలమ్ ॥

---

303 పతగ మితరజంతువితతికంతకుమేటి, యగునె? తెక్కలుండియెగురకున్న।
వట్టియోగి యిట్టి వైఖరివాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

304 నివురుకప్పినట్లు నిశ్చలభక్తితోఁ, దగిలియుండ ముక్తి తానె వచ్చు ।
జగతి నొప్పఁజెప్పు జాణయు మఱిలేఁడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

305 నరుఁడెయైన లేక నారాయణుండైనఁ, డత్త్వ బద్ధుఁడైన ధరణి నరయ।
మరణ మున్నదనుచు మదిని నమ్మఁగవలె, విశ్వదాభిరామ వినురవేమ !॥

306 ద్వారబంధమునకుఁ దలుపులుగడియలు,వలెనె నోటికొప్పఁగలనియతులు,
ధర్మ మెఱిఁగి పలుక ధన్యుఁడౌ భువిలోన, విశ్వదాభిరామ వినురవేమ !॥

307 దొడ్డివాఁడు పెద్దతోడేలునైనను, మట్టుఁజూచి దాని మర్మ మెఱిఁగి ।
గొడ్డుగొఱ్ఱెనైన ఁ గొని చనని యుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

308 దాతయైనవాఁడు తానె మ న్నిచ్చెడుఁ, గాని వాఁడొసఁగునె? కాసునైన ।
జలము దప్పిఁదీర్చు మలమెట్లు ఁ దీర్చును?, విశ్వదాభిరామవినురవేమ ! ॥

309 తరుణ్యాంగం పుమా న్వేత్తి, పురుషాంగం తథాంగనా ।
వస్త్రాధారణ మాత్రేణ, కా లజ్జా వేమ ! కా వ్యథా?॥

310 ఫలం కలుషితం వేమ !, న సా ధ్వీతి వదంతి హి ।
స్వకల్మషం న మన్యంతే, నాత్మశ్లాఘీ స్వదోషవిత్ ॥

311 యది కుర్యా ద్వృథార్భాటం, హేయం స్యా త్కూటయోగినః ।
పరం శూన్యం తస్య వేమ !, భవే చ్చ నరకవ్యథా ॥

312 ఛురికాకృంతనే దక్షా, న తన్మూలం తథా మనాక్ ।
వినా జ్ఞానం దేహబలం, కిం కుర్యా ద్వేమ ! చింతయ ॥

313 యాతే యాతే లభే త్కాశీ, ప్రణవ శ్చ శ్రుతే శ్రుతే ।
దృష్టే దృష్టే వేమ ! సృష్టేః, కారణం బోధతే స్వయమ్ ॥

314 ప్రతిబింబో ఘటజలే, బింబో నాస్తి జలాస్థితౌ ।
జ్యోతి ర్వేమ ! ఘటాంతస్థం, క్రమశః పశ్య నిశ్చలమ్ ॥

---

309 తరుణియంగమెల్లఁబురుషుఁడెఱుంగును,పురుషునంగమెల్లఁబొలఁతియెఱుగు
జీరకట్టుకున్న సిగ్గేమి యెగ్గేమి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

310 డాగుపడినపండు బాగు లే దందురు, అట్టిడాగు తమది యరయలేరు ।
తమ్ము నెంచువారు తమడాగు కానరు, విశ్వదాభిరామ వినురవేమ !॥

311 టక్కుయోగియెంత టాటోటుఁ జేసిన, వివర మరసినంత వెగటు గల్గు ।
పరమునున్న నరకబాధయు సిద్ధంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

312 ఛురికతోడఁ గోయఁ జొప్పడునే కాని, దానిపిడిని గోయ ఁదరమె? సికుఁ ।
దెలివిలేని మేని బలి మేమి చేయును?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

313 చనఁగఁజనఁగఁదాకుఁజనుఁ తోవలోఁగాశి, వినఁగవినఁగ ఁబ్రణవవిభవరవళి ।
కనఁగ ఁగనఁగఁ బుట్టుకారణ మగపడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

314 ఘటపుజలములందు గగనంబుఁగాన్పించు, ఘటపుజలములేమిగగనమేదిః
ఘటములోని జ్యోతిఁ గ్రమమున ఁ జూడుము, విశ్వదాభిరామ వినురవేమ!॥

315 సహస్రమేషసంఘాతే, వత్సైకత్ర స్థితేఽపి చ ।
జ్ఞాత్వాంబా మేతి తచ్ఛాబః, భక్త స్సద్యోగినం తథా ॥

316 గుహాః ప్రవిశ్య వే నేమా, గుర్వన్వేషణకాంక్షిణః ।
యది క్రూరమృగప్రాప్తిః, మార్గం ముక్తే స్స దర్శయేత్ ॥

317 కిం కస్తూరీసుగంధేన, వినా స్వమదధారయా ।
గజస్య యోగినో వేమ !, రంభయా కిం ప్రమోదినః ?॥

318 సస్యం రక్షే్య స్నరో వేమ !, యథోత్ఖాత్య తృణాదికమ్ ।
తథా ఛిత్త్వా దృశ్యజాలం, మనో వర్ధయ ధీరతః ॥

319 ప్రాప్తాని సర్వసౌఖ్యాని, మిథ్యారూపాణి భావయన్ ।
చరే ద్భాస్కరవ ద్వేమ !, ధీర స్సంచారకోవిదః ॥

320 కన్యాం ధనవతే దత్త్వా, మోదంతే బాలిశా జనాః ।
పూజాఫలం స్థిరం వేమ !, యత్నాని న తథైకదా ॥

---

315 గొఱ్ఱెలుపదివేలు కూడియుండిన చోటఁ, దల్లి నెఱిఁగివచ్చుఁ దాని కొదమ।
పరమయోగి నెఱిఁగి భక్తుఁడుఁ వచ్చును, విశ్వదాభిరామ వినురవేమ !॥

316 గుహలలోనఁజొచ్చి గురువును వెదుకంగఁ, గ్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిదారియదియె ముందుగాఁ జూపును, విశ్వదాభిరామ వినురవేమ !॥

317 కస్తురివలపేల గజరాజమున కెన్నఁ, దనదుమదపుధార తావికాక ।
యోగికేలరంభ యోగహస్తం బుండ, విశ్వదాభిరామ వినురవేమ !॥

318 కలుపుఁదీసి నరులుకాపాడి పైరులఁ, బెంచు ప్రేమవలెను పెనిచి మదిని ।
దృశ్యములను ద్రుంచి తెంపుగా నుండుము, విశ్వదాభిరామ వినురవేమ !॥

319 కలుగుసుఖములెల్లఁగల్లఁగారోయుచు,మెలఁగుచుండవలయుమిహిరుపగిదిఁ
దిరుగునేర్పుఁజూడ ధీరుఁడె యగునయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

320 కలిమిగలయతనికిఁగన్యకనిచ్చియు, మురియుచుంద్రుకాదె? మూఢజనులు
పూజఫలముకాని పూనికల్ నిల్చునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

321 ఋగ్యజుర్వేదినో వేమ!, నాచితీ యస్య విద్యతే ।
స విప్రోఽపి కథం పూజ్యః, జారేవ స్త్రీ సభర్తృకా ॥

322 వేమ! వ్యాఘ్రీ ప్రసూతాపి, హంతుం శక్యా ప్రయత్నతః ।
వేత్తుం శక్యం మనో మర్త్య, న తారకగతి స్తథా ॥

323 గృహీత్వా పక్షిణో వేమ!, హత్వా స్వోదరపూర్తయే ।
పచిత్వా భువి యో భుఙ్క్తే, నూనం చండాల ఏవ సః ॥

324 యావ చ్చర్మఘటస్థో స్తః, తావ త్సక్తౌ సతీపతీ ।
విముంచతి ఘటం జీవే, సంబంధో వేమ! ఛిద్యతే ॥

325 స్వనివాసస్థలే వేమ!, సంవీక్ష్య చరతో జనాన్ ।
దంశతే శ్వా కథం నీచః, గుణం నైసర్గికం త్యజేత్ ॥

326 అశృణ్వన్ మాతృరుదితం, య స్స్వభార్యావ్యథాకులః ।
దయతే స జడో వేమ!, పశు శ్చాతారతమ్యవిత్ ॥

---

**321** ఋగ్యజుస్సులెఱిఁగి యోగ్యత లేకున్న, విప్రుఁడైననెట్లు విహితుఁ డగును ।
భర్తకల్గి యన్యుభావించు సతివలె, విశ్వదాభిరామ వినురవేమ !॥

**322** ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు, మనసుమర్మమరసి కనఁగవచ్చు ।
తారకంబుమఱిగి తగులుట సాధ్యమా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**323** పక్షిజాతిఁబట్టి పరగహింసలఁబెట్టి, కుక్షినింపఁగూడుఁ గూరుటకును ।
వండితినెడువాఁడు వసుధ చండాలుండు, విశ్వదాభిరామ వినురవేమ !॥

**324** తోలుఘటములోనఁ దొలఁగక యున్నవ్వు, డాలుమగలు ప్రీతినలరుచుండ్రు।
జీవిఘటమువిడువఁ జిక్కాడి పోవురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

**325** తానువెలయుభూమిఁ దనరంగఁదిరిగెడు,జనులఁగాంచిపొంచినరగఁగఱచు
కుక్కబుద్ధియగుట గుణమేల మానును౼ విశ్వదాభిరామ వినురవేమ !॥

**326** తల్లి యేడ్వ వినక తనయాలు వగచిన. జాలిపడెడువాఁడు జడుఁడు సుమ్మి।
తారతమ్య మెఱుఁగనేరని పశువగు, విశ్వదాభిరామ వినురవేమ !॥

327 త్వగ్భాతి స్నేహసంలిప్తా, వ్యాయామేన బలం తనోః।
జ్ఞానమార్గే పరిజ్ఞాతే, స్యా ద్వేమ! సఫలం జనుః ॥

328 వేమాంశ స్సర్వలోహేషు, ఖనిజే ష్వాపయుజ్యతే ।
బహుధా హ్యతిబాహుళ్యాత్, క్రియతే తత్ర లాఘవమ్ ॥

329 ఖేచరాస్తు న దృశ్యంత, ఇతి వేమ! బ్రువంతి హి ।
కి మ్మాద్రియంతే తాన్ దృష్ట్వా, పిత్రాద్యాః కిం న తత్సమాః?

330 దేహే స్థితే హి కామాదీన్, ఛిత్వా జ్ఞానపథాయ చ।
యతే ద్వేమాఽవిలంబేన, కాయాపాయే తు కిం ఫలమ్ ? ॥

331 మధునా కాంతసిందూరం, దత్తం చేత్ పిత్తరోగిణః ।
దేహదార్ఢ్యం భవే త్తేన, ధన్యో వేమ! సుఖం లభేత్ ॥

332 యోగినోఽపి స్మరావస్థా, విస్పష్టా దృశ్యతే యది ।
నష్టయోగో భవే ద్వేమ!, భ్రష్టత్వం ప్రాప్నుతే తదా॥

---

327 చమురురాచుకొన్నఁజర్మంబుమెఱుగెక్కు, సాముఁజేయ మేనుసత్తు వెక్కు।
జ్ఞానమార్గ మెఱుఁగఁ గడతేరు జన్మంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

328 గనులఁబుట్టు లోహగణమునం దెల్లెడఁ, బనికివచ్చు నొక్క యినుమెచాల।
నైనఁజులుకఁ బరతు రది హెచ్చుగా నుంట, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

329 ఖచరవరులు భువినిఁ గనపడ రందురు, కానవచ్చినంత గౌరవింత్రొ ।
తల్లిదండ్రి గురులుఁ దత్సముల్ గారొకో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

330 కాయమున్నయపుడె కామాదులనురోసి, జ్ఞానమార్గమునకుఁ గడఁగవలయు
జాగుఁజేయఁ గాయ మేగిన నే మగు?, విశ్వదాభిరామ వినురవేమ! ॥

331 కాంతసిందురంబుఁ గడు పిత్తరోగికి, నొసర మధువుతోడ నొసఁగి నంతఁ।
దనరు దేహబలిమి ధన్యుఁడై గట్టెక్కు, విశ్వదాభిరామ వినురవేమ !॥

332 ఎట్టియోగికైన నిల మన్మథావస్థ, తెలియవచ్చెనేని దేటగాను ।
యోగమెల్ల మండి జోగియై పాడగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

333 ఉచ్ఛిష్టమహితం మత్వా, త్యజంతే వేమ! భూజనాః ।
వక్త్రోచ్ఛిష్టం కియ ద్వేమ!, నేత్రోచ్ఛిష్ట మి హాధికమ్॥
334 సత్యాసత్యగతిం జ్ఞాతుం, కేషాం వేమ! వశం భవేత్ ।
క్రమాత్ స్థితి ర్గతి ర్వ్యక్తా, న తథా శ్రుతిమాత్రియా ॥
335 ఋషీణాం విపినే వేమ!, జుగుప్సా విషయార్థితా ।
అభోగో ధనినాం చైవ, భార్యాణాం చా ప్యపోషణమ్॥
336 వే మేషణత్రయం త్యక్త్వా, మశక్తానాం సమం తతః ।
నృణాం మోహాబ్ధిమగ్నానాం, కథం మోక్షసుఖం భవేత్?॥
337 వే మాప్యల్పాం శివే భక్తిం, మకుర్వన్ మోహపాశగః ।
ఫల మప్రాప్య యః కాశీం, యాతి వేత్తి న కిం యమః?॥
338 అలబ్ధతరణోపాయః, వ్యర్థాయాసో నదీజలమ్ ।
కథం తరతి వే మైవ, మజ్ఞా న్యాప్నోతి కిం పరమ్?॥

---

333 ఎంగిలెంతవట్టు హితవుగా నెంచక, యొగ్గియుందు రంత నుర్విజనులు ।
కన్ను యెంగి లెంత కన్నెంగి లధికమౌ, విశ్వదాభిరామ వినురవేమ!॥
334 ఋతమనృతమెఱుంగనెవ్వరితరమగు, స్థితియుగతియుఁదెలియఁదేటపడును
విన్నమాత్రముననె వివరింపఁ గారాదు, విశ్వదాభిరామ వినురవేమ!॥
335 చని యడవికి ఋషులు చవులఁగోరుటరోత, నరులుకలిగితినమినరయ రోత।
భార్యలనుచు వారి భరియింపమియు రోత, విశ్వదాభిరామ వినురవేమ!॥
336 ఈషణత్రయంబు నెడపంగ నేరక, మోహరాశిలోన మునిఁగియుండు ।
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబుఁ గల్గును, విశ్వదాభిరామ వినురవేమ!॥
337 ఈశుమీఁద భక్తి యిసుమంతలేకను, పాశములను జిక్కి ఫలముఁ గనక।
కాశియాత్రబోవఁ గాలుఁ డెఱుంగఁడా, విశ్వదాభిరామ వినురవేమ!॥
338 ఈతరానిమనుజుఁ డెగరోజి దిగరోజి, యేఱుదాటఁగలఁడె? యీదఁబోయి ।
ప్రజ్ఞలేనివాఁడు పరలోక మందునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

339 సుఖం న ప్రాప వే మేహా, విస్రభ్య చ పరం తతః।
కిం జీవనేన నాదౌ య, త్సుఖ మంతే కథం భవేత్ ?॥

340 ఇంద్రోఽపి వేమ! కామీ సన్, హీనత్వ మగమ త్తథా।
మారోఽపి చాశు దగ్ధోభూత్, ప్రథాం బ్రహ్మాపి ముక్తవాన్ ॥

341 ఇంద్రలోక శ్చేంద్రజాలం, వేమేంద్రపదవీ తథా।
ఏత త్సర్వం సమం భ్రాంత్యా, న పశ్యంతి నరాః కలౌ ॥

342 ఏక స్సత్యప్రతిజ్ఞాయై, వేమ! విక్రీయ చాంగనామ్।
హీనాచారః శ్మశానోర్వ్యా, పాలకస్స న్నవర్తత ॥

343 అస్థిరం దేహ మాలోక్య, వేమ! దర్పసమన్వితః।
బహుధా వర్ధయి త్వాంతే, దత్తేఽగ్నే ర్వా శివాతతేః ॥

344 క్షమావాన్ యాతి సాధుత్వం, నాస్తి కాపి క్షమా సమా।
క్షమయా వేమ! కీర్తి స్స్యాత్, శ్రేయాంసి బహుళాని చ ॥

---

339 ఇహమునందు సుఖము లీడేరఁగా లేదు, పరమునమ్మి నేని బ్రతుకుగలదె?।
మొదటలేనిసుఖము తుది నెట్లుకలుగును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

340 ఇంద్రుఁడయ్యుఁ గామి హీనుఁడై పోయెను,మారుఁడయ్యుఁగామిమండిపోయె।
బ్రహ్మయయ్యుఁగామి బైసిపోనాడెను, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

341 ఇంద్రలోకమనఁగ నింద్రజాల మనఁగ, నింద్రపదవి యనఁగ నిన్నియొకటె।
కలియుగమున నరులు కానరు భ్రమచేత, విశ్వదాభిరామ వినురవేమ !॥

342 అలినమ్మి భువిని నాచారహీనుఁడై, ప్రాలుమాలె నొక్క ప్రతినకొఱకు।
ఆడితప్పకుండఁ గాడుఁగాచినవాఁడు, విశ్వదాభిరామ వినురవేమ !॥

343 అస్థిరమగుమేని కదరుపాటులనొంది, పెక్కువిధులచేతఁ బెంచి పెంచి।
అగ్నికిచ్చులేక యడవినక్కల కిచ్చు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

344 క్షమగలట్టియతఁడు సాధువై శోభిల్లు, నోర్పుఁబోలునట్టి దుర్విఁ గలదె?।
వన్నెవచ్చు మేలు లెన్నైన నొనగూడు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

345 యస్య హస్తే కాంచనాద్రిః, నివాసో రజతాచలే ।
సోఽపి వేమావశో భూమౌ, భిక్షార్థం వ్యచరత్ ఖలు ॥

346 సుఖాని వేమ! సర్వాణి, దుఃఖాంతాని తథైవ చ ।
పుణ్యాని పాపరూపాణి, శూలే చోరమనోరథాః ॥

347 సత్యేన సాహసే నాపి, త్యక్త్వా మోహమతిం బుధః ।
జ్ఞాత్వా ముక్తిం వేమ! చిత్తే, గురుం స్థాప్య పరివర్తయ ॥

348 సపత్నీ జననీ వేమ!, సదా రంధ్రగవేషిణీ ।
న స్వమాతేవ సహతే, అభ్రాంతో జ్ఞాన మాప్నుహి ॥

349 సక్త్యా సమ్యక్క్రియాలభ్యా, భక్త్యా పూజా ఫలప్రదా ।
యుక్త్యా చ సహితం వేమ!, వచనం రాజతే సదా ॥

350 సర్వవిద్యాసు సంపన్నా, యే తే పరిచయా త్సదా ।
లఘువో వేమ! నేహం తే, ప్రాంతవృక్షభవౌషధీమ్ ॥

---

345 హేమనగము చేత నెప్పుడుఁగలవాఁడు, వెండికొండమీఁద వెలయువాఁడు।
ఎత్తవలసె బిచ్చమేమనవచ్చురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

346 సుఖములెల్లఁదెలిసిజూడంగదుఃఖముల్, పుణ్యములునుపాపపూర్వకములె
కొఱతమీఁది దొంగ కోర్కులవిధమయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

347 సాహసముననైన సత్యముచేనైన, మోహబుద్ధి విడిచి ముక్తి నెఱిఁగి ।
చేర్చి మదిని గురుని చెలరేగి యుండుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

348 సవతితల్లి చూడ సాకుల నెరపును, స్వంతతల్లివలెను సైప దెపుడు ।
వింత లణఁచి లోన విజ్ఞాన మందుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

349 సక్తి కలుగు పనులు చక్కఁగా నేరవేరు, భక్తికలుగు పూజ ఫలమునిచ్చు।
యుక్తికలుగు మాట యొప్పును భువిలోన, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

350 సకలవిద్యలందు సంపన్నులైయున్న, నట్టివారు పరిచయమునఁ జౌక ।
పెరటిచెట్టుమందు బరికింప మెచ్చరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

351 యో వేమ! నిర్జితశ్వాసః, సాధితుం శక్నుతే ఫలమ్।
స ముక్తిం యాతి నిర్మోహః, దుర్గుణః కిం న బాధతే? ॥

352 వినయం దర్శయన్ వేమ!, స్నేహాభ్యర్థీవ సూచకః।
గర్తే క్షిపతి దాతవ్యో, నాశ్రయ స్తస్య దుర్మతేః॥

353 య స్తు ధర్మాన్ వీరశైవాన్, వేత్తి స బ్రహ్మవర్త్మని।
యది వర్తేచ్చరే ద్వేమ!, సింహో వ్యాఘ్రభటో యథా॥

354 శిలాయాం శిలయా వేమ!, ఘర్షితాయాం ముహు ర్ముహుః।
స్నిగ్ధం యథా తథాకార్య, కరణాత్ స్యా త్ప్రయోజనమ్॥

355 స పౌరుషం బలా ద్వేమ!, బహి శ్శత్రువిదారణమ్।
వ్యర్థతేంత ర్మనో గేహే, జిత్వా రథ్యాం జయే త్ఖలు॥

356 సూర్యోదయాస్తమానానాం, జాతీనాం మృత్యుజన్మనామ్।
సంఖ్యాం జ్ఞాత్వా వేమ! యోగీ, ధీరస్సన్ వర్తతే సదా॥

---

351 శ్వాస లాగి విడిచి సాధింప నేర్చిన, మోసపోక ముక్తి మూటఁ గట్టు।
దోసకారి గుణము గాసిఁ బెట్టకపోదు, విశ్వదాభిరామ వినురవేమ !॥

352 వేడుచున్నయట్లె వినయంబుఁ జూపును, గోతదింపు సుమ్ము కొండెగాఁడు।
చేర్పరాదు వానిజెఱచును తుది నెట్లొ, విశ్వదాభిరామ వినురవేమ !॥

353 వీరశైవధర్మవిధము లెఱింగియు, బ్రహ్మవిద్యమీఁదఁ బరఁగె నేని।
జెలఁగి పులికి బంటు సింగపుఁ బిల్ల యౌ, విశ్వదాభిరామ వినురవేమ !॥

354 రాయి రాయిఁ జేర్చిరాయఁగారాయఁగా, నున్న యైన యట్టులన్నిపనులుఁ।
బాటుఁ జేసి నంత పరిపాటి యగు నయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

355 బంటుతనముఁగాదుబలముతోఁగట్టఁగా, వెంటనుండిమనసు వెతలఁబరచు।
నింట గెల్చి రచ్చ నిల గెల్వవలె నయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

356 అరుణునుదయసంఖ్యయస్తమానపుసంఖ్య, జననమరణసంఖ్యజాతిసంఖ్య।
దీని నెఱిఁగి యోగి ధీరుఁడై యుండును, విశ్వదాభిరామ వినురవేమ !॥

357 ముహుర్దృష్ట్వాసు యోషిత్సు, వేమ! సంసారితాం వ్రజేత్।
సుతోదయే వ్యథా మోహాత్, భ్రష్టః "క"ర్మేతి రోదితి॥

358 వేమాహల్యా శిలా భూత్వా, స్పృష్ట్వా రామాంఘ్రిణాసకృత్।
"కాంతాభూ"దితి సంప్రాహుః, శిలా వ్యేతి కృతం ఫలమ్॥

359 మూఢభక్త్యా శివం వేమ!, పూజయిత్వా కిరాతకః।
ముక్తోఽభూత్ పూజయా కిం వా, స్వబుద్ధిస్త్వత్ర కారణమ్॥

360 మల్లికామండపం వాపీం, వనం నిర్మాయ కన్యయా।
'రమేఽహ,మితి వేమైవం, చింతత స్సమయో గతః॥

361 మర్మానభిజ్ఞా వేమోర్వ్యాం, కల్పయిత్వా మతాన్ బహూన్।
దుఃఖంతే హి జనాశ్చైవ, భ్రాంతః కాచకృతే గృహే॥

362 జలాసేకాత్ వేమ! మల్లీ,పుష్పయుక్తా భవే ల్లతు।
అక్రియస్య ఫలం కుత్ర, చాపాకా దోదనం కథమ్?॥

---

357 సతులఁ జూడజూడ సంసారి కాఁగోరు, సుతులుపుట్టఁబుట్ట వెతలఁ బడును।
గతులుఁ జెడఁగఁజెడఁగఁగర్మమంచేడ్చును, విశ్వదాభిరామ వినురవేమ!॥

358 రాయియై యహల్య రాముపాదముసోకి, యాడుదయ్యెనందు రవనిజనులు।
చేయు సుకృతము లిల శిలలైనఁ బొందును, విశ్వదాభిరామ వినురవేమ!॥

359 మూఢభక్తిచేత ముక్కంటిఁబూజింప, మున్నుబోయనరుఁడు ముక్తుఁడాయె।
పూజకేమి తనదు బుద్ధి ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

360 మానసమున మంచి మల్లెపూల చవికె, బావిఁ దోటఁ జేసి బాలఁ గూడి।
భోగి నయ్యెద ననఁ బోయెఁబో కాలంబు, విశ్వదాభిరామ వినురవేమ!॥

361 మర్మమెఱుఁగలేకమతములుకల్పించి,యుర్విజనులుదుఃఖమొందుచుండ్రు
గాజు టింటఁ గుక్క కళవళపడురీతి, విశ్వదాభిరామ వినురవేమ!॥

362 మంచినీరుఁబోయ మల్లె పూచును గాని, ఫలిత మొనరుటెట్లు పనిఁ జొరమిని।
వంటఁ జేయ కెట్లు వంటక మబ్బును, విశ్వదాభిరామ వినురవేమ!॥

363 వే మాశు చందనే దృష్టే, మనో రంజతి గణ్యాతే ।
తద్వాసనా న జానంతి, స్వయం స్వాః పూర్వవాసనాః ॥
364 వే మాశీనరఘాసస్య, సుగంధః కల్పితః కిము ?।
స్వస్త్రే హేమ్నాపరాద్ధం కిం, బ్రహ్మచేష్టా నిరర్థకాః ॥
365 అభ్రగామీ న లోకేఽస్తి, న బలీయాన్ కలంజభుక్ ।
బకయోగైః కిం తు వేమ !, వాంఛానాశో భవే త్ఖలు ॥
366 సుతం వరయితుం వేమ !, కన్యకా మాగతాం పితా ।
ఉద్వాహతే స కో ధర్మః, దోషజ్ఞోఽప్యఘ మాచరేత్ ॥
367 నేత్రాగ్నినా స్మరం దగ్ధ్వా, పశ్చా ద్వేమాతికాముకః ।
గౌరీయుక్తోఽభవ త్కర్మ, త మీశ మపి సజ్జతే॥
368 చతుర్దశసు లోకేషు, ఈషణ్మాత్రసుఖార్థినః ।
వర్తంతే వేమ ! కామార్తా, ఉచ్ఛిష్టార్థి బిడాలవత్ ॥

---

363 మంచిగంధముఁ గన మనసు రంజిల్లును, ఎంతొ వాసననుచు నెన్నుచుంద్రు
తా మెఱుంగ లేరు తమ పూర్వవాసనల్, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
364 పూతగడ్డి కేల పుట్టించె వాసన, కనకము తనకేమి కల్లఁజేసె ।
భ్రష్టచేత లెల్లఁ బాడైన చేతలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
365 నింగికెగయువాఁడు నేఱిలోకమునలేఁడు, బంగుఁద్రాగువాఁడుబలియఁబోఁడు
కొంగయోగములను గోర్కు లడఁగునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
366 కొడుకును వరియింపఁ గోరివచ్చినదానిఁ, దండ్రి పెండ్లియాడ ధర్మమగునె?
తప్పని తెలిసియును దాఁజేయుఁ గర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
367 కంటిమంటచేతఁ గాముని దహియించి, కామమునను గడకు గౌరిఁగూడె ।
నట్టి శివునినైన నంటెను కర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
368 ఇంచు కంత సుఖమె యీరేడు జగములఁ, గంచమునకుఁ బిల్లికాచినట్లు ।
పంచబాణుబారిఁ బడియు నాసింతురు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

369 ప్రాప్తా శ్రీ ర్హరయే వేమ!, విషం ప్రాప్తం పురారయే।
కో విజానాతి లోకేఽస్మిన్, కస్య కా ప్రాప్తి రిత్యహో! ॥

370 దైవానుకూల్యే పాత్రీత్వాం, న శక్తా స్సాధితుం పరే।
యదుక్తం భారతే వేమ!, పరమార్థ మిదం హి తత్ ॥

371 వే మైకస్మై ధనం దత్వా, పరస్మై దాతృతా గుణే।
చిత్తం దత్వా భ్రంశయతే, బ్రహ్మచేష్టా నిరర్థకాః ॥

372 ఉచితం దారుఫలకం, వస్తు కుర్వంతి సుందరమ్।
నోచే ద్వేమ! దహంతే హి, కర్మచేష్టా స్తథావిధాః ॥

373 ఘృతం దధ్ని తరు ష్వగ్నిః, వేమ! పుష్పేషు సౌరభమ్।
తైలం తిలేషు చ యథా, చిదాత్మా రాజతే తథా ॥

374 వేమ! రామ స్యాభిషేకం, కర్తుం దశరథోఽస్మరత్।
జటా దధౌ తదా రామః!, పృథక్ చింతా పృథ గ్విధిః ॥

---

369 హరికి దొరకె నందు రాసిరి యప్పుడే, దొరకెఁ గాదె విషము హరున కరయ।
నెవని కెట్టు లగునొ యెవ్వఁ డెఱుంగును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

370 సాటివారు నిన్ను సాధింపఁగా లేరు, దైవ మెపుడు నెకుఁ దప్పకున్న।
భారతంబులోని పరమార్థ మిదె కదా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

371 విత్త మొకని కిచ్చి వితరణగుణమున, చిత్త మొకని కిచ్చి చెఱచినాఁడు।
బ్రహ్మచేత లన్ని పాడైన చేతలు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

372 ప్రమాను తగినదైన మహితమౌ వస్తువుఁ, గా నొనర్తు రట్లుఁ గాక యున్నఁ।
గాల్తు రట్లుఁ గాదె కర్మలకును పాట్లు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

373 మఱియుదధినిఘృతముమ్రానులందనలంబుసౌమ్యసుమములందుసౌరభంబు
దిలలఁ దైల మట్లుఁ దేజరిల్లుఁ జిదాత్మ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

374 దశరథుండు రామధరణీశుఁబట్టంబుఁ, గట్టఁజేయఁ దలఁపఁగట్టె జడలు।
తలఁపు మనదికాని దైవిక మది వేఱె, విశ్వదాభిరామ వినురవేమ! ॥

375 శుకో భూత్వా శుకీగర్భే, ముఖ్యో౽భూ ద్వేమ! మానిషు।
చిత్రవస్త్రాణి జాయంతే, న కార్పాసఫలేషు కిమ్ ?॥

376 శ్వశుర స్తు గిరి ర్వేమ!, భార్యా చ గిరినందనా।
గిరి ర్ధను ర్గిరి ర్గేహం, గిరితుల్య శ్శిలాకృతిః॥

377 సాధుగోష్ఠ్యా వినశ్యంతి, సర్వే నీచగుణా అపి।
న లోపో గంధలేపేన, దుర్గంధో హ్రీయతే యథా॥

378 వైశ్యో వాంఛతి దుర్భిక్షం, పరేషాం రుగ్ణతాం భిషక్।
పౌరో దరిద్రో ధనికం, వేమాశ్రయితు మిచ్ఛతి॥

379 కపటై ర్యది వర్తేత, మహతో౽పి ప్రథా గతా।
పలాండుకవనే వేమ!, మల్లికేవ ప్రవర్ధితా॥

380 బహుబీజా యథా వర్ధేత్, నిశి పాదహతా స్పృహో!।
తథా వేమ! పరై ర్ధూర్తైః, గర్హితః కిం విదే త్త్రపామ్॥

---

375 చిలుకగర్భమందు శ్రీశుకుఁడుదయించి,మునివరేణ్యులందు ముఖ్యుఁడయ్యె
ప్రత్తికాయఁ జిత్రపటములుఁ బుట్టవా, విశ్వదాభిరామ వినురవేమ!॥

376 కొండ దండిమామ కొండకూతురె యాలు, కొండమేటివిల్లు కొండయిల్లు।
కొండవంటిదొరయు గుండయి పోయెను, విశ్వదాభిరామ వినురవేమ!॥

377 నీచగుణము లెల్ల నిర్మూలమై పోవుఁ, గొదువలేదు సుజనగోష్ఠివలన।
గంధ మలఁద మేనికం పడంగిన యట్లు, విశ్వదాభిరామ వినురవేమ!॥

378 కోమటి మదిఁగోరు క్షామమే యెల్లెడ, వైద్యుఁ డొరుల కెపుడు వ్యాధిఁ గోరు।
నూరిపేద ధనికుఁ జేరఁగాఁ గోరును, విశ్వదాభిరామ వినురవేమ!॥

379 టక్కరులనుగూడి యొక్కసక్కెములాడ, నిక్కమైన మనుని నీతి చెడును।
ఉల్లితోటఁ బెరుగు మల్లిమొక్కకరణి, విశ్వదాభిరామ వినురవేమ!॥

380 రేగుపుచ్చను భువి రేయెల్లఁ ద్రొక్కిన, మురగ కంత కంత పెరుగుచుండు।
నొరులు ఛీయటన్న నోగు సిగ్గెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

381 క్షమావిహీనయా వేమ !, భార్యయా కిం ఫలం భవేత్ ?।
కిం జాతేన కుపుత్రేణ, కి మసద్గుణవిద్యయా?॥

382 ఖలా శ్శపంతీతి వృథా, వేమ ! ఖేదేన కిం ఫలమ్ ?।
తచ్ఛాపై ర్న ప్రథాపైతి, శాప శ్శపతి సజ్జనే ॥

383 కాలం హరతి కష్టాత్మా, ధర్మాచరణవృత్తిషు ।
కిం స్యా ద్వేహ స్వయం వేమ !, కిం స్యాద్వా స్వీయజీవనమ్?॥

384 సర్వలోకేఽస్తి య ద్వస్తు, మాతాశిశువశేఽపి తత్ ।
నిస్తరంగాబ్ధినమయా, నియత్యా వేమ ! వీక్షయ ॥

385 యదీచ్ఛతి న వే మైతి, నాపైతి యది నేచ్ఛతి ।
పురాకృతం కర్మఫలం, తతో హ్యాది న శోచయేత్ ॥

386 వేమాపి ప్రియాపి శ్రోతవ్యా, యది కాలో న గచ్ఛతి ।
కాకధ్వనిం వల్లభాయ, కామినీ న శృణోతి కిమ్? ॥

---

381 ఓర్పులేనిభార్య యున్నఫలం బేమి, బుద్ధిలేనిబిడ్డ పుట్ట నేమి ।
సద్గుణంబులేని చదువది యేలను, విశ్వదాభిరామ వినురవేమ !॥

382 ఖలులు తిట్టి రనుచుఁ గలవరపడ నేల?, వారి తిట్ల నేమి వాసి చెడును।
సజ్జనుండు దిట్ట శాపం బదౌనయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

383 దానధర్మములను దగ «రేపు›రే»పని, కాలవ్యయముఁజేయుఁ గష్టజనుఁడు।
తాను నేమి యగునొ తన బ్రతుకే మౌనొ, విశ్వదాభిరామ వినురవేమ !॥

384 ఎల్ల లోకములను నేవస్తు వున్నదో, తల్లి పిల్ల సందుఁ దగులు నదియె।
నిస్తరంగవార్ధి నియతిని జూడుము, విశ్వదాభిరామ వినురవేమ !॥

385 వలయునన్న రాదు వద్దన్నఁ బో దది, తొలి నలిపిన కర్మఫల మటంచు।
నుల్లమందు వగవ కుండుటే ధర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

386 తనకుఁ బ్రొద్దుపోని తరుణం బ దైనచో, వినక తీర దధికవిష్య మైన।
గణిత విసదె ప్రియుని కౌఱకుఁ గాకధ్వని, విశ్వదాభిరామ వినురవేమ !॥

387 అగ్నిజ్వాలాసు మమతాం, అభవే ధ్యానమేవ చ ।
నిధాయ సుమతానాశే, వేమార్చయ సదాశివమ్॥

388 ఆశాపాశై ర్నిబధ్యంతే, సకలా వేమ! జంతవః ।
తతో జ్ఞానాసినా తే హి, ఛేత్తవ్యాః ఖలు సర్వశః ॥

389 వదన్ ప్రగల్భవాక్యాని, వేమాగురు రటన్ భువి ।
బధ్వా కర్మసు బాధేద్ధి, దంతవిష్టః క్రిమి ర్యథా ॥

390 వేమ! బ్రహ్మమయ శ్చేతో, నియ మ్యానంద కేళిషు।
నిధాయ ముక్తిం లభతే, జీవో జిహ్వారసై ర్హతః ॥

391 ద్యూతక్రీడా నిర్జితస్య, ప్రవిష్టస్య తతో వనమ్ ।
ఘనస్య పద్ధతిం దృష్ట్వా, వేమ! వర్జయ మూర్ఖతామ్ ॥

392 ఇహోద్భూయ జనా వేమ!, యే విజానంతి నేంగితమ్ ।
"స్థావరా" ఇతి తే జ్ఞేయాః, న వాచ్యా "జంగమా" ఇతి ॥

---

**387** అగ్నిశిఖలయందు నమరంగ మమకార, మభవుమీఁద ధ్యాన మమరనునిచి।
ఆహుతి యగువెన్క హరుని నర్చింపుము, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**388** ఆశ లనెడి త్రాళ్ల నఖిలజంతువులును. గట్టఁబడును కాన నిట్టలమున ।
జ్ఞాన మనెడి చురియఁ బూని కోయఁగ నౌను, విశ్వదాభిరామ వినురవేమ!॥

**389** జల్లిమాట లనుచు జగమునఁ దిరిగెడు, కల్లగురుఁడు కట్టుఁ గర్మచయము।
పల్లుపురుగు చేరి పలవింపఁ జేయదా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**390** అదిమి మనమునిల్పియానందకేళిలో, బ్రహ్మమయుఁడుముక్తిఁబడయఁగోరు।
జిహ్వారుచులచేత జీవుండు చెడునయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**391** అనువుఁగాని చోటఁ బనిగొని జూదము, నాడి నూడి యోడి యడవిఁ జొచ్చు।
ఘనుని జాడఁ జూచి గడువుము మూర్ఖత, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**392** ఇహమునందుఁ బుట్టియింగితమెఱుఁగని, జనులనెంచిచూడ స్థావరములు।
జంగమాదు లనుట జగతిని బాపమ్ము, విశ్వదాభిరామ వినురవేమ! ॥

393 అనయా నోపయోగా స్స్యుః, వేమేయం రిక్తభస్త్రికా ।
నశ్యే ద్భ్రాంత శ్చర్మభస్త్ర్యా, అసాధ్యః ఖ ల్వసివర్తితః ॥
394 ఆత్మనాశ మజానంత, ఈహంతే పరనాశనమ్ ।
స్వేషాం నాశకరం దైవం, నాస్తి కిం వేమ! చింతయ ॥
395 కఫరుద్ధో మీలితాక్షః, నష్టబుద్ధి ర్గతస్మృతిః ।
యదీహ వర్తతే వేమ!, సాధ్యం కిం త్వద్గవేషణమ్ ?॥
396 రసం ఫలానాం స్వాదూనాం, తృణఖాదీ న వేత్తి హి ।
తథా వే మాల్పవిద్యానాం, జ్ఞానం భవతి నాధికమ్ ॥
397 ఇక్షుమాధుర్యరహితం, నిస్సార మితి కథ్యతే ।
నిర్గుణో నింద్యతే సూరిః, వేమ! దోషై ర్వినాపి చ ॥
398 య ద్యస్తి మాతా వేమాస్తే, లాలనా స్వస్య తన్మృతౌ ।
న కోఽపి పశ్య త్యాత్మానం, కాలే గౌరవ మార్జయ ॥

---

**393** ఉత్తతిత్తి దీని యుపయోగములు లేవు, తిత్తి కొఱకుఁ జెడును దేవులాడి ।
కత్తిమీఁద సాము కడతేరలేఁడయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**394** ఒకనిజెఱుతుమనుచునుల్లమందెంతురు, తమకుఁ గల్గుచేటుఁదామెఱుఁగక ।
తమ్ముఁ జెఱుచువాఁడు దైవంబు లేఁడొకో,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**395** కఫముమీఱిమఱియుఁగనులుమూతలుపడి, బుద్ధితప్పిచాలఁబడమిమఱచు।
వేళలందు నిన్ను వెదకుట సాధ్యమా,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**396** కసవును దినువాఁడు ఘనఫలంబులరుచి, కానలేఁడు కాదె? వాని యట్లు ।
చిన్న చదువులకును మిన్నజ్ఞానము రాదు,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

**397** చెఱుకు తీఁపిలేమిఁ జెత్తనా బడునట్లు, పరగ గుణములేని పండితుండు।
దూఱుఁబడును గాదె? దోష ము టుండఁగ, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**398** తల్లి యున్న యపుడె తనదు గారాబము, నామె పోవఁ దన్ను నరయరెవరు,
మంచికాల మపుడె మర్యాద నార్జించు, విశ్వదాభిరామ వినురవేమ!॥

399 వాదైః కిం మతభేదైః కిం, భస్మీభూతా హి వైష్ణవాః ।
తథా లింగధరా వేమ!, సర్వే స్యు ర్నష్టికామయాః ॥

400 కిం శ్రోత్రప్రాప్తిసార్థక్యం, శ్రోతవ్యా విబుధోక్తయః ।
శ్రుతే శ్రుతే వేమ! సర్వం, తవైవ విశదం భవేత్ ॥

401 కిం శిలాయా దుకూలైశ్చ, గోపురై రాలయై స్తథా ।
కుంభైశ్చ వాంఛతే వేమ!, కి మన్నాద్యఖిలం చ తత్ ॥

402 మథితే మథితే వేమ!, వృక్షే సంజాయతేఽనలః ।
తథా దధ్ని ఘృతం చైవ, తత్త్వం శుద్ధం తనావపి ॥

403 అపశ్యతాం వేమ! ముక్తిం, మూర్ఖాణాం పరమం పదమ్ ।
సువ్యక్తం యో దర్శయతే, స బుధః కిం న దైవతమ్?॥

404 ఋణదాతా ప్రభు ర్భ్యాదా, యది యాచే త్తదా యమః ।
ఋణం కృత్వా పున ర్దాతుం, వేమ! నృణామనిచ్ఛతామ్ ॥

---

399 విష్ణుభక్తు లెల్ల వెలిబూదిపాలైరి, వాద మేల మతవిభేద మేల? ।
తెలియ లింగధరులు తిరుమణి పాలైరి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

400 శ్రవణపుటము లున్న సార్థక్య మేమయా, వినఁగవలయుఁ జెప్ప లనెడివన్ని ।
వినఁగ వినఁగ నీకె విశదంబు నౌఁజుమ్ము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

401 రాతిబొమ్మ కేల రంగైన వలువలు, గుళ్లు గోపురములుఁ గుంభములును ।
కూడు గుడ్డ తాను గోరునా దేవుండు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

402 తరువదరువబుట్టుఁదరువునందనలంబు,తరువఁదరువఁబుట్టుదధిఘృతంబు
తరువఁ దరువఁ బుట్టుఁ దనువునఁ దత్త్వంబు,విశ్వదాభిరామ వినురవేమ!॥

403 ముక్తిఁ గానలేని మూర్ఖజనుల కెల్ల, బట్టబయలుఁజేసి పరమపదము ।
దారిఁజూపు బుధుఁడు దైవంబుకాఁ డొకో,విశ్వదాభిరామ వినురవేమ ! ॥

404 ఋణమొసంగునాతఁడినుఁడగుదొలుదొల్త, నడ్డిమఅలనడుగయముఁడుగనగు
అప్పుఁజేసి తీర్ప నరయనివారికి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

405 స్నేహాయుక్తో వేమ! దీపః, సమ్య గ్జ్వలతి నిత్యశః।
సిద్ధ్యంతే ధనినో వాంఛా, నిర్ధనస్య న వై తథా॥

406 జనా శ్శ్రద్ధాభక్తిహీనాః, యతో వేమ! భవం త్యతః।
ఘనతాయాః కలౌ నైచ్యం, నైచ్యస్య ఘనతా భవేత్॥

407 మద్యం పీత్వా సజ్జనేషు, త్యక్తవస్త్ర శ్చరే న్నరః।
సర్వే నష్టే జీర్ణవస్త్ర,ధారీ స్యా ద్వేమ! నిర్ధనః॥

408 పాపకర్మ సమాప్నోతి, వేమేహ పరదూషణాత్।
పరః పరో న భవతి, పరమాత్మా హి కేవలమ్॥

409 యథోచితేన వాక్యేన, మోదంతే సర్వసజ్జనాః।
వేమాధికాని వాక్యాని, వృథాయాసఫలాని హి॥

410 ఘాసస్య శాకపాకాంతే, న పృథక్కరణం మతమ్।
ప్రాగ్వే మైవ పృథః కుర్యాత్, కుతో ధర్మః స్థలే గతే॥

---

**405** చమురుగల్గు దివ్వె చక్కగా వెల్గును, ధనముఁగలుగువానితలఁపుఁజెలఁగు।
ధనములేనివాని తలఁపులుఁ దీరునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

**406** కలియుగంబునందుమనతకునైచ్యంబు,ఘనతనైచ్యమునకుఁ గల్గుచుండు
శ్రద్ధభక్తు లుడిగి జను లుండ్రు కావున, విశ్వదాభిరామ వినురవేమ!॥

**407** కల్లునీళ్లుఁద్రాగి కడు పెద్దవారిలోఁ జీరవిడిచి తిరుగు చెడి నరుండు।
పనులు తీరువెనుక పాతలు గట్టును, విశ్వదాభిరామ వినురవేమ!॥

**408** పరులఁదిట్టినంత పాప కర్మం బబ్బు, విడువ దెన్నటికిని విశ్వమందు।
పరుఁడు ఁబరుఁడుఁగాఁడు పరమాత్మయౌనయా, విశ్వదాభిరామ వినురవేమ!

**409** అతిహితమగునట్టు లాడినమాటకు, సంతసింతు రెల్ల సత్పురుషులు।
అధికభాషణంబు లాయాసదంబులు, విశ్వదాభిరామ వినురవేమ!॥

**410** కూర యుడుకు వెనుక కూడునా కసవేర, నెఱుక గల్గిమునుపెయేరవలయు
స్థలముఁ దప్పువెన్క ధర్మంబు పుట్టునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

411 గుణాభావే కులం నష్టం, స్త్రీదుర్గత్యా త్రపా గతా।
ఊషరక్షేత్రగం వేమ!, జలం భ్రష్టత్వ మాప్నుయాత్ ॥

412 అశ్వ మారుహ్య రథ్యాయాం, గచ్ఛంతం వేమ! పూరుషమ్।
భషంతే పృష్ఠత శ్శ్వానః, ఘనం వీక్ష్య తథా ఖలాః ॥

413 విజ్ఞాయ పక్వం ప్రోక్తేన, వాక్యే నైకేన చా ప్యలమ్।
బహుప్రలాపైః కిం వేమ!, ఏకాలం గతియుజ్నతిః ॥

414 భవే దల్పో వా ధికో వా,వక్తవ్యం కథితం మయా।
వినాజ్ఞాం వేమ! దేవస్య, పత్రం చలతి కిం భువి?॥

415 కంకుభట్టోనామ వేమ!, కాషాయవసనో ఽభజత్।
విరాటం ధర్మజః జ్ఞేయా, గతయః కాలకర్మణోః ॥

416 నేంధనే దృశ్యతే వహ్ని, ర్దేహాత్మాపి తనౌ తథా।
మర్మ జ్ఞాత్వా వేమ! పశ్చాత్, కుర్యాత్తదవలంబనమ్॥

---

411 గుణము తీపులేక కుల మెల్లఁ జెడిపోవు, స్త్రీల నడత వలన సిగ్గుఁబోవు।
చవిటినేలవలన జల మెల్లఁ జెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ!॥

412 ఎక్కి నెక్కి వీధిఁ జక్కఁగా వెలువడఁ, గుక్క లెన్నొ వెంటఁగూయఁదొడఁగు,
మనుని కోర్వలేని కాపురుషులయటు, విశ్వదాభిరామ వినురవేమ!॥

413 పక్కఁ దెలిసి పలుక నొక్కవాక్యమె చాలు, పెక్కు లేల పట్టి ప్రేలు లరయ।
దిక్కుగల్గు మ్రొక్కు నొక్కటె చాలదా, విశ్వదాభిరామ వినురవేమ !॥

414 అల్పుఁడైననేమి యధికుఁడైనను నేమి, చెప్పవలయు రీతిఁ జెప్పినాఁడ।
హరుని యెఱుక లేక యాకు నల్లాడునా, విశ్వదాభిరామ వినురవేమ !॥

415 కంకుభట్టనంగఁ గాషాయములఁ గట్టి, కొలిచె ధర్మరాజు కోరి విరటుఁ।
గాలకర్మగతులఁ గనిపెట్ట లేరయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

416 కట్టె యందు నిప్పుఁ గానని చందమి, తనువునందు నాత్మ తగిలియుండు,
మఱుగు దెలిసి పిదప మార్గ్యనవలె నయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

417 భూమకా గ్రహేషు సర్వేషు, వేమ! రాశిచరిష్ణుషు।
సాధ్వసాధుఫలే దృష్టే, మన్యంతే కిం స్వపౌరుషమ్?॥

418 దైవే జ్ఞాతే ధర్మబుద్ధ్యా, కిం కుర్యా దంతకః ప్రజాః।
ధర్మం పృష్ఠగతం వేమ!, సదా దైవాయతే ఖలు॥

419 వేమ! రాజతహేమాద్రీ, యస్యాస్త స్స విభుః కథమ్।
భిక్షార్థ మచర త్సర్వం, బలం దైవస్య నాత్మనః॥

420 మానసాంబ్వస్స్రోతః హంసో, యథా సంచరతే తథా।
అసక్తః కర్మసు చరేత్, వేమ! భోగాన్వితో యతిః॥

421 దేహాగారే వేమ! గేహే, శత్రుమిత్రాణి తత్త్వతః।
అజానతః కిం జ్ఞానేన, తద్ధి సమ్యక్కృతేఽమృతమ్॥

422 వేమ! ధేనుస్తనా ద్దుగ్ధే, తప్తే పయసి తక్రమాత్।
దధి తక్రాహ్వాయం చాంతః, నవనీతం తథా పరః॥

---

417 ధర గ్రహములు రాశిజరియించుచుండియు, మంచిచెడుగుఁ గానుపించుచుండ
బురుషయత్న మనుచుఁ బొంగుదు రేలయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

418 ధర్మబుద్ధిచేత దైవంబుఁ దెలిసినఁ, గాలుఁ డేమిచేయఁగలఁడు ప్రజల।
ధర్మమంటి వెంట దైవంబుగా నుండు, విశ్వదాభిరామ వినురవేమ!॥

419 వెండికొండ పసిడికొండయుఁ దనకుండ, దేవుఁ డేల పోయి తిరిపెమెత్తె।
దైవబలముకాని తనబల్మికాదయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

420 హంస మానసోద మంటక తిరిగిన, యట్లు కర్మచయము నంటకుండ।
యోగి తిరుగు సకలభోగంబుతోడను, విశ్వదాభిరామ వినురవేమ!॥

421 తను వనఁదగు నింటఁ దగ శత్రుమిత్రులఁ, దెలియలేనివాని తెలిప దేల?
తెలిసి చక్క బరుప దివ్యామృతం బదె, విశ్వదాభిరామ వినురవేమ!॥

422 ఆవు చన్నుఁ బిదికి యాపాలఁ గాచినఁ, బేరి పెరుగు చల్ల పేర్లఁ గలుఁగు।
దవిలి లోనఁగల్గు నవనీత మట్లురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

423 దృశ్యతే హి తటస్థస్య, సర్వం వేద్యం చ వేద్యతే।
వేమైవం లోకవిషయా, అంత ర్మర్మాణి తత్త్వతః॥

424 యది నేక్షేత్ లతాం స్వస్య, వ్యతిక్రమ్యావహేలికామ్।
నిర్గమే ద్వేమ! తచ్ఛాఖా, తథా స్యా ద్యోషితో గుణమ్॥

425 నాజ్ఞాతప్రణవో భక్తః, నాజ్యోతి ర్దర్శనో మునిః।
న వేత్తి నిత్యం యో వేమ!, న నిర్వాణీ భవే ద్ధి సః॥

426 ఆద్యంతౌ తత్త్వతో వేమ!, కౌ స్యాతాం గురుశిష్యయోః।
గురో ర్న యది మర్యాదా, కో భేదో గురుశిష్యయోః॥

427 సూత్రం ధృత్వా గళే వేమ!, శూద్రితా నిర్గతాత్మనః।
ఇతి భావ స్తు మూఢత్వం, తేజశ్శాలీ జితేంద్రియః॥

428 వక్షోజౌ వేమ! కన్యాయాః, పుష్పగుచ్ఛసమావితి।
వర్ణయంతేఽలసా భ్రాంతాః, కిం స్యా త్తన్మాంసఖండయోః॥

---

423 గట్టుమీఁదనున్నఁ గాన్పించు సర్వముఁ, దెలిసి తేటఁబడినఁ దెలియు నెల్ల।
లోకవిషయములును లోని రహస్యముల్, విశ్వదాభిరామ వినురవేమ!॥

424 పెరటఁ జెట్టుబెట్టి పరికింప కుండిన, వెలుఁగు దాటి తీగ వెడలఁ బాఱు।
నాడుదానిగుణము నటువలె నుండురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

425 ప్రణవ మెఱుఁగనతఁడుభక్తుండుకాఁడయా, జ్యోతిఁజూడనతఁడుజోగికాఁడు।
నిత్య మెఱుఁగ నతఁడు నిర్వాణి కాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ!॥

426 గురువుశిష్యుఁడనఁగఁగొనలెట్టు మొదలెట్టు,గురువుశిష్యుఁడనెడిగుఱుతులెట్లు
గురున కుండఁ దగిన పరువు లేకుండిన, విశ్వదాభిరామ వినురవేమ!॥

427 త్రాడుమెడనువేసి తనకు శూద్రత్వంబు, పోయె ననెడి దెల్ల బుద్ధిలేమి।
మది నిలుపక త్రాడు మఱి వన్నెఁ దెచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

428 బాలచనులు పూలబంతులఁ బోల్తురు. ప్రాలుమాలినట్టి భ్రాంతు లవని।
మాంసఖండమందు మఱి యేమియున్నది, విశ్వదాభిరామ వినురవేమ!॥

429 బాల్యే త్వం బహుధా వేమ !, యా స్తనావపిబ స్స్వయమ్।
తద్గతేన విమోహేన, కిం మూఢాత్మన్ ! విచింతయ ॥

430 ప్రాప్తుకామా విటం వీథ్యాం, దత్తచిత్తేవ కామినీ ।
పరం గంతుం యతే ద్విద్వాన్, వేమ ! త్వ మగుణో భవ ॥

431 యావజ్జీవం రసం జిహ్వా, వాంఛే ద్వేమ ! సతీపతిః ।
వాంఛేత్ పుత్రధనం నూనం, వాంఛేత్ సర్వాన్ హుతాశనః॥

432 సర్వదో నిస్తులో దాతా, ద్రోహీ సర్వాపహారకః ।
గమ్యం గమయతే వేమ !, య స్సపూజ్యో మహాన్ గురుః ॥

433 పురాకృతం కర్మఫలం, భోక్తు మేవ భవోఽభవత్ ।
ఇ త్యాకృష్య మనో వేమ !, సమదుఃఖసుఖో భవ ॥

434 సాగరేణ సమం కించిత్, విద్యతే వేమ ! నాపరమ్ ।
నోపయోగాయ తన్నీరం, తావృ జ్నీరేణ కిం ఫలమ్ ? ॥

---

429 బాల్యమందు నీవు బహువిధంబులఁ బట్టి, చప్పరించినట్టి స్తనములకును।
మోహ మింత యేల మూఢాత్మ! తెలియరా, విశ్వదాభిరామ వినురవేమ !॥

430 విటునిజేరఁగోరి వీధిని మదినుంచు, పడఁతిరీతి ఁ బరముఁ బ్రాక నగును।
గుణము లన్ని మఱచి గుర్తించి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ !॥

431 జిహ్వరుచులఁగోరు జీవించునంతకు, సతియుఁ బతియుఁగోరు సుతధనంబు
హవ్యవహుఁడు ఁ జూడ నందఱఁ గోరును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

432 దోఁపు నిచ్చు వాఁడు తులలేని నెరదాత, దోఁచుకొన్నవాఁడు ద్రోహి యగును।
ప్రాపుఁజూపు వాఁడె పరమపూజ్యుం డగు, విశ్వదాభిరామ వినురవేమ !॥

433 భవము పూర్వకర్మఫలము ననుభవింపఁ, గలిగె ననుచు మదిని గట్టిపఱచి।
కష్టసుఖములేవి కలిగినఁ దలఁగకు, విశ్వదాభిరామ వినురవేమ !॥

434 సంద్రమునకుఁ జూడ సరియేదియునులేదు, అట్టి జలధినీర మనువుఁగాదు।
అనువుఁ గాని నీర మదియేమి చేయును, విశ్వదాభిరామ వినురవేమ !॥

435 సాధనేన వినా వేమ !, న కించి దపి సిద్ధ్యతే ।
విద్యానాస్తి వినా బోధం, విమృశ్య హృది చింతయ ॥

436 యది సాధుజనాన్ బాధేత్, కులం నశ్యే ద్దురాత్మనః ।
పూజా సాధుజనానాం స్యాత్, వేమ ! సాయుజ్యదాయినీ ॥

437 తారకం ధర్మమార్గం స్యా, దితి దేవా మహర్షయః ।
వర్తంతే వేమ ! నశ్యంతి, తద్భిన్నా అసురాదయః ॥

438 అయాచితోఽపి యో దత్తే, బ్రహ్మజ్ఞానీ స కథ్యతే ।
యాచితార్థప్రద స్త్యాగీ, అదాతా వేమ ! లోభవాన్ ॥

439 పితరా వాత్మతనయాః, భ్రాతరో భృత్యబాంధవాః ।
యథా వేమ ! ప్రవర్ధంతే, తథాభ్యుదయవాన్ భవ ॥

440 జీర్ణాంగ్యా శ్చ క్షమావత్యాః, సత్యాః వేమ ! గుణోదయైః ।
కోటిలాభః కిం జుగుప్స్యం,జీర్ణాంగమహిషీపయః ॥

---

435 సాధనంబులేక సమకూర దేదియు, బోధలేని విద్య పొంద దెపుడు ।
పాదుకొల్పి మదిని భావించి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ !॥

436 సాధుజనులఁబట్టి సంతాపమొందింప, కులవినాశ మొందుఁగ్రూరజనుఁడు।
సాధుజనులపూజ సాయుజ్య మిచ్చును, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

437 సురలు మౌను లెపుడు సరవి వర్తింతురు, ధర్మమార్గ మొకటి తారకముగ।
అట్లుకాని వార లసురులై చెడిరయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

438 అడుగ కర్థమిచ్చు నతఁడు బ్రహ్మజ్ఞాని, అడుగ నర్థమిచ్చు నతఁడుత్యాగి।
అడుగ నీయ లేని యాతఁడు పెనులోభి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

439 తల్లిదండ్రు లాత్మతనయులన్నలుదమ్ము, లెలమిబంధుభృత్యు లెల్లజనులు।
గలిగి వర్ధిలంగ ఘనతతో నుండుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

440 ఒడలు శిథిలమైన నోరుపు గల సతి, గుణముమేల్మిఁ బట్టి కోటిసేయు ।
పాత యెనుము పాలు రోతన వచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

441 కండోలే వేమ ! కంబూక, మస్థాప్య మహీమీపయః ।
న దత్తే తాడయే త్వద్భ్యాం, వేశ్యా కాంక్షతి కిం వృథా ?॥
442 కంబూక తనోదకేభ్యః, శాకాయ లవణాయ వా ।
కుర్వంతే వేమ ! కావ్యాని, యే తే విత్తపరాః ఖలు ॥
443 టంకసంధానరహితం, న సాధు స్వర్ణభూషణమ్ ।
భటేన రహితో వేమ !, కిం ప్రభు స్సాధు శోభతే ? ॥
444 పురి శ్వా మృగయాఽగామీ, సూచకోక్తి గృహాంతరే।
ఉజ్జృంభతే వేమ ! వేశ్యా, దర్శనే తు విట స్తథా ॥
445 వేమ ! కంబూక లాభాయ, నిర్గతే మానవే తదా ।
శ్వాత్తి తండులకండోలం, వైశ్యవిత్తం తథా ఖలాః ॥
446 శక్తోఽహ మితి వే మేహ, యది మన్యేత తత్ర్పథా ।
శూన్యా భవతి ప్రాగ్దుష్ట, కర్మోద్ఘాట్య హసంతి హి ॥

441 కడుపునిండఁ దవుడు గంపలోఁ బెట్టక, చన్ను ముట్టనీక తన్ను గేద ।
వారకాంత లెట్లు వలతురో యూరక, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
442 తోటకూరకైన దొగ్గలికైనను, తవిటికుడుముకైన ఁబవుడుకైన ।
కావ్యములను జెప్పు కవు లెల్ల ధనపరుల్, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
443 టంక మతుక కున్నఁ బొంకంబుగా రాదు, స్వర్ణభూషణంబు జగమెఱుంగ।
భటుఁడు వెంటలేక ప్రభువు శోభించునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
444 చాడిగాని మాట చావిడి లో నిక్కు, వేటఁబో శునకము వీట నిక్కు ।
వేశ్యఁ జూచు నపుడె విటకాఁడు నిక్కురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
445 తవిటకరయఁబోవఁదండులంబులగంప, శ్వానమాక్రమించుసామ్యముగను।
వైశ్యవరుని సొమ్ము వసుధ నీచుల పాలు, విశ్వదాభిరామ వినురవేమ !॥
446 ఓపఁ గల్గుదు నని యొక్కింత మినికిన, నున్న వాని కూడ సున్న జుట్టి ।
మూల ఱంకు లాగి గేలిసేయుదు రయా, విశ్వదాభిరామ వినురవేమ !॥

447 "విస్మరా"మీతి వా వేమ!, భావయన్ సుజనో హృది ।
ఉచితాం ప్రత్యుప్రకృతిం, కుర్వన్ ప్రాప్నోతి గౌరవమ్ ॥

448 వే మార్హానమయే కార్యం, సహసా యది కుర్వతే ।
విషమం స్యాద్ధి గోతుంబ,శలాటుగ్రహణం యథా॥

449 "నాస్తీ"త్యభాషయన్, వేమ! నిషేధ మపి చాబ్రువన్ ।
అశోచన్ హృది "నాత్మీయ", మితి దత్వం వదాన్యతా ॥

450 కామచింతావశో వేమ!, మదాంధ స్త్వం న పశ్యసి ।
నిష్ఠాం చ నియతిం త్యక్త్వా, తమ శ్చిత్వా పరం భజ ॥

451 ఫలాభిరహితం కార్యం, కర్తుం నేచ్ఛంతి మానవాః ।
యది సాధుఫలం వేమ!, పరే ముద మవాప్నుయాత్ ॥

452 అన్యచింతావ్యథా జ్ఞాత్వా, జతుకస్పర్శవత్ జగత్ ।
విస్మృత్య సంతతం వేమ!, ఆత్మారామ స్సదా భవ ॥

---

**447** మఱతునేమొ యనుచుమదినుజనుం డెప్డు, నెవరొనర్చు మేల దెంతయైన।
మారుమేలుఁ జూచి మర్యాదఁ గాంచును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**448** చేయఁదగిన వేళఁ జేసెడి కార్యంబు, వేగపడియొనర్ప విషమ మౌను ।
బుడమకాయచేదు ముదిసిన తీఁపయా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**449** అరయ నాస్తి యనక యడ్డు మాటాడక, తిట్టు వడక మదినిఁ గొట్టు కొనక।
తనది కాదనుకొని తాఁ బెట్టు నది పెట్టు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**450** కామచింతఁ జిక్కి కనుగాన నేరవు, నిను నిష్ఠ విడిచి నియతి మీఱి ।
తామసంబు నడచి తన్మయ మందరా, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**451** ఫలములేని కార్యములు సేయ నొల్లరు, కలజనంబు లెల్ల నిల నిజంబు।
ఫలముమంచిదైనఁ బరమందు ముదమొందు, విశ్వదాభిరామ వినురవేమ! ॥

**452** ఇతరచింత లన్ని వెతలని మది నెంచి, జతుక మంటురీతి జగముమఱచి ।
సతత మాత్మయందె సయ్యాట లాడుము, విశ్వదాభిరామ వినురవేమ! ॥

453 పశుజాడ్యనివృత్త్యర్థం, "శక్త్యై పశుబలిం దిశ।
ఇతి బ్రువంతి వే మూఢాః, యతోఽయం కిం స్వభుక్తయే॥

454 "గురౌ ప్రాప్తే త్వాత్మవిద్యాం, జానా"మీతి వృథా జడాః।
కాలం నయంతి వేమైతదంతరే ప్రపతే త్తనుః॥

455 కాశీగయాప్రయాగాశ్చ, కాంచీం చ మధురాం తథా।
సేతుం వీక్ష్యాపి వే మేహ, విష్ఠితుల్యా హ్యసంస్కృతిః॥

456 భోగవాంఛాపరో వేమ!, అసమీచీనవి న్నరః।
ద్రోహాత్ పరాన్ దూషయితుం, యతమానో వినశ్యతి॥

457 ఆర్భటీ వేమ! 'నాస్తీ'తి,చాజానన్ జ్ఞానినం నరః।
దాంబికస్య వశో భూత్వా, తదంతే ప్రాప్నుతే శ్రమమ్॥

458 జ్ఞాతాత్మాయాం వేమ! స్వాపత్తౌ, తద్వారయితు మిచ్ఛతి।
నరః కథంచిత్ సంశ్రీణ్వాన్, న వేత్తి నరకవ్యథామ్॥

---

453 దొమ్మ మాయ కొఱకు నమ్మువారికి వేఁట, లిమ్మ టంబ్రదేమి దొమ్మతెవులొ।
అమ్మవారిపేర నందఱుఁ దినుటకా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

454 గురువుఁగలుగ నాత్మగుఱు తెలియంగెదనని, కాల మెల్ల రిత్త గడుపుచుంద్రు।
గురువు దొరకు నపుడు కూలును దేహంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

455 కాశి మధుర కంచి గయ ప్రయాగలు సేతు, వాసతోడ వీని నాత్మఁ జూచి।
వాసనల నెఱుఁగమి వట్టి వెట్టి విధంబె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

456 భోగవాంఛచేతఁ బొలు పేదొ యెఱుఁగక, ద్రోహబుద్ధి నొరుల దూరుటకును।
సాహసించు వాఁడు సర్వదా చెడునయా, విశ్వదాభిరామవినురవేమ ! ॥

457 ఠీవి లే దటంచు డెందంబులో నెంచి, జ్ఞాని నెఱుఁగలేని మానవుండు।
డాంబికునకు లొంగి డయ్యును గడపట, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

458 తనవిపత్తుఁ దెలియఁ దప్పించుకొనఁ జూచు, నెట్టిమనుజుఁడైన నెట్టులైన।
నరకబాధ వినుచు నరయఁ డా ధర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ !॥

459 స్త్రీరూపం కాముకా వీక్ష్య, కామాగ్నౌ నిపతంతి హి ।
సంతతం వేమ! సమ్మోహాః, కరోతి బహుధా రతిమ్ ॥

460 ససర్జాహో! స్త్రియం బ్రహ్మా, మహాభూతసమాం నృణామ్ ।
యో వేమ! నారీమాయాయాం, న పతేత్స న దృశ్యతే ॥

461 పట్టాభిషేకం రామస్య, కైకా ధ్వస్తవతీ పురా ।
సీతా లంకాపురీం వేమ!, కౌరవాన్ ద్రుపదాత్మజా ॥

462 స్త్రీ పుంశుక్లాత్ గర్భిణీ స్యాత్, ఆక్షీబేన రసం తథా ।
యది వేమ! జ్ఞానయుక్తా, బుద్ధిర్ధత్తే న కిం జగత్ ॥

463 వేమానధీతవిద్యానాం, న సౌఖ్యాని భవంతి హి ।
అధీతవిద్య స్సరసః, విద్యావాన్ భవ మర్మవిత్ ॥

464 స్థానవేత్తానుకూల్యేన, కథం చిత్ప్రాప్నుతే ఫలమ్ ।
వేమ! భావానభిజ్ఞో హి, కథం వేత్తి పరం జనః ॥

---

459 పచ్చదనముఁజూచియిచ్చను గాముకుల్, చిచ్చులోఁ బడుదురుక్షితితలమున
నిచ్చగలుగఁ జేయు నెచ్చుగా మోహంబు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

460 ఔర! యాడుదాని నా బ్రహ్మ సృష్టించె, బురుషపాలిటి పెనుభూత మట్లు ।
దానివలనుబడని వానిని గాంతుమే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

461 కైకపుట్టి చెరిచెఁగా రాముపట్టంబు, సీతపుట్టి లంక చెరిచెఁ గాదె? ।
కౌరవులను జెఱిచెగద ద్రౌపదీదేవి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

462 నరునిబిందువునకు నాతిగర్భముఁ దాల్చు, రాతియుప్పుచేత రసముఁగట్టు ।
బుద్ధిఁదెలివియున్న భువనముల్ దాల్చదా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

463 చదువుఁజదువకున్న సౌఖ్యంబులునులేవు, చదువుఁజదువునేని సరసుఁడగును ।
చదువు మర్మ మెఱిఁగి చదువంగఁ జూడుము, విశ్వదాభిరామ వినురవేమ! ॥

464 తావుఁ దెలిసి నతఁడు తా వీలువెంబడి, నేవిధముననైన నిరవుఁ జేరు ।
భావ మెఱుఁగకున్నఁ బరమెఱుంగుటయెట్లు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

465 అజానంతో౽ వేమ! మర్మ, మత్తచిత్తా నిరంతరమ్।
నశ్యంతి చిత్తలౌల్యేన, అభక్తో వేత్తి కిం పరమ్?॥

466 వేమ। నిర్దయచిత్తస్య, చండాల స్సంతి కే ప్రజా।
యది వర్తేత నశ్యేత, న ధూర్తానా మభిజ్ఞతా॥

467 స్త్రీసంగాయ సుతో౽పత్త్యై, వ్యథతే వేమ! మానవః।
ఉన్మాద స్తు మహాంస్తస్య, ధత్తే శిరసి భూశిలామ్॥

468 యది ధ్యాయే ద్ధృది శివం, న హాని స్తస్య విద్యతే।
పరం చ సిద్ధ్యతే వేమ!, ధృతనిష్ఠ స్సుఖీ భవ॥

469 పరాభ్యుదయ ముద్వీక్ష్య, సర్వదా వేమ! కాకవత్।
అధమో నిష్ఠు రోక్తి స్స్యాత్, మృత్తుల్యం తస్య జీవనమ్॥

470 బాల్యాత్ప్రభృతి యత్కర్మ, కృతం తత్ బాలవృద్ధయోః।
పరియాతి వృద్ధిం వే నేకం, రోదస్యాం పశ్య ధీరధీః॥

---

465 మత్త చిత్తులు తమ మర్మంబుఁ దెలియక, చిత్తచలనమంది చెడిరి భువిని।
బత్తిలేనివాఁడు పరమాత్మ నెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ!॥

466 మనసున దయలేని మాలకొడుకు నొద్ద, జేరియున్న ప్రజకుఁ జేటు నిజము।
పెద్దతనములేదు పెంకెల కెపుడును, విశ్వదాభిరామ వినురవేమ!॥

467 సతులఁగవయుటకునుసుతులబడయుటకు, వెతలబడుటయెంతొవెఱ్ఱితనము।
నేల నున్న రాయి నెత్తి కెత్తిన యట్లు, విశ్వదాభిరామ వినురవేమ!॥

468 హాని కలుగఁబోదు హరు మదినెంచెడు, వానికబ్బు పరమువసుధయందుఁ।
బూని నిష్ఠ మీఱి పొచలక యుండుము, విశ్వదాభిరామ వినురవేమ!॥

469 పరుల మేలుఁజూచి పలుగాకి వలెనెప్డు, వట్టి మాటలాడు వాఁ డధముఁడు।
అట్టివాని బ్రతుకు టదియేల మట్టికా?, విశ్వదాభిరామ వినురవేమ!॥

470 చిన్ననాటినుండి చేసిన కర్మంబు, పిన్నపెద్దలకును పెఱిగి వచ్చు।
మంటి మింట నడుమ మతినిల్పి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ!॥

471 న్యాయోద్ఘాటనవేళాయాం, యది ధర్మం త్యజే న్నరః ।
పాపీ స్యా ద్వేమ! త ద్దైవం, సాహాయ్యం ధర్మవాదినః ॥

472 నీతిజ్యోతి ర్విహీనం స్యా, త్కథం వేమ! వినిర్మలమ్ ।
కథం పరం చ సిద్ధ్యేత, న ధనేన పరం లభేత్ ॥

473 నీతి ముద్ఘాట్య వేమాఖ్యః, పాతకాని న్యషేధత ।
అగాధతత్త్వం లోకానాం, వేమ! సమ్యక్ న్యబోధయత్ ॥

474 అభాషంతం పరే వేమ!, న శ్లాఘంతే తతో బుధః।
ప్రతిష్ఠాం కీ వదే న్నిత్యం, భాషాపాౖముఖ్యావి చ్ఛివః ॥

475 మర్యాదాక్రమ ముల్లంఘ్య, యది వర్తే ద్విప ద్భవేత్ ।
సదా నాప్నైతి సా వేమ!, దుఃఖం చ న నివార్యతే ॥

476 వేమ! గంధబిడాలస్య, చర్కే కిం గంధసౌరభమ్?।
కిం తన్మహాత్వం మేదిన్యాం, బ్రహ్మచేష్టా నిరర్థకాః ॥

---

471 తగవు దీర్చువేళ ధర్మంబుఁ దప్పిన, మానవుండు పాప మూనియుండు ।
ధర్మమునె పలికిన దైవంబు తోడగు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

472 నీతి జ్యోతి లేక నిర్మలం బగు నేది, యెట్లు కలుగు పర మ దెంతదైన ।
ధనముఁ గల్గియున్న దైవంబు కల్గునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

473 నీతిఁ దెలియఁ జెప్పి నిజముగ వేమన, పాతకముల నెల్లఁ బాఱఁ బెట్టె ।
లోతు తత్త్వ మరసి లోకులకును జెప్పె, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

474 భాషలాడకున్నఁ బరులు మెచ్చరు కాన, భాష లాడవలయుఁ బరువుఁ జూచి
భాషపరువు తెఱఁగుఁ బరమాత్ముఁ డెఱుఁగును, విశ్వదాభిరామ వినురవేమ! ॥

475 వావివర్తనలును వరుసలు మర్యాదఁ, దప్పినడిచె నేని దగులుఁ గీడు ।
వదలదెవుడుఁ దాకు వందురఁ దప్పదు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

476 పునుగుపిల్లి కేల వుట్టించె వాసనల్, దానిమహిమలేమి ధరణిలోన ।
బ్రహ్మచేత లన్ని పాడైన చేతలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

477 వేమాహ మితి యద్వాక్యం, తద్ధి త్వ మితి చోచ్యతే।
అహం త్వం చేతి నిష్ఠాతః, అహం త్వం త్వ మహం ధ్రువమ్॥

478 చిత్రదీపసమాం చింతాం, వ్యాదస్య విమలం మనః।
మిత్రం కృత్వా శత్రుగుణాన్, ముక్తి ర్వేమ! నివారణమ్॥

479 సూక్ష్మం వేమాచలం తత్త్వం, అనుభూత్యేకవేదితమ్।
వక్తుం దర్శయితుం చాపి, న శక్యం ద్యోతతే హృది॥

480 అదృష్ట్వా ప్రాణిషు శివం, కో యోగ ఇతి యోగినః।
కథయధ్వే యథా భోగే, కిం యోగేఽస్తి తథా శివః॥

481 పరేతరాడ్వశో మార్గ, మపశ్యన్ వేమ! సవ్యథః।
య స్స ఉన్మత్త ఇత్యుక్తః, వ్యథతే కిం సతీవశః॥

482 లక్ష్యం కృత్వా నాసికాగ్రే, సమ్యగ్దృష్టే వశం భవేత్।
కాశీం కంచీం చ సంద్రష్టుం, వేమ! కిం నిష్ఫలశ్రమైః?॥

---

477 "నేననువచనంబు నీవనఁగా వచ్చు, నీవు నేననఁబడు నిష్ఠఁదెలియ।
నేను నీవె నీవె నేనన వచ్చురా, విశ్వదాభిరామ వినురవేమ!॥

478 చిత్రదీపమువలెఁ జింతను దిగఁద్రొక్కి, మిత్రముగను మనసు మెలకువెఱిఁగి।
శత్రుగుణము లెల్ల సాధించుటయె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ!॥

479 అచలతత్త్వ మనఁగ ననుభవగమ్యంబు, చూపి చెప్పరాదు సూక్ష్మమదియె।
మదికిఁ దోఁచుఁ గాని మర్మ మెన్నఁగ రాదు, విశ్వదాభిరామ వినురవేమ!॥

480 ప్రాణులందు శివుని భావింప నేరక, యోగమందు రేల? జోగులార!।
యోగమందుఁ గలదె? భోగమం దున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ!॥

481 పితృపతికిని జిక్కి పెనుత్రోవఁ గానక, వెతలఁజిక్కువాఁడు వెఱ్ఱివాఁడు।
సతులవలలఁ జిక్కి సంతాపపడనేల, విశ్వదాభిరామ వినురవేమ!॥

482 నాసికాగ్రమందు నయముగా గుఱినిల్పి, వాసిగానుజూడ వశ్యమగును।
కాశి కంచులఁ గనఁ గడగండ్లు పడనేల, విశ్వదాభిరామ వినురవేమ!॥

483 వేమ ! కుక్షింభరత్వాయ, దోర్బలం వంశవర్తినః ।
తదేవ యోగినో లభ్యం, చే ద్దివ్యానందదాయకమ్ ॥

484 ప్రతిష్ఠాప్య ధ్వజాన్, వేమ ! విక్రమాఢ్యో మహీతలమ్ ।
యది శాస్తే న్నాస్తి ముక్తిః, యతస్వ విమలాధ్వనే ॥

485 వేమ ! కూటవచాం స్యుక్త్వా, యది భేదం కరిష్యసి ।
తత్త్వం న జ్ఞాయతే సమ్యక్, జ్ఞానసారం వి నావ్యయమ్ ॥

486 హృజ్జాతం గుణసంజాతం, ఛిత్వా యత్నేన నిస్పృహః ।
సమ్య గ్బుద్ధిం సదా వేమ !, విశుద్ధ్యే న్ముక్తి రేవ సా ॥

487 నాదమేవ శ్రోత్రజాతం, ఆకాశం వేమ ! కథ్యతే ।
నేత్రదృష్టా కళా జ్వాలా, నాసా వాయు శ్చ ముక్తిదః ॥

488 చర్మమాంసం మృతపశోః, గృధ్రోఽత్త్యాక్రాత్య వై బలాత్ ।
వేమ ! తద్గృధ్రసంకాశః, క్రూరో గజపతిః ప్రభుః ॥

---

483 దొమ్మరాట వానిదోర్బల మెల్లను, పొట్టకూటికొఱకె పట్టినదగు।
అదియెయోగికమర నానంద మందఁడా, విశ్వదాభిరామ వినురవేమ !॥

484 శీవిమిగులఁగల్గి టెక్కెమ్ము లెత్తించి, ఊళ్లనేల ముక్తి యుత్తదియగు ।
మంచిత్రోవకొఱకు మహాని యత్నింపుము, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

485 టక్కుమాటలాడి చిక్కులఁ బెట్టిన, నిక్క మెఱుఁగఁబడదు నిర్వహింప ।
చక్కనైనజ్ఞానసారంబుఁ దెలియుమీ, విశ్వదాభిరామ వినురవేమ !॥

486 చలముఁబట్టి మదిని జనియించుగుణముల,తతినిఁద్రుంచి వేగదమకముడిగి।
సతముగాను బుద్ధి సవరింప నదె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

487 చెవులలోనఁబుట్టు రవమె యాకాశంబు, కన్నులఁగనునదియె కళలజ్వాల ।
ముక్కులోనిగాలి ముక్తికిఁ ద్రోవయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

488 చచ్చిపడినపశువు చర్మంబు కండల, పట్టి పెఱికి తినుసు పరగ గ్రద్ద ।
గ్రద్దవంటివాఁడు గజపతి కాఁడొకో, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

489 "వైశ్యా" ఇత్యస్తి వార్తైకా, నాస తే దస్యవ స్తతః ।
ప్రవీణత్వాని వే హ్యేషాం, కిం బ్రవీమి మహీతలే?॥

490 అహింసా పరమో ధర్మః, యే వేమ! ప్రాణిఖాదినః ।
తేభ్యోఽపి మృతపశ్వాశీ, వరం చండాల ఏవ హి ॥

491 పతిధిక్కారిణీ జాయా, సూకరీ కేవలం తయా ।
చరిష్ణు స్సూకరో వేమ!, తౌ లుంఠేతే హి కర్దమే ॥

492 ప్రాగ్బోద్ధారో వినష్టా స్స్యుః, పున ర్బ్రూహీతి నో శపేత్ ।
స్పష్టీకర్తు మపి ప్రోక్తం, వేమ! న జ్ఞాయతేఖలు ॥

493 మద్యాయేవ న తక్రాయ, దాస్యం తే దేశికాయ చ ।
కుక్కుటాయేవ వే మార్గం, పుణ్యాయ స్త్రీగణాయవత్ ॥

494 ధృత్వా మేషగళం వేమ!, పిబే ద్యది గళస్తనమ్ ।
న క్షున్నివృత్తి ర్వ్యర్థాశా, లోభియాఞ్చా తథా వృథా ॥

---

489 వైశ్యుల మనిచెప్ప వార్తమాత్రమె కాని, దొంగ లింతకన్న దొరక రెందు ।
నేలమీఁద వీరి నేర్పుల నేమందు, విశ్వదాభిరామ వినురవేమ !॥

490 హింసఁజేయకుంటయే ముఖ్యధర్మంబు, ప్రాణిఁ జంపితినెడువారికన్న ।
చావుపశువుఁ దినెడు చండాలుఁడే మేలు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

491 పతికి మారుబల్కు పడఁతియే పందిరా, మీఱిన సతితోడ మెలఁగు పంది ।
పంది పంది గూడి పడి దొర్లవా రొంపి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

492 మునుఁదెలిపినవారు ముదనష్టపై రిల, తిరిగి చెప్పి తనుచుఁ దిట్ట వలదు।
తెలియఁ జెప్పిన మఱి తెలిసికో లేరయా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

493 కల్లు కిచ్చునట్లు చల్లకీయఁగలేరు, కోళ్ల కిచ్చునట్లు గురువు కీరు ।
పాలఁతుల కిడు నట్లు పుణ్యాని కీయరు, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

494 మేఁక కుతుకఁబట్టి మెడచన్నుఁ గుడువఁగా, నాకలేలమాను నాసగాక ।
లోభివానినడుగ లాభంబు కలుగునే?, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

495 స్త్రీమేళాయ దదత్యర్ఘం, పుంమేళాయ న కించన ।
వ్రణస్థా మక్షికా వేమ!, పుష్పే కిం జాతు వర్తతే?॥
496 ఆది స్సోమః కుజ స్సౌమ్యః, గురు శ్శుక్ర శ్శనిః క్రమాత్ ।
దినసంజ్ఞాకరా వేమ!, ఏకరూపం దినం భువి ॥
497 దక్షే వే మాక్షికే ప్రాప్తే, గుణే పరిచలతే హయః ।
స్వకీయదేహస్య గుణం, న జానాతి కుతో హయః ॥
498 స్థాతుం శక్య స్తరావగ్ని, రగ్నౌ తు న తథా తరుః ।
వృక్షస్థితాగ్ని మర్యాదాం, సంసారీ వేమ! సంచరేత్ ॥
499 వర్షాభావా ద్భవే త్క్షామః, వర్షాధిక్యేన సంప్లవః ।
క్షామం చ సంప్లవం వేమ!, క్రమా జ్జానీహి తత్త్వతః ॥
500 మేఘావరోధో వేమార్కం, వ్యాప్నోతి హి తథా స్థిరమ్।
చిత్తావరోధ స్సంరోధో, మహిమానం చ విస్మృతేః ॥

---

495 పెంటిమేళమునకుఁ బెద్దగా నిత్తురు, పోతుమేళమునకుఁ బోక సేరు ।
పుండు మునరు నీఁగ పువ్వుపై వ్రాలునా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
496 అది సోమ భౌమ మాదిగాబుధుఁగూడి, గురువు శుక్రశనియుగుఱుతులెన్ని।
ఎన్ని దినము లైన నిలనొక్క రూపమే, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
497 గుఱ్ఱమునకుఁదగినగుఱుతైనరౌతున్న, గుఱ్ఱ మిలనునడుచుగుణముగల్గి।
గుఱ్ఱము తన యొంటి గుణమేల దెలియుదో, విశ్వదాభిరామ వినురవేమ !॥
498 మ్రానులోన నగ్ని మఱి యుండఁగా వచ్చు, నగ్నిలోన మ్రానుకలవియగునె,
మ్రానులోని యగ్ని మర్యాద సంసారి, విశ్వదాభిరామ వినురవేమ ! ॥
499 వానకురియకున్న వచ్చును క్షామంబు, వానకురిసెనేని వరద పాఱు ।
వరద కరువు రెండు వరుసలో నెఱుఁగుడీ, విశ్వదాభిరామవినురవేమ !॥
500 మేఘ మడ్డమైన మిహిరుని జెఱుచును, చిత్త మడ్డమైన స్థిరముఁ జెఱచు ।
మఱపు లడ్డమైన మహిమంబుఁ జెఱచురా, విశ్వదాభిరామ వినురవేమ ! ॥

# సవరణ

## పూర్వార్ధ శ్లోకములు

11 ముహ్యతే - ముహ్యతి 12 స్వగుణా ననివర్తన్తే, శ్వపుచ్ఛంయాతి నార్జవమ్। ప్రగల్భావేమ! నిక్షిప్య, విక్రీణాతి పిటే పతిమ్ 20 ద్వేమ! - ద్వేమ! 35 నాస్తి యచ్ఛితుం - దాతుమేవన 37 దహాతిహి - దహాతీహ 45 శ్చస్థాపితుం - స్త్థా పితుమ్ 46 శక్యం - శక్యా, శ్లాఘోక్తిః - శ్లాఘోక్తిః 48 తేఽర్చ్యం - త్యర్చ్యం 50 శక్నుతే - శక్యతే, నష్టి - నశ్యేత్ 56 విధిర్విపది నోద్ధరేత్ 63 సతుగ్రసతి కింవిషమ్? 81 వినాం - వినా 84 భరోవేష - భరిర్వేష 85 శిలా నమధ జీవినః! 91 నష్టి - నశ్యేత్ 93 తిష్ఠతేచిత్తం - తిష్ఠతిమనో 98 అజన్మ ప్రభృతీ - జన్మనః ప్రభృతీ 100 విందేత్ - భుఙ్క్తే 101 ఋషయో - ఋషయః 105 సంచయ- సంచినో 106 చేరతుః - చారిణౌ 108 లభతే - లభ్యతే 110 యావాన్కష్టః - యావత్ కష్టమ్, శ్వరః - శ్వరామ్ 112 స్యాద్వేమ! - స్యాద్వేమ! 124 స్వః పామరో నశ్యతి ధ్రువమ్ 134 నభూయతే - భవేన్నహి 135 ధఃప్రాపణేన - ధఃప్రాపణాత్స్యాత్, ద్యతే - దయః 139 బంధాః - బన్ధః 142 భిన్నోపి - భిన్నాపి 144 కేశాశ్చ - కేశాంశ్చ 146 శ్యాఖాః - శాఖాః 147 భాషయన్ - చబ్రువన్ 150 దుష్క్రియమ్ - దుష్క్రియః 166 క్రమతి - క్రామతి 167 ఫణిః - ఫణీ 175 తర్క - స్తర్క 184 దంశతే - దంశతి 192 మహిమం - మహిమ 194 శక్నువాన్ - శక్నువన్ 199 చింతతే - చింతతి 205 కింరుదన్తి, మేషా వేమ! స్వచేతసి 206 శపన్ - శపేత్, పిటగం,విక్రీణాత్యసతి పతిమ్ 209 అర్చంతే - అర్చన్తి 215 తేఽప - తేప 217 గుణం - గుణో 219 కింవేమ!, అ - కిం దుఃఖా,దా 220 వివేకం - వివేకో 223 పథం - మార్గం 226 భరః - భరిః 236 కింత్వం భ్రమసి కుక్ష్యర్థం? 239 ముహ్యంతి ఖలు పండితాః 241 దాస్యా స్సంగో - దాసీసంగో 246 కింపుత్రకపదాష్టనమ్? 252 సంస్థాతుం భూనభో మధ్యే 253 శక్నువంతే - శక్నువంతి 255 త్యజంతేయే - యేత్యజన్తి 256 వర్తే - తిష్టే 264 గతిః కర్మసు నేకతే 270 వర్తే - తిష్ఠే 271 వష్టం - వష్టః 272 వేమ! ప్రస్నాతికింపయః? 278 స్వర్ణాంగింనాయదీక్షేత 283 మహాబలమ్- మహాబలః 295 బధ్వాగృహోత్తమమ్ - నిర్మాయ మందిరమ్ 302 జయతే - జయతి 315 పాలతే - శాసతే 319 భ్యష్ట - భ్రష్ట 320 వేమ! ప్రవ్రజతేముక్తిః 322 గుణం ఘనమ్ - గుణోఘనః 327 భోగం - భోగో, కాగతిః - సద్గతిః 333 శ్లాఘేయురితి - శ్లాఘేరన్నితి 334 స్నావ - స్నవ 336 షాస్త్రిన్చ -

షూంస్త్రీంశ్చ 337 నష్టి - నశ్యేత్ 339 [పూ] అన్నంపత్రం పూర్ణకుక్షిః, వర్జయే ద్వేమ ! కింఫలమ్ ? 340[పూ] పత్రమన్నంమధార్తేహి, భుక్త్వైదైవార్పితంయథా'
346 వాఞ్ఛన్తే - వాఞ్ఛన్తి 347 తిష్ఠన్తే - తిష్ఠన్తి 349 పరే జీవత తాంవినా।
357 తిష్ఠతే - వర్తతే 366 విభ్రంశతిగుణః కృథా 367 నశ్యతే - హస్యతే
374 గ్లాప - గ్లప 375 [ఉ] అమునేర్వేమ ! మోహాస్తు, నాపయాన్తిహి సర్వదా॥
377 చింతంతే - మన్యంతే 380 సంకూజతి యథా తథా 381 కృశశ్వా - కృశశ్వా 383 పుణ్యాం - పుణ్యం 386 అద్యవా శ్వః పరశ్వోవా 387 అగచ్ఛతి- ఆజగామ 388 త్, వేమ ! సిద్ధ్యతితద్భువి 391 పూరితః - పూర్తిదః 394 నిం పన్తే - నిందన్తి 397 బలః— బలమ్ 402 రక్షతే - రక్షతి 409 న్సోష్టి - న్విష్యాత్
415 యథోచితమ్ — వివేచనాత్ 418 హసంతే - హసన్తి 419 తేనసః - తేనసః
421 [ఉ] యదిస్యాద్వేమ ! నిరయం, నిధనంచకథంత్యజేత్? 425 ముండిని — ముండాని, సంకల్పానిచ — సంకల్పాశ్చాపి 427 చరతే — వర్తతే 429 నవేత్తిహి— లభేతకిమ్ ? 431 [పూ] శివోఽస్తీతి శిలావేమ ! నమస్యంతో జడాజనాః 432 శ క్నుతే - శక్నుతే 437 శూద్రీ - శూద్రా 438 [ఉ] వధ్యోకిమస్తి కాకేషు, 439 యచ్ఛ్యతే — పతతః 440 సిల — సమ్యక్, వేషాణి - వేషాశ్చ 442 [ఉ] కించి ద్వ్యాయామకృన్మల్లాత్ 444 సమర్పంతే - సమర్పన్తి 446 బ్రుపంతే - బ్రుపతే
450 పుంశ్చలీవేమ ! కుర్వన్తి, జారేరక్తింస్వభర్తరి 451 అత్మతత్త్వం శరీరస్థం, వేమాజానఙ బహిఃపృథక్। అస్తీత్యన్వేషణేనాలం 452 పుమాన్ - నరాఙ 453 ఛన్నస్తథైవచ - ఛన్నంతథైవహి 454 నష్టి — నశ్యేత్ 456 సర్వోప్యే - భపంత్యో
457 నృచేష్టా - నుశ్చేష్టా 458 బుద్ధిర్నిదానం - బుద్ధిః ప్రశస్తా, ప్రధానోవిమలో గుణః 459 నాధిక్య - నాధిక, కథంజ్ఞేయోచ్ఛసిచతా ? 463 జాసిధ - జాసిత
473 నానతేవేమ ! — వేమ ! నాసాతే 475 వర్ధితంనింబం - వర్ధితోనింబః, మధు రంతథా - మధురస్తథా 478 వాటిగః - వాటగః 479 యజమానిని - స్వామిని క్వచిత్ 480 [ఉ] వేత్తిమర్మాత్మసాత్కర్తుం, 482 (ప) లంజెగతితి - పందిగ జము 486 తత్రాత్ర— సర్వత్ర 491 విస్మరత్యఖిలం వ్రతమ్ 492 (ఉ) వేమ ! కాంక్షతితన్వంగీం 493 చేక్ష్య - వీక్ష్య - 495 లభేత్ - భవేత్ 497 తేఽనకృత్- తిహచ 498 షన్మత - షణ్మత.

## ఉత్తరార్ధ శ్లోకములు

4 లభేత్తత్ర - లభేత్రాత 6 యావత్స్వంవేమ ! నేక్షేత, తా, వపుషాల - వపుషాక- 8 భరోయతిః - భరిర్యతిః 11 తత్తు - తాంతు 13 పచిత్వా - సంపచ్య 15 వేమ! గర్హంతికేవలమ్ 24 శిరోనం — శిరస్సం 25 కుక్కుటఃఖలుకూజతి 26 (ఉ) అర్థోఽనువర్తతేతేషాం - వాచంవేమేతరేజడాః 28 శ్రుతిస్మృతీతిహాసానాం - టీకాం

కుర్వంతినీరసాం, ఎస్త్రృత్యసారంవేదాంత్ర, వేమేహసవదంతికిమ్ ? 32 యద్యస్వ్య వకరశ్చేకు, వనేవేమ ! సత్ప్రసః,నశ్యేదక్షే 37 భుంజే - భుక్తై 42 పథ మాత్మవి - పథఆత్మని 43 కరణౌ - కరణం 49 తృప్యత్రే - తృప్యతి 50 శామ్యత్రే- శామ్యతి 53 కృత్త - దత్త 54 దదత్య - దదాత్య 73 నిస్స్వహృద్రియతేపతిమ్, రాశి — పుంజ, భక్షతేయథా - ఖలుభక్షతి 74 నశేకిరేనాశం - నశేకుర్నాశంహి 76 (ప) పలుకనున్న — పలుకుచున్న 78 శ్లాఘితజరఠాంకథమ్ ? 80 గళితే - శిధిలే పీతస్తనే - పీతేస్తనే 83 వేమ ! వర్తేత్ - చరేద్వేమ ! 89 గురుణాచ న తర్కయేత్ 91 అగ్రోతావచసా 95 భావాశ్రేష్ఠా - భావాశ్శ్రేయః 98 వేమాహో — వేమస్త్ర, శుభాశుభౌ - శుభాశుభే 99 జితాత్మ - జితాత్మా 100 వసతేన - వసేన్నహి 101 త్యజత్రే— జహాతి, [ప] మానని- మానిన 102 ద్విగుణం- ద్విగుణం 103 ఫల్గ్యాం- పల్గ్యాం, శోభంతి — శోభంతే 105 ద్వేమ ! సోతీవ - తసవైవేమ ! 108 వాత్రై - వాహై 109 దారిద్రే - దారిద్ర్యే, నష్టి - నశ్యేత్ 116 వర్తం - త్తష్టం 122 రక్షేవ- రక్షైవ 124 క్రియేత్ - స్థతః, దర్ధిభి- తార్థిభి 125 గచ్ఛతే— వర్తతే 127 దత్వా- దత్త్వే, తేకింవేమాప్న - త్యప్నకింవేమ ! 129 లజ్జాంత్యజతియోవేమ ! 131 సర్వ స్మిన్ ప్రాపితేచైక్యం, న్యూనాధిక్య - న్యూనాధిక 134 కుత్రచ - కుత్రచిత్ 139 గ్రంథయః - కీలకాః 141 కుష్ఠు - కుష్ఠ, [ఉ] భామాబాధేతసతతం 142 జుగు ప్సాకారి కామిన్యాం 152 రంజతే- రజతే 154 అర్ధః — అర్థం, ప్రాప్నుతే- ప్రాప్ను యాత్ 158 అన్యత్రదైవం స్మరతి 160 వేత్యజ్ఞో - వేత్త్యజ్ఞో 162 పుత్రకా - పుత్రకాః 165 రభసా - రభసాత్ 167 రూపా - రూప 171 పాపీపరసతీకాంక్షీ 176 సంతప్త్య- సంతప్య 178 యచ్ఛంతే- దదతే 182 స్ఫుటమ్దృష్టాస్సుశ్రేణిషు 185 భావయేత్ - భాసయేత్, దేహం - గేహం 188 శక్నువాన్ - శక్నువన్ 191 దంశతే - దంశతి 198 రక్ష్యే — రక్షే, ద్రాగ్మియేతావనాక్షమః 203 విద్యాత్విం పతిగౌరవమ్ ? 207 విప్రో,దదాతి భృశమాశిషః 208 బిభ్యంతిదంష్ట్రిణంసర్పం దృష్ట్వైమం 211 వేమ! గ్రసతిసానకిమ్?, 217 నలభ్యతి- నలభ్యేత 226 పతతే - పతతి 228 యువోక్తిమాన్ కింతపసి? 233 శ్చరతే- శ్చరతి 235 [ఉ] యేచరం త్యనుసృత్యేహ,వేమ! సిద్ధ్యంతి తత్క్రియాః 239 మన్యేత్ - మర్త్యే,న్నిజాదృష్టం- తభాగ్యం స్వం 240 ఏకమేవేతి - ఏకఏవేతి 242 జ్ఞానినం కర్మఠావేమ ! 244 తరోర్బోధం - తరుర్బోధం 245 జాయంతే - జ్ఞాయంతే 248 సద్గురుర్ముక్తిదర్శకః 250 మాప్నుతే - మాప్నుయాత్ 252 పత్నా- పత్న్యా 253 యదిన్యస్యత్యనాతపే 259 వ్యధిష్ఠ — వ్యధిష్ఠా 262 నష్టః — నష్టా 265 చింతాక్రాన్తస్య - చింతా యుక్తస్య 266 భవతే - జాయతే 269 తనుంవిస్మరతీహయః 270 స్వయంవిద-

విలోకయ 273 [ఉ] జగత్సాక్షి శివేశశక్తిః 275 సాంగనామ్ - చాంగనామ 276 ప్రతిభో – ప్రతిభః 278 గణికాయై - పణ్యకాంతా 281 భాగ్యేనలభ్యతేపుంసః 283 భవేత్ - ప్రజేత్ 284 చింతంతే – చింతంతి, ముద్ధరతే - ముద్ధరతి 289 పంచతే – పంచయేత్ 292 విమర్శంతే - విమృశంతి, భాషతే - భాష్యతే 295 వనే - వసే 298 శోభేతత్రిగుహైర్యుతః 307 నిత్యా - నిత్యా 308 నవాతా - సాదాతా 313 త్ర్యక్షీ - త్ర్యక్షీం,ప్రణవశ్చ - ప్రణవంచ, బోధతే - దృశ్యతే 315 మేషసంఘాతే - మేషీసంఘాతే 318 రక్ష్యే - రక్షే, ధీరతః - నిస్పృహః 320 యత్నాని - యత్నాహి 323 పచిత్వా - సంపచ్య 325 దంశతే - దశతి 332 ప్రాప్నుతే- ప్రాప్నుయాత్ 333 విముంచంతి జనాభువి 334 శక్తాఃకేవేమ! చింతయ 347 బుధః - తతః, వేమ ! తిష్ఠ, చిత్తే సంస్థాప్య సద్గురుమ్ 348 సన్వమా - నన్వహా 350 వౌషధీమ్- వౌషధమ్ 351 శక్నుతే- శక్యతే 353 పర్తేచ్చ- తిష్ఠేచ్చ 355 రథ్యాం- వీథ్యాం 360 రమేయమితి- రమేఽహమితి 361 మతాన్‌బహూన్- మతానిచ, దుఃఖంతే - శోచంతి 363 రంజతి - హృష్యతి 366 ఉద్వాహతే - యద్యుద్వహేత్ 369 స్థరయే - స్థరిణా, పురారయే- పురారిణా 372 దహంతేహ- దహంతీహ. 374 స్మరత్ - యతత్ 377 సర్వానిచ - సర్వాసిచ, యథా- తసో: 380 యథావర్ధేత్- యథైధేత, విద్యాత్క్రంగర్హితప్రహామ 384 నమయా- సమయా వీక్షయ - పశ్యతత్ 385 నశోచేద్ధి తత్రేహృది 389 బాధేద్ధి - బాధేత 397 ఇక్షుర్మా ధుర్య రహితో, నిస్సారఇతి 401 అపికుంభైర్వేమ ! వాంఛేత్, తత్ - సా 405 సిద్ధ్యంతే - సిధ్యంతి 412 భషంతే- భషంతి 415 ధర్మజః - ధర్మజో 418 ధర్మః పృష్ఠగతో వేమ ! 419 హేమాద్రీ - హైమాద్రీ 420 సంచరేచ్చయథాతథా 422 పరః - పరమ్ 424 యదినేక్షేతోప్తలతాం, నిర్గమే - నిర్గచ్ఛే, గుణమ్ - గుణః 428 [ఉ] వర్జయంత్యలసాభ్రాంతాః, కిమాస్తేమాంసఖండయోః 431వాంఛేద్వేమే హదంపతీ, వాంఛేతాం పుత్రకథనం 435 సిద్ధ్యతే - సిద్ధ్యతి 436 సజ్జనాన్ యది బాధేత 437 తారకోధర్మమార్గస్స్యాత్ 442 కుర్వంతే - కుర్వతే 449 నాస్తిత్రే కథయన్ వేమ !, మితిదత్తం, మితిదానం 455 ప్రయాగాశ్చ - ప్రయాగాంశ్చ 457 ప్రాప్నుతే - ప్రాప్నుయాత్ 458 స్వాపత్తౌ, తద్వార - చాపత్తౌ,తాంవార 464 త్రా ప్నుతే- త్ర్యాప్నుయాత్ 465 చిత్తలౌల్యేన,అ- చిత్తచాపల్యా,ద 466 నశ్యేత-నశ్యేద్ధి 467 సుతోపత్త్యై - సుతోత్పత్త్యై 468 [ఉ] పరంసిద్ధ్యతివేమేహ 472 త్వర్థం - ద్యది, కథంపరంతతస్సిద్ధ్యేత్ 473 న్యషేధత్ పాతకానిచ 474 అబ్రువంతం 475 చరేద్యదివిపద్భవేత్ 491 లుంఠతస్తాహికర్దమే 492 పునర్భ్రాతే భవానితి, నశపేత్పూర్వోక్తమపి 493 దాస్యంతే- దదతే, పుణ్యాయాపిస్త్రియైయథా 496 భాను స్సోమః 497 ప్రచలతే – సన్వర్తతే.

# విజ్ఞప్తి.

## పుట — పంక్తి

1–20 నుపగీయ - న్యుపగీయ 2-7 మరీరచత్ – మరచత్ 18 ఛందసి-చ్ఛందసి 21 వ్యనజ్జేత్ - ప్రాచీకటత్ 3–15 చింతయధ్వం - చింతయత 4-2 అధ్యాత్మ - అధ్యాత్మ 12 వ్యనజ్జన్ - జుఘుషః 5-8 గ్రంథమేవ - గ్రంధఏవ గృహీతమ్ - గృహీతః 18 ప్రజాంశ్చ - ప్రజాశ్చ 19 భూయాత్ - భవేత్ 6-1 రూపక - రూప 7-8 మృధా - ముధా 14 స్విద్యతే - స్విద్యతి 8-5 చతురిమా - చాతురీ 21 నిపాతయతి - న్యపాతయత్ 9-4 చారానాం - చారాణాం 10 విమర్శ యితుం - విమ్రష్టుం 15 తమాః - తమసః 20 ఆశీంషి - ఆశిషః 21 ప్రార్థయా వహే – ప్రార్థయావః 10–13 యితారౌ - యామాసతుః 15 దర్శయితారౌ– ఉద ర్శయతామ్ 11–14 తమో- తమసం, నివర్తయిత్వా- నివర్త్య 12-1 ప్రజాంశ్చ–ప్రజాశ్చ 6దేశీయో– దేశీయౌ 9 ప్రకటీకరణం–0 10 జనకంభవతి- జనకౌభవతః 11 ఉద్దిష్టం ఏతద్గ్రంథం– ఉద్దిష్ట ఏతద్గ్రంథః 13ఆంధ్ర్యా-ఆంధ్ర్యాం 15 వ్యన జ్ర్మ - విశదయామాస 22 భాగ్యాన్ – భాగ్యాని.

ధ-థ, శు-శృ,ం-మ్, పే-ప్రై, భ-భ్య, స్వ-స్వ, ద్వే-ద్వే, ప–ప్ర, బ-బ్ర, ఝ-జ్ఞ, ప-వ, న-స, త్వ్యే-త్వ్యే, క్ష్య-క్ష, ష్య-ష్ట, భ్య-భ్య, వా-వ్యా, గృ-గ్ర, ధాన్-ధామ్, ప్రై-ప్రై, యు-యొ, షి-షె, త్ర్య-త్ర్య, చి-ఛి, చ-చి, ష్య-ష్వ, ఘు-ము, యు-య, వే–వె, వు-పు, స్యై–స్యే, త్వా-త్వా, న వా-సవా, ఇట్టి లిపిదోషముల సరి చూచుకొనునది.

* సంస్కృతశ్లోకములకు పరిష్కృత నాగరలిపి గ్రంథమునుజూడుఁడు.

ఓమ్

శ్రీ వేమనయోగీన్ద్రాయ నమః

# వేమగీతా (ద్వితీయసహస్రమ్)

## సమూలమ్ (పూర్వార్ధమ్)

శ్రీ రా మ నృ సిం హ మూ ర్తి క వీ :—

శ్రీ వేమనయోగీన్ద్ర స్తుతిః

శ్రీ మత్సనత్కుమారాంశం, వేదవేదాంగవేదినమ్ ।
దిగంబరం కుమారాభం, స్తువే వేమాఖ్య యోగినమ్ ॥

3. సద్యోమోక్ష సంసిద్ధియోగః

1 బింబస్థా చేత్ స్థిరాదృష్టిః, మగ్నాస్యాన్మననే స్మృతిః ।
లగ్నం చిత్తం పరే లక్ష్యే, వేమ ! రక్షస్వ సర్వదా ॥

---

## గ ద్య మ్

ఇతి శ్రీ శతావధానిభ్యాం ఉభయభాషాప్రవీణాభ్యాం గద్వాల సంస్థానాస్థానకవిభ్యాం భాగవత భగవద్గీతా ద్యాంధ్ర పవిత్ర గ్రంథ రచయితృభ్యాం "మహాత్మాగాంధీ" ఇత్యాది సంస్కృత గ్రంథ కర్తృభ్యాం చ "శ్రీరామ నృసింహ మూర్తికవీ"తి ప్రతీతి యుతాభ్యాం గంధం శ్రీరామ మూర్తి, ఇట్టేంకి నరసింహమూర్తిభ్యాం ప్రణీతాయాం వేమగీతాయాం ప్రథమ సహస్రమ్

స మా ప్త మ్

---

వేమన పద్యములు (ఆటవెలదులు)

1 బిగియు దృష్టినెపుడు బింబమందుంచిన,మననమందునెఱుకమగ్నమగును ।
లగ్నచిత్తమమర రక్షించుచుండురా, విశ్వదాభిరామ వినురవేమ !॥

---

# అకారాది వేమన పద్యసూచిక (పూర్వార్థమ్)

# అకారాది వేమన పద్యసూచిక (ఉత్తరార్ధమ్)

శ్రీ మాతా పవర్ ప్రెస్ – భీమవరం.

# శ్రీరామనృసింహమూర్తి కవికృత గ్రంథములు.

1 శతావధానము :- (నూఱుగడ్డు ప్రశ్నలకు సమాధాన పద్యములు.) రు. 0-50

2 మణిరత్నమాల;- నూఱు వేదాంత ప్రశ్నలు, సమాధానములతో
శంకరాచార్య కృతశ్లోకములు, వానికి తెలుఁగు పద్యములు. రు. 0-50

3 ఆంధ్రపుష్పబాణవిలాసము:- కాళిదాసకృతశ్లోకములు,వానికితెలుగుపద్యములు. రు. 0-5

4 చాటువులు :- లోకస్వభావమునెఱిఁగించు నూఱుపద్యములు. రు. 0-50

5 తేటగీత భగవద్గీత :- (పూర్వగీత, ఉత్తరగీత) సమూలము. రు. 2-00

6 యథార్థరామాయణము :- (జీవయాత్ర) పద్యకావ్యము. రు. 0-50

7 శ్రీమదాంధ్రభాగవతము :- వ్యాసకృత సంస్కృత మూలమునకు సరియైన ఆంధ్రానువాదము. పద్యకావ్యము. రాయల్ సైజున సుమారు 1500 పుటలు 10 వేలపద్యములతో 12 స్కంధములు 5 సంపుటములుగ ప్రచురింపఁబడినది. ప్రభుత్వానుమతి పొందినది.
5 సంపుటముల పూర్తిసెట్టు 1 కి క్యాలికో బైండ్ రు. 25
విడిసంపుటము, (కట్ బైండింగ్) రు. 5-

8 మహాభారతయుద్ధము :- నియంతృత్వము, ప్రచ్ఛన్న నియంతృత్వము, ప్రజాస్వామికము, దాని యాభాసము, సామ్య, ప్రగతి, పలాయన, భాగ్య, సామ్రాజ్య, వాదములు, శాంతి యుద్ధ ఆధ్యాత్మికాది పద్ధతులతో ఆధునిక రాచకీయ పరిస్థితులఁదెలుపు పౌరాణికనాటకము (సరళవచనరచన) రు, 2-00

9 మహాత్మా గాంధీ :- (పరిష్కృత శ్రీ కృష్ణావతార తత్త్వము)
100 శ్లోకములు (తెలుగు అర్థముతో) రు. 0-50

10 వేమగీతా (ప్రథమ-సహస్రమ్) 1000 ఆటవెలది వేమనపద్యములు,
వానికి సంస్కృత శ్లోకములు. రు. 2.00

11 వేమగీతా (ప్రథమ సహస్రమ్) విషయవిభాగములో శ్రుతి, స్మృతి పురాణేతిహాసాది పూర్వగ్రంథోదాహరణములు కల్గిన తెలుఁగువివరణము. రు.

12 వేమగీతా (ప్రథమ సహస్రమ్) నాగరలిపి శ్లోకము, సి. పి. బ్రౌన్
ఆంగ్ల వ్యాఖ్య. రు.

## శ్రీ రామనృసింహ గ్రంథ రత్నమాల,
## తోలేరు.

(వయా) వీరవాసరం, ప॥ గో॥ జిల్లా (ఆంధ్ర)